

# ఆధునిక పద్ధతిలో డిష్‌వాషింగ్ గురించి అన్ని విషయాలూ తెలుసుకోవాలని మీ కోరిక... కాని ఎవరిని అడగాలో తెలియదు.

**పాత్రల్ని మరింత సులువుగా తోముకునే మార్గమేదైనా వుందా?**

తప్పక వుంది చూడండి కొత్త విమ్ డిష్‌వాష్ లిక్విడ్ తో, తోముకోవలసినవాటి సంఖ్యని బట్టి మూడు సులభమైన పద్ధతులున్నాయి



1) రోజూ తోముకునేందుకు మోతాదు
ఒక గిన్నెడు నీటిలో, ఒక చెంచాడు లిక్విడ్ క్లీనర్ కలపండి ఆ మిశ్రమంలో ఒక స్పాంజ్‌గాని, స్క్రబ్బర్‌గాని ముంచండి పాత్రల్ని దాంతో తోమి, కడగండి



2) బోలెడు తోముకునేందుకు మోతాదు
ఒక టబ్ లేదా బకెట్ నీటిలో (వెచ్చగా ఉంటే మంచిది) రెండు పెద్ద చెంచాల లిక్విడ్ క్లీనర్ కలపండి మీ పాత్రలన్నీ అందులో ముంచండి కాస్సేపటి తర్వాత వాటిని బయటికి తీసి, స్పాంజ్‌తో లేదా స్క్రబ్బర్‌తో తోమి, కడగండి



3) పరిమితంగా తోముకునేందుకు మోతాదు
ఒకసారికి ఒకటి రెండు పాత్రలు తోముకోవాలంటే, ప్రతి పాత్రకీ ఒకటి లేదా రెండు చుక్కల లిక్విడ్ క్లీనర్, స్పాంజ్ లేదా స్క్రబ్బర్ మీద నేరుగా వేసి, దాంతో తోమి కడగండి

**మరి పొదుపు మాట?**




విమ్ డిష్‌వాష్ లిక్విడ్ లో, ఇతర క్వాలిటీ లిక్విడ్ క్లీనర్‌లకన్నా ఎంతో ఎక్కువ శుభ్రపరిచే **శక్తి**వుంది పరీక్షల్లో తేలినదాని ప్రకారం, కేవలం **ఒక్క లీటర్ 10,000 కి పైగా పాత్రల్ని** శుభ్రపరుస్తుంది. తళతళలాడేలాగ!

**మా పనిమనిషి వృధా చేస్తే?**



విమ్ డిష్‌వాష్ లిక్విడ్ **అతి చిక్కటిది.** అందేత మీరు చేయవలసిందల్లా, మీ పనిమనిషికి ఒక చెంచాడు లిక్విడ్ క్లీనర్ ఇచ్చి, దాన్ని పదింతల నీటిలో కలపమని చెప్పడమే నమ్మండి నమ్మకపోండి, మీరు రోజూ తోముకునేవాటి కోసం ఈ మాత్రం చాలు! పైగా ఈ పద్ధతిలో వున్న హాయి ఏమిటంటే, మీ పనిమనిషికి దీన్ని వృధా అవుతుందన్న బెంగ లేకుండా (ఒక చెంచాడు కాన్సంట్రేటెడ్ లిక్విడ్ గాని, లేదా మీరే దాన్ని నీటిలో కలిపిగాని) నిర్భయంగా ఇవ్వచ్చు!

**ఇది కడిగితే సులభంగా వదిలిపోతుందా?**



విమ్ డిష్‌వాష్ లిక్విడ్ చెదిరిపోయి, సులభంగా వదిలిపోతుంది— ఏమాత్రం మిగలదు అందేత మీరు కొద్దిపాటి నీటితో ఎన్నో పాత్రలు కడుక్కోవచ్చు **నీటికి కొరతగా వున్న ప్రాంతాల్లో ఇదొక వరం!**

**ఇది అన్ని రకాల పాత్రల్నీ శుభ్రపరుస్తుందా?**



విమ్ డిష్‌వాష్ లిక్విడ్ ఎంత అనువైనదంటే, ఇది ఏ రకం **పాత్రనైనా** సరే శుభ్రపరుస్తుంది— విలువైన టేబుల్‌వేర్ మొదలుకొని పెద్దపెద్ద పాత్రల వరకూ అయితే వాటిని శుభ్రపరిచే పద్ధతి మాత్రం వేరువేరుగా ఉంటుంది

**విలువైన టేబుల్‌వేర్ కోసం** మీ చైనా, గాజు, పోర్సెలెయిన్, మెలామైన్, థెర్మోవేర్, నాన్-స్టిక్‌వేర్, స్టెయిన్‌లెస్ స్టీల్ కట్లెరీ, డిషెస్ మొదలైనవాటి మీద విమ్ డిష్‌వాష్ లిక్విడ్ ని ఒక స్పాంజ్‌తో ఉపయోగించండి దీనిలోని శక్తివంతంగా శుభ్రపరిచే చర్య, వాటిని ఏమాత్రం గీతలు పడకుండానే తళతళలాడేలా చేస్తుంది



**పెద్దపెద్ద పాత్రల కోసం** మీ ప్రెషర్ కుక్కర్, మూకుడు, ఫ్రయింగ్ పేన్, పాల కుక్కర్ మొదలైనవాటి మీద విమ్ డిష్‌వాష్ లిక్విడ్ ని ఒక స్క్రబ్బర్‌తో ఉపయోగించండి దీనిలోని శక్తివంతంగా శుభ్రపరిచే చర్య, స్క్రబ్బర్ రాపిడి — ఈ రెండూ కలిసి మాడుమరకల్ని, జిడ్డుని, అడుగంటి మాడిపోయిన ఆహారపు మిగుళ్లని వదలగొడతాయి

మీరు విమ్ డిష్‌వాష్ లిక్విడ్ గురించి ఇంకా ఏమైనా తెలుసుకోవాలనుకుంటే, మీ ప్రశ్నలని ఈ అడ్రస్‌కి పంపండి
విమలా సమజ్‌దార్, విమ్ డిష్‌వాష్ ఎడ్వయిజరీ సర్వీస్, పోస్ట్ బాక్స్ నం 409, బొంబాయి-400 020




# విమ్
డిష్‌వాష్ లిక్విడ్



# ఒక్క చెంచాడు... తోమే పాత్రలు బోలెడు

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS VL 18 2317 TL

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

సంపుటి: 83 | విజయవాడ | వెల రు. 4/-

శకసం. 1912 కార్తీక మాసం 4వ తేదీ

సంచిక: 10 | 26-10-1990 | పేజీలు: 76


## విషయానుక్రమణిక

### సీరియల్స్:


ప్రణయవల్లరి ... యర్రగుంట్ల వరలక్ష్మీదేవి ... 6
భారతమహాకవిత్రయం ... భాగవతుల సుబ్రహ్మణ్యం .. 40
సాగరమథనం ... అడివి సూర్యకుమారి .. 52
మోహినీతాండవం ... కొత్తరవీంద్రబాబు .. 66


### కథలు:


రహస్యం ... ఎం.వి ఎస్ ఎస్.ప్రసాద్ . 16
తుమ్‌కిత్నీ ఖూబ్‌సూరత్‌హో .. పి ఇందిరాదేవి . 22
బాలాసుందరి ... అవధానుల సుధాకరరావు . 46
సుఖాంతం ... రాధానాధ కొండపి . 51
కరతలామలకం ... ఆర్. సుధేష్ణ . 60


### శీర్షికలు:


సంపాదకీయం . ... .. 4
మీకు తెలుసా? .. ... 9
ప్రశ్నావళి . . .. 14
హల్లోడాక్టర్ నేనేం చెయ్యాలి ... .. .. 19
డెంటల్ హెల్త్ క్విజ్ ... . .. ... 26
ఈవారంలో మీయోగం ... ... . . 33
అలనాటిమేటి చిత్రాలు ... .... .. 34
అమర్‌నాధ్ ... ... . . 36
సినిమా-సినిమా ... .... .. 38
న్యాయచట్టం ... .. . ... 50
'పరుగు లరాణిగుడ్‌బై ... . .. ... 59
వీక్లీపోస్టు ... .... ... 73


ముఖచిత్రం బ్రూక్‌షీల్డ్
ఫోటో: జగ్‌మోహన్




Editorial Adviser S RADHAKRISHNA, Editor VEERAJI,
Printed and Published by S NAGESWARARAO for NageswaraRao Estates Ltd.,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520 003
Phones Editorial 75667, Business 61247, 61248


# సంపాదకీయం

## మిహాయిల్ గోర్బచేవ్‌కి సముచితమైన కానుక

సోవియట్ యూనియన్ ప్రెసిడెంట్ మిహాయిల్ గోర్బచేవ్‌ని ఎట్టకేలకు ప్రపంచ శాంతి దూతగా నోబెల్ బహుమతి సంఘం అంగీకరించి 1990 నోబెల్ బహుమతిని అతని పేర ప్రకటించింది లోగడ కూడా శ్రీ గోర్బచేవ్ పేరు శాంతి బహుమతి జాబితాలో కెక్కింది కాని యిప్పుడే - సోవియట్ నాయకునికి శాంతి నోబెల్ బహుమతి రావడమే యెంతో సబబుగా వుంది 1975 సంవత్సరంలో న్యూక్లియర్ ఫిజిక్స్ శాస్త్రవేత్త, మానవ హక్కుల ఉద్యమ నాయకుడు అయిన ఆంద్రీ సెఖరోవ్ మహాశయునికి నోబెల్ శాంతి బహుమానం వచ్చిందన్న సంగతి మనకి వెంటనే జ్ఞాపకం వస్తుంది కాని నాటికి నేటికీ ప్రపంచంలో - ప్రాక్ పశ్చిమ దేశాల మధ్య నెలకొని వున్న సంబంధ బాంధవ్యాలలో ఎంత తేడా? సెఖరోవ్‌కు యీ బహుమతి రావడాన్ని "సోవియట్ యూనియన్" నాడు హర్షించలేదు ఆయన ఆ బహుమతిని అందుకొననే లేదు - బందీఖానాలో వున్నవాడు దేశం వొదిలి వెళ్లి ఎట్లా అందుకుంటాడు! నాటికి 14 సంవత్సరాల తరువాత అప్పటి శాంతి బహుమతి విజేతకు గోర్బచేవ్‌గారే విముక్తి ప్రసాదించాడు

ఈ సంగతి జరిగి పదిహేను సంవత్సరాలైంది ఈ మధ్య కాలంలో ప్రపంచ రాజకీయ పటం ఎంత మారిపోయిందో గమనిస్తే ఆశ్చర్యంగాను కొంత మనశ్శాంతిగాను కూడా వుంటుంది మారణాయుధాల గుట్టల మీద - దురహంకారపు బావుటాలు ధరించి - అమెరికా, రష్యాలు ప్రపంచాన్ని "అటు యిటు" అనే దుర్భర దుస్సహ భాగాలుగా చీలుస్తూ చాలా కాలం కూర్చున్నాయి సోవియట్ యూనియన్ ప్రజలు యినుప తెర వెనుక పంజరంలో బంధింపబడ్డ ఆరోగ్యవంతమైన పక్షుల్లాగా "యంత్రవతు" జీవితాన్ని గడిపేవారు అయితేనేం సోవియట్ యూనియన్ అగ్రనాయకుల

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు: దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు సంపాదకులు: శివలెంక శంభుప్రసాద్ (1938-1972)

ఎడిటోరియల్ ఎడ్వయిజర్ శివలెంక రాధాకృష్ణ ఎడిటర్: వీరాజీ ముద్రాపకుడు ప్రచురణకర్త శివలెంక నాగేశ్వరరావు

తీసుకున్న నిర్ణయాలు ప్రపంచంలో అల్లకల్లోలాల్ని; భూప్రకంపనాల్ని; ఆందోళనను కలిగిస్తూ వుండేవి - పాశ్చాత్య దేశాలకు నాయకురాలిగా అమెరికా దేశం మీసాల మీద "అణుబాంబ్"లను పెట్టుకుని విర్రవీగుతూ అవకాశం దొరికిన చోటల్లా తన "తుపాకీ మడమ"ను పెడుతూ యెంతో ఉపద్రవాన్ని - మనో వేదనను కలిగిస్తూ వుండేది - ప్రపంచంలో తూర్పు - పడమరలు, ఉత్తర దక్షిణాలు అనే దిక్కులు చక్కగానే వున్నా - ఆయా దేశాల్లో గల ఆయా దిక్కుల ప్రాంతాలను రెండుగా చీల్చి - వైరం పెంచి, చెరో కొమ్ము కాస్తూ వాటి మధ్య "యుద్ధం" తగిలించి - తమాషా చిత్తగించే అగ్రదేశాల ఉగ్ర ఉన్మాద విధానాలు యిటీవల కాలంలో కారుమబ్బులు విడి నట్టు విడిపోలేదా? శిఖరాగ్ర సమావేశాలేగాని ప్రపంచంలో శిఖరాల మధ్య గల "అగాధాలు" మరింత గాఢాంధకారమై పోయి - ప్రచ్ఛన్న యుద్ధ భయం - సామాన్య ప్రజానీకాన్ని - ప్రభుత్వాలను కూడా ఒక్కలాగే ఆవహించి పీడించ లేదా? అటువంటి సమయంలో "యిప్పుడు వీస్తున్న గాలి" వాలును గ్రహించిన శ్రీ మిహాయిల్ గోర్బచేవ్ - తన దేశ ప్రజల అంతర్మథన జ్వాలాముఖాలుగా వుండటాన్ని, ప్రపంచ ప్రజలు "ప్రచ్ఛన్నయుద్ధ" కారక దేశాల మీద న్యూనతాభావం కలిగి ఉమ్మస్సుగా వుండటాన్ని గ్రహించారు. ప్రపంచ చరిత్రలో మంచికైనా చెడ్డకైనా మలుపు రావాలని సాహసించిన వీరునిగా అందుకే వాసికెక్కాడు ఆయన. "రష్యా"లో తెరలు, అరలు, ఆంక్షలు, సిద్ధాంత ముసుగులు యివన్నీ లోపలి లోపలే వుండి సమగ్రతా మూలానికే ముప్పు తెస్తాయని గ్రహించాడాయన. మనిషికి కూడూ, గూడూ, గుడ్డా - యితరుల మీద పెత్తనం చెలాయించే సరంజామా వుంటేనే చాలదు. మరేదో స్వేచ్ఛాన్వేషణకి తన ప్రజలు వెంపర్లాడుతున్నారు - దాన్ని కేవలం పాశ్చాత్య నాగరికతా వ్యామోహంగా కొట్టిపారేయరాదన్న సత్యాన్ని గ్రహించిన మిహాయిల్‌గారు - యింట గెలిచి రచ్చ గెలిచే ప్రయత్నానికి పూనుకున్నాడు. బాహాట విధానానికి - స్వేచ్ఛాయుత భావ ప్రకటనకి - "కిటికీలు" తెరిచాడు. "గ్లాస్‌నోస్త్" "పెరిస్త్రోయికా"లను పాలన చేసిన వారే అటు తరువాత శ్రీ గోర్బీ రాజకీయ చాతుర్యాన్ని ప్రశంసించారు - అమెరికాలో ఆకాశ యుద్ధాలకు - అణ్వస్త్ర బలపరీక్షకి - యుద్ధోన్మాద సైనిక జోక్యాలకు కత్తులు నూరడం మాని - మధ్యతరహా అణ్వాయుధాల కుప్పలను తొలగించుకుందామని - పచ్చజెండా పట్టుకొని బయలుదేరాడాయన. అట్టి వొప్పందాన్ని సాధించాడు కూడా. సోవియట్ యూనియన్ సరిహద్దులలో గల రాజ్యాలలో అటు ఆశియా సరిహద్దు ప్రాంతాలలో - యిటు ఐరోపా అంచున గల రాజ్యాలలో తల ఎత్తిన జాతి విముక్తి ఉద్యమాల అణచివేతలో సంయమనం పాటించాడు. తూర్పు ఐరోపాలో వచ్చిన మార్పులకు శ్రీ గోర్బీ అడ్డుగోడగా నిలబడలేదు - భూమ్మీద ప్రచ్ఛన్న యుద్ధానికి, దేశంలో అంతర్గత యుద్ధాలకి కూడా ఆయన దోహదించలేదు - కమ్యూనిజాన్ని - లెనినిజాన్ని - మార్క్సు సిద్ధాంతాన్ని - తన పిరికితనంతో, స్వార్థ కీర్తి కాంక్షతో సోవియట్ యూనియన్ నుంచి తూర్పు ఐరోపా నుంచి వెడలనడిపే ఉద్యమాలకు రెండు చేతులా దోహదిస్తున్నాడని ఆయనను కొందరు కమ్యూనిస్టు పిడివాదులు అంటున్నప్పుడు కూడా మిహాయిల్ గోర్బచేవ్ చలించకపోగా మొట్టమొదటిసారి "రష్యాలో" ప్రజాస్వామ్య పద్ధతిలో పార్లమెంటులో ఎన్నికలు నిర్వహించి - తాను అత్యధిక మెజారిటీతో తొలి సోవియట్ అధ్యక్షునిగా ఎన్నికయి - ప్రజల అభిమతం యెటు మొగ్గుతున్నదో నిరూపించాడు - యుద్ధోన్మాదంతో సిద్ధాంత మూఢనమ్మకంతో ప్రపంచాన్ని, తన ప్రజల్ని - ప్రపంచ తటస్థ దేశాల ప్రజల్ని కూడా సమిధలుగా విసిరి వేసే ప్రమాదాన్ని తప్పించడంలో శ్రీ గోర్బచేవ్ అనుసరించిన కొన్ని విధానాలు పెట్టుబడిదారీ దేశాలకు ఆయన లొంగిపోయాడన్న అపవాదుని కల్పించినా "జానేదేవ్" - "సర్వే జనా స్సుఖినో భవంతు" అనుకున్నాడు సోవియట్ యూనియన్ అధ్యక్షుడు - ప్రపంచ శాంతి కాముకుడు అయిన శ్రీ మిహాయిల్ గోర్బచేవ్ - నిర్భయంగా తన విధానాలతో ముందుకు నడిచాడు - ప్రజల వ్యక్తిగత విశ్వాసాలు - సామ్యవాద సిద్ధాంతాలకి మధ్య "రాజీ" యెప్పుడూ వుంటుందన్న - సత్యాన్ని ఆయన అయాచితంగానో - ప్రయత్నపూర్వకంగానో రష్యాలో ఆవిష్కరిస్తూ - యింతకాలం పేరు గొప్ప వూరు దిబ్బగా మిగిలి వున్న ఐక్యరాజ్య సమితికి - ఆ మహా సంస్థకు అవసరమైన ప్రతిష్ఠనూ, బలాన్ని - ప్రభావాన్ని, చేవనూ సమకూర్చే పద్ధతిలో తను కూడా చేయి కలిపి ముందుకు కదిలాడు. అంచేతనే గల్ఫ్ సంక్షోభం పెట్రోలు మంటలై యింకా ప్రపంచాన్ని చుట్టు ముట్ట లేదు - అమెరికా నౌకలు అల్లంత దూరానే వుండే సమితి పెద్దరికాన్ని మన్నిస్తున్నాయి. మనం శ్రీ గోర్బీ షష్టి పూర్తికి సరియైన కానుకగా శాంతి నోబెల్ బహుమతి అందిందని హర్షించినా తప్పులేదు. శ్రీ ఆంద్రీ సెఖరోవ్ యివాళ బ్రతికి వుంటే ఎంత సంతోషించేవాడో కదా! మానవ హక్కుల మీద మాటలు గాక చేతలకు అవకాశం కలిపిస్తూన్న శ్రీ గోర్బచేవ్‌కి ప్రపంచంలో ప్రచ్ఛన్న యుద్ధఛాయలు తిరిగి పడగూడదనే ప్రయత్నంలో విజయం లభించాలని అందరూ కోరుతున్నారు.

○




<u>**ఇంతవరకూ సాగినకథ- *6:***</u> నాటకాల పిచ్చివున్న రామకృష్ణ, గణపతి స్నేహితులు నాటకాల్లో హీరోయిన్‌గా వేసే రజనికి సినిమాపిచ్చి వుండటంతో రామకృష్ణ ప్రేమించటం మానేస్తాడు అలహాబాద్‌లో లా చదివేందుకు వెళ్లిన రామకృష్ణకు- సిన్హా, రబీన్ స్నేహితులవుతారు సిన్హా తన చెల్లెల్ని పెళ్లి చేసుకోమని రామకృష్ణను అడుగుతాడు సెలవుల్లో విశాఖవస్తున్న రామకృష్ణకు అనుకోకుండా నవనీత తారసపడటం, ఒకనాడిద్దరూ సినిమాహాల్లో కలుసుకోవటం జరుగుతుంది ఈ విషయాన్ని గణపతి ఆరాతీస్తాడు

(గత సంచిక తరువాయి)

ఆ నాడు ఆదివారం రామకృష్ణ ఆ రోజు కోసం యెంతో ఆతురతతో ఎదురు చూసేడు రానే వచ్చింది ఆ రోజు

సూర్యుడు ఉదయించడం, అస్తమించడం ఈ ప్రకృతిలో అతిసహజమైనవి కాని ఒక్కొక్క రోజు ఒకో ప్రత్యేకతను సంతరించుకుంటుంది ఒకో సంఘటన మన హృదయానిక హత్తుకునిపోతుంది నవనీత తనను కలియడానికి వచ్చింవంటే, ఆమెను తను ఆకర్షించినట్లే ఆమెకు కూడ తనను కలవాలని, సంభాషించాలని ఉబలాట మున్నట్లేగా కలవకపోతే ఆమెకు తనంటే ఎమి అభిమానం లేనట్లే గతంలో ఆమె తనతో ఆ ట్రెయినులో ప్రయాణం చేసినపుడు ఎంతో చనువుగ ఉంది ఎంతో ఉల్లాసంగ ప్రవర్తించింది కాని సంగమ్ సినిమా హాల్లో ఏమిటో అంటీ అంటనట్లు ముభావంగ ఉంది, బహుశా చెల్లెలు స్నేహితురాలు ఉన్నారనేమో

అలా ఏమేమో తలబోస్తు రామకృష్ణ ఆ బీచి ఒడ్డున, కేంటిన్ ముందర నవనీత కోసం వెచి ఉన్నాడు అలా సాయంత్రం నాలుగున్నర నుండ ఏడు గంటల వరకు చూచి, ఆమె రాకపోయేసరికి చాల విసుగు చెంది, ఆమెపై ఎంతో కోపాన్ని పెంచుకొని విసురుగ కారెక్కి ఇంటికి పోయెడు ఈ జన్మలో ఆమెను కలియకూడదనుకున్నాడు

నవనీతకు గుర్తుంది రామకృష్ణ ఆదివారం నాడు సాయంత్రం సముద్ర తీరాన తన కోసం యెదురు చూస్తుంటాడని అతడు తనను రమ్మని సినిమా థియేటరు ఆవరణలో చెప్పినప్పుడు, తనలో ఎన్నో విరుద్ధ భావాలు చెలరేగెయి ఇంటికి వచ్చింతరువాత, తర్జనభర్జనలు మనస్సులో జరిగేక వెళ్లామనే అనుకుంది, గాని ఆ మరునాడు దుర్గమ్మ ఇంటికి వచ్చి తనెవడతో నో సినిమాకు వెళ్ళిందని చెప్పడం, తను ఆవేశంతో అదంత నిజంకాదని చెప్పడం- అవన్ని తలచుకుంటేనే తనేదొ పొరబాటు చేసినట్లు భావన కల్గుతూంది తను ధైర్యంగ రామకృష్ణ గురించి చెప్పలేకపోవడం, ఆ విషయం దాచి పెట్టడంలోనే తను ఆ విషయాన్ని ఓ దోషంగ భావించినట్లేగ

తను ధైర్యంగ నిలబడగలదు, కాని రామకృష్ణ అంతర్యం తనకు బాగ తెలియదు ధనవంతుడు ఓ పెద్దింటివాడు తనతో సరదాగా కాలక్షేపం చేయడానికి తన పరిచయాన్ని కోరవచ్చుగా చనువును బాగా పెంచుకుంటే, ఈ ఆకర్షణ తనకు ప్రేమగ మారవచ్చు అప్పుడు స్త్రీగాతను కాలును వెనకకు తీసుకొనలేక పోవచ్చు అప్పుడు ఈ వ్యవహారం ఎలాంటి దుష్పరిణామాలకు దారి తీస్తుందో 'కయ్యానికైన, వియ్యానికైన సమాన హోదా ఉండాలన్నారు పెద్దలు అందులో నిజం లేకపోలేదు

మనం కండ్లు మూసుకుని పాలు త్రాగడం అంత మంచి పనికాదు ఆ త్రాగడం ఎవరైన చూడొచ్చు దాని ఫలితంగాదుర్గమ్మత్త, కామేశం లాంటి వాళ్ళు చిలవలు, పలవలు చేసి ఎన్ని అభాండాలన్నా వెయ్యొచ్చు అపవాదులను భరించే వయస్సుగాని, స్థోమత గాని, సాంఘిక స్థితి గాని తనకు లేవు

ముప్పైబై సాయంత్రం అయిదు నుండి ఎనిమిది గంటల వరకు అలా ఏమేమో ఆలోచిస్తు తన గదిలోనే కూర్చుండిపోయింది తను ఎంతో

ఆరాటాన్ని, బాధను పొందింది రామకృష్ణ తలంపు తనలో ఓ చిన్న తుపాను లేవదీస్తున్నదని గ్రహించింది తను బలహీనతకు లోను కాకూడదు తనకు గాని, తన కుటుంబానికి గాని అప్రతిష్ఠ గాలి సోకకూడదన్న నిర్ణయానికి వచ్చింది

రెండవ సంవత్సర చదువుకు రామకృష్ణ అలహాబాదు వెళ్ళిపోతున్నాడంటే, ఆ తల్లి శాంతాదేవి ఆరాటపడజొచ్చింది ఒక్కగానొక్క కొడుకు... మని రెండు నెలలైనా తనతో గడపక వెళ్ళిపోతున్నాడు ఊరులో చదువైతే పిల్లడు తన కళ్ళ ముందరే మెదిలేవాడు క్రమశిక్షణ పేరిట తన అన్నయ్యే ఈ పని చేసేడు వాడిని దూరం చేసేడు

"ఈ పట్నంలో ఉంచితే నీ కొడుకు మరో నాటకాల దాన్ని కట్టుకుంటానంటాడు. అప్పుడు నువ్వే గోల పెడ్తావు చూడు వాడు బుద్ధిగా చదువుకుని లాయరైతే, నీ భర్త కూర్చున్న కుర్చీలో కూర్చుని లా ప్రాక్టీసు చేస్తుంటే జీవితమంతా చూసుకుని ఆనందించేది నువ్వు గాని నేను కానుగా వాడికి ఈ ప్రాక్టీసు ఎప్పుడు అప్పచెప్తామా, ఎప్పుడు నేను నా కొడుకు దగ్గరకు పోదామా అని నేను మీ వదిన యెదురు చూస్తున్నాం అందుకే శాంతమ్మా' ఈ రెండు సంవత్సరాలు



ఒర్చుకో," అని బోధన చేసేడు నరసింహం.

"ఎందుకమ్మా ఈ తినుబండారాలన్ని నువ్వు, అత్తయ్య, వంటలక్క రెక్కలు ముక్కలు చేసుకుని తయారు చేస్తున్నారు. నాకు తెల్సు అలహాబాదులో మంచి స్వీట్సు దొరకుతాయని, అక్కడ సింగడాలు, నిమ్కీలు, కచోడీలు బాగా చేస్తారు. ఈ లడ్డూలు, మైసూరు పాకులు, ఈ ఖారంపూస, ఈ చేగోడీలు, ఈ సున్నిపిండి ఉండలు దేనికమ్మా" అని రామకృష్ణ ప్రేమతో తల్లిని అడిగేడు.

"అదికాదురా రామ్ముడు- మొన్నటి దాకా నీకెంతో ప్రియమైనవి ఈ నాడు నీకు




విసుగనిపిస్తున్నాయా? ఆ బజారులో అమ్మేవి ఆ పాడు నూనెతో మరిగించి, మరిగించి చేస్తారు. ఆరోగ్యం పాడవుతుంది. వీటిని నేతితో చేయిస్తున్నాను, నీకిష్టమని. నువ్వు నీ స్నేహితులు ఆ రబీన్, సిన్హా ఓ అయిదు రోజులు తినొచ్చు. నువ్వద్దంటావు గాని, నేను అన్నీ చేయించి నెలనెలా నీకు పంపాలనుంటుంది," అంది ప్రేమతో కొడుకు తల నిమురుతూ. మేనత్త చూస్తూ సన్నగ నవ్వుతూంది, వారి అనుబంధానికి మురిసిపోతు- మరి తనూ అట్లాంటి తల్లే గనుక.

మామయ్య మళ్ళ భగవద్గీతలో మరో అధ్యాయము కర్మ సన్యాసయోగము బోధించేడు. రామకృష్ణ శ్రద్ధగా విని, అంత శ్రద్ధగ ఆ సాయంత్రమే మరచి స్నేహితులతో గడపడానికి పోయేడు. ఆ మరునాడే రామకృష్ణ ప్రయాణం.

నవనీతకు గుర్తుంది ఆ రోజే రామకృష్ణ ప్రయాణమని. ప్రొద్దుటి నుండి ఎంత ఆలోచించకుండ ఉందామన్న, అతడి గురించి తలంపులే ఆమెను వెంటాడేయి. అతడు వేడుకున్నా తను ఆదివారం బీచికి వెళ్ళలేదు. అతడు తన గురించి ఆతురతతో ఎంత సేపు ఆ బీచి దగ్గర వేచి ఉన్నాడో! ఎంత నిరాశ చెందేడో! తనని తిట్టుకుంటు వెళ్ళి పోయుంటాడు. తన గురించి ఏమనుకొని ఉంటాడో!

తను అతన్ని కలియడానికి ఎందుకు భయపడిపోయింది? తన కిష్టంలేని మాటను గాని చర్యను గాని అతడు సహించడే. అంటే అతడి గురించి భయం కాక తన మనస్సు మీద నమ్మకం తనకే లేదన్నమాట. రామకృష్ణ అన్ని విషయాలలో తనకన్న ఉన్నతుడు అని తను అంగీకరించింది. అతడితో స్నేహం, తనలాంటి బీదపిల్లకు ఎట్లాంటి దుష్పరిణామాలకు దారి తీస్తుందో అనేకద తన భయం. అందుకేగా తను అతడి స్నేహాన్ని కాంక్షిస్తున్నా, పెంచుకోలేక తన కుటుంబాన్ని తలచుకుని, తమ చుట్టు ఉన్న తమ స్థాయికి తగినట్టున్న ఆ చిన్న సాంఘిక పరిధిని దాటడానికి వెరచి దూరంగ ఉండిపోయింది. రామకృష్ణ తన గురించి చాల విరుద్ధంగ భావించి ఉంటాడు.

అతనితో ఆ నాటి రైలు ప్రయాణం యెంత మధురంగ ఉంది! అది వేరు- తమని చూసి ఈసడించడానికి గాని, చెవులు కొరుక్కొందుకు గాని ఎవ్వరు లేరు. తన మనస్సు కప్పుడు ఎంతో స్వేచ్ఛ లభించింది. ఇంతకీ తనకు రామకృష్ణపై ఎట్లాంటి అభిమానముంది? దాని పేరునాలి- ఆకర్షణా, అనురాగమా. ప్రేమా? ఏమో తనకే తెలియదు. రామకృష్ణ దీపం లాంటి వాడు. తను అతనికి చేరువవాలని కాంక్షిస్తూంది. కాని చేరింతరువాత దీపం పురుగులా కాలి మసి అయిపోతానన్న జంకు కల్గుతూంది. ఒవేళ ఆ దీపం చల్లని కాంతిని మాత్రమే ప్రసరింపజేసినదైతే తను ఆ వెలుగులో ఆహ్లాదపడొచ్చు, ఆనందించవచ్చు.

నవనీత ఏమేమో ఆలోచించి ఆఖరికి ఓ నిర్ణయాని కొచ్చింది. తన అంతరంగంలోని భావం ఓ నిర్దిష్టమైన రూపం దాల్చేవరకు తను వేచి ఉండాలి. అతడిని నొప్పించి ప్రయోజనం లేదు. అలాగని తను ఆవేశాన్ని, ఆతురతను చెందకూడదు. అప్పటికి ఆమెకు ఓ ప్రశాంతత కల్గింది. తను ఆ మధ్యాహ్నం కలకత్తాకు పోయే మెయిలుకు స్టేషనుకు వెళ్ళి, ఓసారి అతడిని కలసి బై బై చెప్పిరావాలని నిర్ణయించుకొంది.

మధ్యాహ్నం త్రోవలో అరడజను ఏపిల్సు కొనుక్కొని ఓ ప్లాస్టిక్ సంచీలో పెట్టుకుని స్టేషనుకు చేరింది. దూరం నుంచి బండీని చూసుకుంటు వెళ్ళేసరికి ఫస్టు క్లాసు కంపార్ట్‌మెంటులో కిటికీ వద్ద కూర్చునున్నాడు. ఆ కిటికీ చేరువలో చాల మంది ఉన్నారు. దూరం నుంచే వాళ్ళందర్ని పరికించింది నవనీత. ఆ ఎత్తుగ, పుష్టిగ ఉన్నతను అతని మేనమామ నరసింహం అవచ్చు. ఆ

తెల్లగ, పొడవుగ, హుందాగా ఉన్నావిడ రామకృష్ణ తల్లి కావచ్చు. మిగతా వారు స్నేహితులు తదితర బంధువులు కావచ్చు. అంత మంది జనం మధ్యకు వెళ్ళి రామకృష్ణను పలకరించడం సాహసమే అవుతుంది, అని జంకిపోయింది నవనీత.

దూరం నుండే ఆ తల్లిని గమనించింది శ్రద్ధగ. ఆవిడ కట్టుకున్నది సింపుల్‌గా నున్న ఖరీదైన సిల్కు చీరలాగుంది. మెడలో నాలుగు పేటల చంద్రహారాలు, ఒంటిపేట ముత్యాల గొలుసు ఉంది. చెవులకు వజ్రాల దుద్దులున్నాయి. తలలోని వెంట్రుకలు అక్కడక్కడ నెరసినా మొత్తం మీద నల్లనైన ఒత్తైన జుత్తు. మనిషి అందంగ ఉంది ఆమెను చూసి రామకృష్ణను మరి చూడనవుసరం లేదు ఇద్దరిది సుమారుగ ఒకటే రూపు ఆ మేనమామకు ఎత్తుకు తగ్గ లావుంది బొద్దు మీసాలతో గంభీరంగ ఉన్నాడు నవనీత చేతిలోని ప్లాస్టిక్ పండ్ల సంచీతో అలా దూరంగానే, పెట్టె వైపు చూస్తూ నిలబడి పోయింది

ఇంతలో సిగ్నల్ ఇచ్చేరు, గార్డ్ విజిల్ వేసేడు. కిటికి దగ్గరున్న వారు ఒక్కొక్కరు రామకృష్ణ చేతిని అందుకుని ఊపి వదిలేసేరు రామకృష్ణ తల్లికి, మేనమామకు నమస్కారం పెట్టేడు నవనీత ఆరాటం ఎక్కువ కాజొచ్చింది రామకృష్ణ తలెత్తి ఆమెను చూడలేదు వెళ్ళిపోతున్నప్పుడు తనని చూడకపోతే తను చెప్పినా, స్టేషనుకు వచ్చి తనను కలియలేదంటే, తన గురించి ఏమేమో భావించి తనని పూర్తిగ తన ఆలోచనల నుండి తప్పించి వేస్తాడేమో, నన్న భయం కల్గింది నవనీతకు

బండి కదిలింది మెల్లగ. ఆ ప్రక్క నుంచి పోతున్న ఓ పోర్టర్ను పిలిచి, వాడి చేతిలో అర్ధ రూపాయి బిళ్ళను పెట్టి- "అదిగో ఆ ఫస్టుక్లాసు పెట్టెలో, ఆ కిటికి దగ్గరున్న ఆ నీలిగళ్ళ చొక్కా అతనికి పరుగెత్తుకుని వెళ్ళి ఈ సంచి ఇచ్చేయి" అని నవనీత చెప్పింది.

బండి కాస్త వేగాన్ని పుంజుకుంటుంది పోర్టరు పరుగెత్తుకుని వెళ్ళి,

# మీకు తెలుసా?

## ఎక్కువ సినిమా పుస్తకాలు వ్రాసిన రచయిత

భారతీయ సినిమాపై ఎక్కువ పుస్తకాలు వ్రాసిన ఘనత ఫిరోజ్ రంగూన్‌వాలాకు దక్కింది ఆయన 15 పుస్తకాలు వ్రాశాడట. వాటిల్లో '75 సంవత్సరాల భారతీయ సినిమా' అనే పుస్తకం కూడా చోటు చేసుకుంది.

## సివిలియన్ అవార్డు

చిత్రరంగానికి చేసిన సేవలకు గుర్తింపుగా ఫ్రాన్సులోని అత్యున్నత సివిలియన్ అవార్డు అందుకున్న భారతీయ చిత్ర నిర్మాత సత్యజిత్‌రే 1989



ఫిబ్రవరి 2న ఫ్రెంచి అధ్యక్షుడు ఫ్రాంకోయిస్ మిట్టరాండ్ ఈ అవార్డు అందజేశారు

## ఆసియాలో పెద్ద స్టూడియో

ఆ మద్రాసులోని విజయ- వాహినీ స్టూడియోలు ఆసియాలో కెల్లా పెద్దవి ఈ స్టూడియోలో 20 సౌండ్ స్టేజీలు, ఔట్‌డోర్ షూటింగ్‌కు సంబంధించి అనేక గ్రౌండ్ ఫ్లోర్‌లు వున్నాయి

## చిత్ర సమీక్షలు వ్రాసిన పత్రిక

ప్రప్రథమంగా చిత్ర సమీక్షలు ప్రవేశపెట్టిన పత్రిక 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా' 1899లో తొలిసారిగా ఆ పత్రిక చిత్ర సమీక్షలు ప్రారంభించింది.

## పురాతన మ్యూజియం

మనదేశంలోని పురాతన మ్యూజియం కలకత్తాలోని ఇండియన్ మ్యూజియం. ఈ మ్యూజియం 1814 ఫిబ్రవరి 2న స్థాపించబడింది బెంగాల్‌కి చెందిన ప్రముఖ ఔషధ శాస్త్రవేత్త డాక్టర్ నథానియల్ వాలిచ్. ఈ మ్యూజియంను స్థాపించాడు.

## అంధుల పరికరాల మ్యూజియం

అంధులకు సంబంధించి ఉపయోగించే వివిధ రకాల వస్తువులను ప్రదర్శించే తొలి మ్యూజియం బొంబాయిలో వుంది. ఇది 1987లో ప్రారంభమైంది.

## పెద్ద మెడల్ గ్యాలరీ

పెద్ద మెడల్ గ్యాలరీ మన దేశంలో పాటియాలాలో వుంది. పాటియాలాకు చెందిన మహారాజా భూపిందర్ సింగ్ 3 వేలకు పైగా మెడల్స్‌ను సేకరించి షీష్‌మహల్ గ్యాలరీలో వుంచారు.

## ప్రథమ క్రీడామ్యూజియం

పాటియాలాలోని నేతాజీ సుభాష్ క్రీడా సంస్థలో ఏర్పాటైన జాతీయ క్రీడా మ్యూజియమే మనదేశంలో ప్రారంభమైన తొలి క్రీడా మ్యూజియం. ఈ మ్యూజియంలో వివిధ క్రీడల్లో మనదేశం గెలుచుకున్న పతకాలు ప్రదర్శనకు వుంచారు. ఈ మ్యూజియం 1972 మార్చి 4న ప్రారంభమైంది.

## చిన్న రాష్ట్రం

మనదేశంలోని రాష్ట్రాలలో అతిచిన్న రాష్ట్రం గోవా. 1987 మే 30న గోవాకు రాష్ట్రప్రతిపత్తి లభించింది. ఈ రాష్ట్ర వైశాల్యం 3,702 చదరపు కిలోమీటర్లు.

-తిలక్

రామకృష్ణకు ఆ పండ్ల సంచీని కిటికీలోంచి అందించి "ఆ స్తంభంకాడ నుంచున్న అమ్మాయిగారు ఇచ్చేరు" అని చెప్పేడు.

రామకృష్ణ తలెత్తి ఆ దిక్కుకు చూచేడు- నవనీత కనుపించింది. రామకృష్ణ మనస్సు ఆహ్లాద పడింది. నవనీత, చూపు కలియగానే, చేతిని ఊపి 'బై బై' చెప్పింది. ఆమె మనస్సు ఆనందంతో నిండింది. ఆరాటం పోయి రామకృష్ణ చేతిని ఊపేడు. మెయిలు ట్రెయిన్ వేగంగ అమితోత్సాహంతో ముందుకు దూసుకుని పోయింది.

తనొచ్చిన పని సాధించ గల్గినందుకు తేలికైన హృదయంతో నవనీత ఇంటికి బయలుదేరింది. స్టేషను ఫ్లాట్‌ఫారమ్ నుండి కదిల

## 10

మళ్ళీ కొత్త సంవత్సర చదువులకు కాలేజీలు తెరచేరు జూనియర్ విద్యార్థులు సీనియర్ విద్యార్థులయేరు. ప్రతి వ్యక్తిలోను సామూహికంగ ఉన్నప్పుడు కొంత రాతి యుగపు బుద్ధులు అలవడుతాయి కాబోలు. విజ్ఞాన వంతుల్లో ఈ బుద్ధులుండడం కొంత వికృతంగానే తోస్తుంది. మనం జన సమ్మర్దంగా నున్న రెండవ తరగతి రైలుపెట్టె ఎక్కేమనుకోండి అక్కడ కూర్చున్న ప్రయాణీకులు హాయిగ

## ప్రణయవల్లరి

ప్రక్కన బ్యాగును పెట్టుకుని కాళ్ళు పైకి పెట్టి కూర్చుంటే మనమేమంటాం? "అయ్యా! కాస్త ఆ కాళ్ళు క్రిందపెట్టి, ఆ బ్యాగును క్రిందుంచుతే నాలాంటి వాళ్ళు కూర్చోవచ్చు. దయచేసి కాస్త సర్దుకుంటారా?" అని. వాళ్ళేమంటారు- "దొరక్క దొరక్క ఈ ఇరుకు పెట్టే దొరికిందా? కాస్త ముందుకు పోయుంటే స్థలమున్న మరో బోగి దొరకునుకద. ఇంతకీ మా వాడు వస్తాడు. బాత్‌రూములోకి వెళ్ళేడు," అని దబాయిస్తారు. "మద్రాసు నుంచి వస్తున్నాం. ముందు స్టేషనులోనే ఈ కాస్త స్థలం దొరికింది. ఇది కూడ వదులుకొని నడుము, కాళ్ళు గుంట్లు పడేటట్లు కూర్చోవాలా?" అని ఎదురు ప్రశ్న వేస్తారు అబద్ధాలాడి. నిజానికి వాళ్ళు ముందు స్టేషనులోనే ఎక్కుంటారు. మద్రాసు ఎంత దూరముందో కూడ వాళ్ళకు తెలియదు. మనకి అట్లాంటి మానవత్వం లేని మనుష్యులను చూస్తే చెడ్డ కోపం వస్తుంది. మరి మనమేమి చేస్తాం?

మరో రెండు స్టేషనులు దాటగానే మనకి సీటు దొరకుతుంది. ఎవరో దిగిపోవడం వల్ల మనం బండిలో ఉండబట్టి. మరో స్టేషనులో మరెవరో ప్రయాణీకులు మనపెట్టె ఎక్కుతారు. అప్పటికి మనం ఆ పెట్టెలో నున్న సమూహంలో ఒకరమై పోతాం. అప్పుడు మనం కూడ ఆ వచ్చిన కొత్త వారిని చూసి విసుక్కుంటాం. సర్దుకుని వాళ్ళకు జాగా ఇవ్వం. ఇదో రకపు ప్రయాణీకుల మనస్తత్వం

అలాగే జూనియర్ విద్యార్థులను సీనియర్లు మొదట్లో కొన్ని ఇబ్బందులకు గురి చేస్తారు. ఒక్కొక్కప్పుడు ఆ సరసం విరసంగ పరిణమించి, దుష్పరిణామాలకు దారి తీస్తుంటుంది. దీనినే గౌరవంగా రాగింగు అంటారు. ఈ రాగింగు చర్య కొందరు విద్యార్థులలోని హింసాత్మక ప్రవృత్తిలో నుండి పుట్టుకొచ్చినది. ఈ జూనియర్ విద్యార్థులు ఈ సాడిస్టిక్ చర్యలవల్ల చాల బాధపడినా, వారే సీనియర్లు కాగానే ఆ మరుచటి సంవత్సరం కొత్తగ వచ్చిన కుర్రాళ్ళను బాధించడంకు కొందరు సీనియర్లు పూనుకున్నప్పుడు ప్రతిఘటించి, నివారించడానికి పూనుకోరు. పైగ ఆ హింసకు తోడ్పడుతారు కూడ.

ఇట్లాంటి వికృతపు, విపరీత సాడిస్టిక్ ప్రవృత్తి అత్త, కోడళ్ళ మధ్య గమనిస్తుంటాం. ఏ కోడలైతే తన అత్త చేతుల్లో బాధలకు గురైందో, ఆ కోడలే తరువాత అత్తగారవగానే అదే హింసాత్మక ప్రవృత్తితో, కక్ష తీర్చుకుంటున్నట్లు కొత్తగ వచ్చిన అమాయక కోడలుపై ప్రవర్తిస్తుంటుంది.

రామకృష్ణ హాస్టలులో చేరిన కొత్తలో సీనియర్ విద్యార్థులు కొందరు వీరిని రాగింగుకు గురిచేద్దా మనుకున్నారు రామకృష్ణ పొడవుగ, దృఢంగ ఉంటాడు. అతడిని చూసి కాస్త బెదురుతునే, ఓ సాయంత్రం కొందరు సీనియర్లు అందరిముందర గుంజీలు తీయమన్నారు. రామకృష్ణ నవ్వుతునే "నేను గుంజీలు తీస్తే నా కండలు మరింత గట్టిపడతాయి గాని, మీకు ఒరిగేదేముంటుంది. సాయంత్రం మీరెంతమంది వస్తే అంతమంది రండి,



అమితాబచ్చన్ డాన్ సినీమా వచ్చింది, చూసి వద్దాం," అన్నాడు. దాంతో ఆ ముఠా అంతా ఏకగ్రీవంగ ఆమోదించి, మరి రామకృష్ణను అల్లరి పెట్టలేదు.

ఆ మరునాడు రబీన్ ఛటర్జీ అన్న బెంగాలీ యువకుణ్ణి పట్టుకున్నారు. అతడి బట్టలు విప్పేసి హాస్టలు చుట్టు అయిదు సార్లు పరిగెట్టమన్నారు. అతడు పొడగరికాదు బలమైన వాడుకాదు పైగ షెత్తని వాడు. మేనమామ చదువు చెప్పిస్తానంటే వచ్చి చేరేడు కాని చాల తెలివైనవాడు అయిదుసార్లు కాకపోతే పదిసార్లు పరుగెడ్తాను గాని దయచేసి చడ్డీని ఉంచుకోనివ్వండని బ్రతిమ లాడేడు హార్డ్‌కోర్ ముష్కరులు ఒప్పుకోలేదు రామకృష్ణ మెల్లగ కలుగజేసుకుని "పోనీ చడ్డీ ఉండనివ్వండి. రేపో ఎల్లుండో పెళ్లి చేసుకో బోతున్నాడు. ఆ పాటి సిగ్గు ఉండడం సహజమే. చడ్డీ ఉండనిచ్చి నందుకు ప్రతిఫలంగ రేపు సాయంత్రం మీ సీనియర్లకు తలో ఓ ప్యాకెట్టు సిగరెట్లు కొనిచ్చు కుంటాడు." ఆ హాస్టలు సీనియర్లు ఒకరి ముఖాలు ఒకరు చూసుకుని ఓకే చేసేరు రబీన్ అంత డబ్బుపెట్టి సిగరెట్లు కొని తేలేనని ఘొల్లు మన్నాడు కనీసం నూరు రూపాయలైనా ఖర్చవుతుంది. తన దగ్గర లేదన్నాడు అయితే చడ్డీ కూడ తీసేసి పరుగెత్త మన్నారు మొర్రో మన్నాడు రామకృష్ణ ఒప్పుకొమని సంజ్ఞ చేసేడు రబీన్ సరేనన్నాడు చడ్డీ ఉంచుకుని పరుగెత్తేడు

రబీన్ ఛటర్జీది, రామకృష్ణ ఉంటున్న గది ప్రక్కనిదే. ఆ రాత్రిపడుకునే ముందు రామకృష్ణ రబీన్ గదిలోకి వెళ్ళి ఓ నూరు రూపాయల నోటు అందించేడు. రబీన్ ఆశ్చర్య పోయేడు.

"ఇదేమిటి డబ్బును మీరిస్తున్నారు?"

"ఫరవాలేదు. నేను ఇవ్వగ్గలను. నన్ను బాధించదు. మరి మీదగ్గరంత డబ్బులేదుగ. ఇంతకీ ఆ ప్రపోజలు పెట్టింది నేనేగా."

"మీరు నన్ను రక్షించ డానికే అలా అన్నారు నేను ప్రస్తుతం నా వాచీ

## సోనమ్ పెళ్లి



ఎప్పుడూ ఈత దుస్తుల్లోనే ప్రేక్షకులకి కనిపించి కనువిందు చేసే సోనమ్ త్వరలో వివాహం చేసుకోబో తోంది. ప్రముఖ నిర్మాత గుల్షన్ రాయ్ కొడుకు రాజీవ్ రాయ్ లవ్‌లో పడిన సోనమ్ ఈ విషయాన్ని నిర్భయంగా అతనితో చెప్పి ఓ.కె. అనుపించుకుంది. రాజీవ్ త్రిదేవ్‌కు దర్శకత్వం వహించిన రాజీవ్ పై ఆ చిత్రం తయారయ్యే సమయంలోనే సోనమ్ మరులుగొన్నదట. ఏమైతేనేం రాజీవ్ - సోనమ్‌ల పెళ్లి వచ్చే జనవరి 21వ తేదీకి నిర్ణయమైంది. ఇకనైనా ఈత దుస్తులు మానేస్తుందో? లేదో?

తనఖా పెట్టి ఆ డబ్బును తెచ్చేను తరువాత ఎలాగో ఆ అప్పు తీర్చుకుంటాను"

"చూడండి రబీన్! ఇవాళ నుండి మీరు నేను స్నేహితులం మీరు అంత డబ్బును ఖర్చు చేయలేరని నాకు తెల్సు నేను ఒక్కొక్క పార్టీకే మూడేసి వందలు ఖర్చుపెట్టే వాడిని నాకు నా తండ్రి ధర్మమా అని స్థోమత ఉంది మరే సంశయం పెట్టుకోక తీసుకోండి దానికి ప్రతిఫలంగ మీ స్నేహం నాకు కావాలి"

రబీన్ ఆఖరికి ఒప్పుకోక తప్పలేదు

"చాల థాంక్సండి మిస్టర రామకృష్ణ. మీకు నేనెప్పుడు స్నేహితుణ్నే"

"గుడ్- మరి వస్తా"

తరువాత కొన్నాళ్ళకు ఓ లా పాయింటు అర్గ్యు చేయడంలో దేవేంద్రసిన్హా తారసపడ్డాడు. ఇద్దరు బాగా వాదించుకొన్నారు ఆఖరికి రామకృష్ణ గెలిచేడు

"చూడు మిస్టర్‌సిన్హా- నా తండ్రి ఎడ్వకేటు, నా మేనమామ ఎడ్వకేటు మా ఇంట్లో భగవద్గీతతో పాటు లా పుస్తకాలే ఉన్నాయి. నా నరనరాల్లో జీర్ణించుకు పోయింది ఈ లా- తెల్సుకోండి," అని నవ్వుతు అన్నాడు

అప్పటి నుండి రామకృష్ణ, రబీన్ ఛటర్జీ, దేవేంద్రసిన్హా మంచి స్నేహితులయ్యేరు లా డిబేట్సులో ఎక్కువగ పాల్గొనేవారు కలసి సినీమాలకు, షికార్లకు పోయేవారు ఆ రెండవ సంవత్సరం రబీన్ కాస్త నిరుత్సాహంగ కనిపించేడు రామకృష్ణ అది గమనించి ఒకనాడు వాళ్ళిరువురు తన గదిలో కూర్చుని ఏవో కబుర్లాడు కుంటునప్పుడు, ఆ విషయాన్ని అడిగేడు

"చెప్పాలని ఉందిగాని- ఏమని చెప్పాలో తెలియడం లేదు," అని మెల్లగ అన్నాడు

"నేను తీర్చగల బాధ అయితే తీర్చడానికి ప్రయత్నిస్తాను"

"అదికాదు రామకృష్ణ- మా మామయ్యా సహాయ సహకారాలున్నన్నాళ్ళు నాకు డబ్బు ఇబ్బందుండదు ఇది నా మనస్సుకు సంబంధించిన విషయం"

"అలాగా- నా సలహా కావలిస్తే చెప్పు. లేకుంటే నీ ఇంటి విషయాలలో జోక్యం కలుగజేసుకోడం నాకిష్టముండదు"

కాస్సేపు రబీన్ ఛటర్జీ మౌనంగా కూర్చున్నాడు ఆఖరికి ఓ నిర్ణయానికి వచ్చిన వాడికి మల్లే కదలి చెప్పనారంభించేడు.

"మా తల్లిగారి వంశం ఒకప్పుడు ధనికవర్గానికి చెందినదే మా అమ్మకు ఇద్దరు అన్నలు ఒక చెల్లెలు ఉన్నారు

మా తాతగారు అప్పుడు కలకత్తాలో ఉండేవారు మా పెద్దమామ ఇప్పుడక్కడే ఉండి డాక్టరుగ ప్రాక్టీసు చేస్తున్నాడు మా అమ్మకు ఓ పెద్దింటి సంబంధం చూసి పెండ్లి చేద్దామనుకుంటుంటే, ఆ వీధిలో నే ఓ చిన్న దుకాణం పెట్టుకున్న మా నాన్నను ప్రేమించి అతననే పెండ్లి చేసుకుంటానని పట్టుబట్టిందట దాంతో మా తాతగారు రెచ్చిపోయి ఇంట్లోంచి పొమ్మన్నారట అప్పుడు మా నాన్నగారి తల్లిదండ్రులు మా అమ్మను చేరదీసి దక్షిణేశ్వరంలో కాళిమా సమక్షంలో వివాహం జరిపించేరు మా తాతగారు చాల కోపిష్టి డబ్బు బలం, కండబలం ఉన్నవారు అతనికి భయపడిపోయి మా నాన్నగారు, అమ్మను తీసుకుని మిడ్నాపూరు వచ్చేసి అక్కడ ఓ పుస్తకాల షాపు పెట్టుకుని గౌరవంగ బ్రతుకుతుండేవారు మొత్తం మీద మా అమ్మ తరపు వాళ్ళతో ఆనాటి నుండి సంబంధ, బాంధవ్యాలు తెగతెంపు లయినట్లే

"మా రెండవ మేనమామకు, మా అమ్మకు చిన్నప్పటి నుండి అనుబంధం ఎక్కువగ నుండేది వీరిరువురి మధ్యనున్న పొత్తు మిగతా వారితో లేదు అందుచేత మా చిన్నమామ అప్పుడప్పుడు ఇంట్లో వాళ్ళకు తెలియకుండ మా అమ్మకు ఉత్తరాలు వ్రాస్తు మా అందరి క్షేమ సమాచారాల్ని కనుక్కుంటుండేవాడు తరువాత బంకురా జిల్లా కోర్టులో ప్రాక్టీసు బాగుంటుందని, బంకురా వచ్చేసి అక్కడ లా ప్రాక్టీసు చేస్తున్నాడు అతనికి ఒక్కర్తే కూతురు, ఒక్కడే కొడుకు. ఆ కొడుకు చిన్నవాడు ఇంకా చదువుతున్నాడు మా అమ్మ మీద ప్రేమ కొద్ది తన కూతుర్ని నాకిస్తానని మా అమ్మకు వాగ్దానం చేసి, నా పై చదువులకు నన్నిక్కడకు పంపేడు నేను లాయర్నయితే మిడ్నాపూరు జిల్లా కోర్టులో ప్రాక్టీసు చేసి మా కుటుంబాన్ని బాగా ఆదుకుని పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోగలనని అతని నమ్మకం నేను అతని నమ్మకాన్ని వృధా పోనీయకుండ




చేయాలన్న సంకల్పంతోనే కష్టపడి చదువుతున్నాను ఎమ్ ఏ లోను, లా లోను ఫస్టు క్లాసు తెచ్చుకోవాలని నా కృషి

"నేను అప్పుడప్పుడు బంకురా నా మేనమామ ఇంటికి వెళ్తుండేవాడిని అక్కడ నాకు నా చిన్నమామ కూతురు రూపతో పరిచయమైంది. ఇప్పుడామె బి ఏ చదువుతూంది రూప చాల చక్కనిది నేనంత రూపవంతుణ్ని కాకపోయిన, నన్ను అభిమానించి నాతో చనువుగ ఉండేది క్రమేపి మా బాంధవ్యం దృఢపడింది ఒకనాడు నేనే ధైర్యం చేసి చనువుగ పెండ్లి చేసుకుందామా అన్నా. 'మా నాన్నగారి కిష్టమైతే నాకేమి అభ్యంతరం లేదు' అని నవ్వుతు చెప్పింది. తరువాత మా మామయ్య ఈ ఒప్పందం చేసేడు మా నాన్న, అమ్మతో. తన కూతుర్ని నేను చేసుకుందుకు నా పై చదువులకు తను డబ్బు పెట్టడానికి ఉభయత్ర నాకు లాభమే అని ఒప్పుకున్నాను. కాని అప్పుడు..." అని రబీన్ ఛటర్జి ఆగిపోయేడు

రామకృష్ణ కుతూహలంతో అతడి ముఖంలోకి చూసి. .

"చెప్పు రబీన్! ఆగిపోయేవేమి? ఇప్పుడేం జరిగింది?"

"నేను రూప నెలకో ఉత్తరమైన రాసుకుంటుంటాం, నీకు తెల్సిందే ఈమధ్య రూప వ్రాసిన ఉత్తరాలలో వెచ్చదనం లోపించింది. నామన స్సెందుకో కీడును కాస్త శంకించడం మొదలెట్టింది నేను ఈవేసవి శలవులకు వెళ్ళినప్పుడు, నా మేనమామ ఇంటికి వెళ్ళేను రూప నాతో చనువుగ ఉన్నా ఆమెలో ఏదో బెదురు నాకు తోచింది నాతో సరదాకి మిడ్నాపూరు మా ఇంటికి రమ్మన్నాను మా చిన్నమామ వెళ్ళ మన్నాడు, గాని రూప ఏవో సాకులు చెప్పింది గాని రాలేదు. నా ఉత్సాహమంత నీరు కారింది. మూడవ రోజున ఆ వీధిలో నే ఉన్న ఓ క్లినిక్ నుండి రూప రావడం చూసేను. నన్ను చూసి కాస్త తడబడింది. నేనేమి ఆ విషయం గురించి అడగలేదు. రూపకు తెలియనీయక కాస్త పరిశోధన చేసేను. ఆ డాక్టరు యువకుడే ఎర్రగ, ఎత్తుగ ఉంటాడు. ఆరు నెలలైంది ఆ వీధిలో క్లినిక్కు పెట్టి, వయస్సు సుమారు ముప్పై సంవత్సరాలుంటాయి మా మామయ్య కుటుంబానికి వైద్యం అతనే చేస్తున్నాడట ఇప్పుడు నా ఉద్దేశంలో రూప అటు ఆకర్షితురాలవుతున్నదని. నా ఖర్మకి ఆ డాక్టరుకింకా వివాహం కాలేదు. ఈ ఆకర్షణ మరో సంవత్సరం ఉంటే నా ప్రేమకు తిలోదకాలే"

రబీన్ విచారాన్ని చూస్తే రామకృష్ణకు బాధకన్న నవ్వు ఎక్కువగ వస్తోంది.

"చూడు రబీన్! నువ్వు రూపను గాఢంగ ప్రేమిస్తున్నావా?"

"తప్పకుండ- అందులో సందేహ మేమిలేదు. రూప చాల అందమైంది. నాకు భగవంతుడు మాంచి




**జి. వి. ఎస్. మూర్తి, విశాఖపట్నం.**

రోజూ దైవ ప్రార్ధన చేయడం అవసరమా?

★ కష్టాల్లో వుంటే తప్ప దేవుడెందుకు జ్ఞాపకం వస్తాడండీ బాబూ. అయితే ఒక్క అలవాటు మంచిదనే వాడు మా పెద మామయ్య సాయంత్రపు నీడలు సుదీర్ఘాలవుతూ ఈ రోజు మెల్లిగా జారుకుంటున్నప్పుడు- రోజంతా బాగా గడిపానని అనుకోగలవా? ఏ ఒక్క మనిషి కైనా ఓదార్పుగా నిలవ కలిగావా- ఆలోచించుకో, నీ స్నేహ హస్తం చాపి ఏ మనసుకైనా వూరట కల్గించావా? ఎవరికేనా కించిత్ ఆనందం పంచ కల్గావా? ఓ మంచి మాట ఓ మంచి చేత ఏదైనా జ్ఞాపకం వుందా ఈ పూట చేసినది? చేసే పనిలో కాస్త మెరుగు- తృప్తి నిస్తుందని ప్రయత్నించావా- నిద్రకొరిగే సమయం దగ్గిరవుతున్నప్పుడివి ఆలోచించు. ఆహా- ఈ నిద్ర ఘడియలు- నేను శ్రమించి సంపాదించుకున్నవి ఈ రోజు నేను చెడు చేయలేదు-'' అనుకోవాలని గట్టిగా చెప్పేవాడు- (అలా అయితే ఎవరికీ కంటినిండా కునుకు రాదులేవే అనీ ఆయనగారే చెప్పినారు!) నిజాని కిది ప్రార్ధన కంటే గొప్పది కాదంటారా?

దేశ జనాభాలో మన పెర్సంటేజి మెరుగు పడాలంటే?

★ సింపుల్ ఇప్పుడు 'మంది' దే బలం కనుక- నిస్సందేహంగా- మన కులాన్ని జనాభా రీత్యా పెంచడం ఒక దారి లేకుంటే నిలువ నీడ వుండదు కొన్ని జాతులకిక. అలా చేయడం యాంటీ నేష నల్ కనుక- మననీ ఓ. బి. సిలుగా కాక ఎం. బి. సి.లుగా గుర్తించమని గోల పెట్టాలి




**బాణాల రమేష్‌బాబు, హైదరాబాదు.**

మీరుకూడ మన పురాణేతిహాసాలను హేళన చేస్తూ ఏవైనా నవలలు రాశారా?

★ పురాణాలే అర్ధమై చావవు నాకు- ఇంక వాటిని అవహేళన ఎలా చెయ్యగలను? నేనంత పండిత- మూర్ఖురాలను కాను.

మీ దృష్టిలో జీవితం అంటే-

★ చావు పుట్టుకల- పుట్టుక చావుల మధ్య వ్యవధి- కా దా జీవితం?

**బి. ఆర్. మూర్తి, మచిలీపట్నం.**

మీరు 74లో సినిమారంగంలో- 'సినిమా రంగంలో నే డబ్బు లేకుండా చెక్కు యిచ్చే చొరవ వుంటుంది' అన్నారు. ఇప్పటికే చిత్ర సీమలో మారని చెక్కులు తీరు, నిర్మాతలతో విరోధం ఎందుకని తారలు రికంసైల్ ధోరణి కంటిన్యూ అవుతోందా? యూనియన్లు కోర్టులు ఎందుకూ పనికిరావా?

★ డబ్బు కోసం తిన్నగా కోర్టుకి వెడితే- "యూనియన్లలో న్యాయం జరక్కపోతే- కోర్టు కెళ్ళాలంటారు- యూనియన్లు చాలామంది పోకెట్ సంస్థలు. కాలయాపన చేసి తమకు అయిన వారికి న్యాయం, న్యాయం జరగ వలసిన వారికి అన్యాయం చేస్తారు. అప్పటికి- కోర్టుకి రేట్టై హాయిగా నిర్మాత చిత్రం దేశం మీదికి వదులు తూంటాడు. కింది వారికి న్యాయం జరగదు. పై వారు- లాలూచీలు పడి అదే సంస్థలలో యూనియన్లలో గుప్‌చిప్‌గా ఫైన్లు కట్టి పైకి కాలరెత్తుకు తిరుగుతారు. ఎన్నో పెద్ద చిత్రాల విషయంలో కాపీరైట్- తెలివిగా సినిమా పూర్తయ్యే దాకా ఆగి యూనియన్‌లో పడేసి అధిక ధనం రాబట్టిన సందర్భాలు అనేకం వున్నాయి! ఇదో కందిరీగల పుట్ట. కదపడం- దండగ, ఇది వ్యాపారం కాదు.

**కారబండి శ్రీనివాసరావు, ఒంగోలు**

పైకి మంచిగా మాట్లాడుతూ లోపల అసూయ ద్వేషాలు నింపుకొని స్నేహం చేసే వారిపై మీ అభిప్రాయం?

★ అలాంటి వాళ్ళు స్నేహితులెలా అవుతారండీ-తెలిసినవాళ్ళు అవుతారు కార్యార్థులవుతారు!

ఏ దేశ చరిత్ర చూసిన ఏమున్నది గర్వ కారణం అంటారు. మనదేశ చరిత్ర చూస్తే మీరు గర్వంగా అనిపించదా?

★ ఎప్పటి చరిత్ర అన్నదే ప్రశ్న సార్.

**ఏ. ఆర్. ఆర్. హైదరాబాద్**

నా స్నేహితుడొకడు- ఏమన్నా రేపు చేస్తానంటాడు.

★ నిన్ననేం చేశావని ఓ రోజు అడుగండి- దాటవేసేవారే- రేపు రేపు అనేది!

ం

# గ్లాక్టో
# ఇప్పుడు ఏ దుకాణంలోనైనా పొదుపైన ఒకే ధరలో దొరుకుతుంది.

రూ.35కి 500 గ్రా.లు.
రూ.65కి 1 కిలో.

ఇప్పుడు గ్లాక్టో
దేశమంతటా
సమానమైన ఒకే ధరకు
దొరుకుతుంది
వెలలో అన్ని పన్నులూ
చేర్చబడినవి

ముఖ్య గమనిక :
మీ పాపాయికి
తల్లిపాలు
శ్రేష్ఠం.




వినియోగదారులకు తెలియజేసే ఉద్దేశంతో విడుదల చేయబడినది
ఒకే సమాన ధర అన్ని పన్నులతో సహా

Gx 281 90 Tl

# రహస్యం

## ఎం.వి.ఎస్.ఎస్. ప్రసాద్

రిక్షా దిగిన శేఖరం మరొక్కసారి చేతిలో ఉన్న అడ్రసు కాగితాన్ని పరీక్షగా చూసాడు. అడ్రసు అదే రిక్షా అతనికి డబ్బు లిచ్చి మెల్లిగా గేటు తీసుకుని లోపలకు వెళ్ళాడు.

అతని రాకను కిటికీలోంచి చూసిన సుబ్బారావు "ఏరా బావా ఏమిటీ ఈ ఉరుములేని పిడుగు" అంటూ అతనిని కౌగలించుకున్నంత పని చేసాడు

శేఖరం, సుబ్బారావులు మేనత్త మేనమామ పిల్లలు సుబ్బారావు ఆ ఊరిలో గవర్నమెంటు ఉద్యోగి శేఖరం హైదరాబాద్‌లో ఒక డిటెక్టివ్ ఏజన్సీలో పని చేస్తున్నాడు

"ఏమిటిరా! ఏమిటిలా ఊడిపడ్డావు?" అంటూ మరొక్కసారి ప్రశ్నించాడు సుబ్బారావు

"ఆఁ ఏదో పని తగిలితేను" అని కుర్చీలో కూర్చుంటూ గదిని పరిశీలించ సాగాడు శేఖరం

"మొత్తానికి నీ డిటెక్టివ్ బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు చెప్పా పెట్ట కుండా రావడం వచ్చిన వెంటనే గదంతా చూసేయడం"

"ఆ! ఏదో అలవాటులో పొరపాటు లేరా" అన్నాడు శేఖరం నవ్వుతూ

"ఒరేయ్ శేఖరం ఈవాళ కొంచెం పెంద రాళే వెళ్ళాలి నేను వెడతాను ఇదిగో డూప్లికేటు కీ ఆరు గంటలకల్లా మరలా రూములో వాల్తాను ఈ లోపల నీ పనులు చూసుకో రాత్రి బీరకాయలు తాగి ఏ సెకెండ్‌షోకో చెక్కేద్దాం పద బాత్రూమ్ అదీ చూపిస్తాను. ఇంతకీ ఎన్ని రోజులుంటావు?" గుక్క తిప్పు కోకుండా మాట్లాడాడు సుబ్బారావు

"ఏరా నీ కేదైనా ఇబ్బందా?" ఆశ్చర్యంగా మొహం పెట్టి అడిగాడు శేఖరం

"అబ్బే! అదేంలేదు ఊరికేనే" నసి గేసాడు సుబ్బారావు.

"నే వస్తానురా. బాత్రూమ్ చూసా వుగా" అంటూ హడావిడిగా వెళ్ళి పోయాడు సుబ్బారావు.

శేఖరం తన జేబులోని ఉత్తరంతీసి మరొక్కసారి చదవడం ప్రారంభించాడు

చి శేఖరానికి మీ మామయ్య ఆశీర్వదించి వ్రాయునది. ఉభయకుశలో పరి ఈమధ్య నీ దగ్గరనుంచి ఉత్తరాలు లేవు మీ నాన్నగారూ అమ్మ కులాసా అని తలుస్తాను ఇప్పుడు నీ కో ముఖ్య విషయం రాస్తున్నాను ఈమధ్య మా అబ్బాయి సుబ్బారావు ప్రవర్తన అనుమానాస్పదంగా ఉంటోంది వాడు ఉండే ప్రదేశం కూడా అంత మంచిది కాదు ఒకసారి నేను ఏదో పనిమీద వాడి ఊరికి వెళ్ళి వాడి గదికి వెళ్ళేసరికి ఆ గదిలో ఆడపిల్లల బట్టలు కనిపిం





చాయి " పెళ్ళికాని కుర్రాడివి ఇదంతా ఏమిటిరా" అని అడిగితే ఏమీ మాట్లాడ లేదు గట్టిగా అడిగితే అసలవి అక్కడకు ఎలా వచ్చాయో తెలియదన్నాడు సరే ఆ రోజు సాయంత్రం ఇంటాయనని అడిగాను మా వాడి గదికి ఎవరన్నా ఆడపిల్లలు వస్తున్నారా అని ఆయన వెకిలిగా నవ్వి ఆ వీధిలో చాలా ఇళ్ళకి ఆడవాళ్ళు మగవాళ్ళు స్వేచ్ఛగా వచ్చి వెడుతుంటారని. ఆ సంగతి ఎవ్వరూ పట్టించుకోరని అన్నాడు

నేను కొయ్యబారిపోయాను ఎవ్వత్తెనో ప్రేమించాడు, పెళ్ళి చేసుకుంటాడని సరిపెట్టుకుందామనుకున్నాను కానీ అలాంటి వేషాలు వేస్తున్నాడని ఊహించలేకపోయాను ఆ రూమ్ మారమని శతవిధాల చెప్పాను వినిపించుకోలేదు

బాబూ శేఖరం నువ్వూ వాడూ బాగా చనువుగా ఉంటారుకదా అది కూడా డిటెక్టివ్‌గా పని చేస్తున్నావు నీకు వృత్తి రీత్యా ఇది చాలా చిన్న పనిగానూ, హాస్యాస్పదంగానూ కనిపించవచ్చు కానీ నాకూ, మీ అత్తయ్యకు సుబ్బారావు ఒక పెద్ద సమస్యలా తయారయ్యాడు వీలైనంత త్వరలో నువ్వు ఒకసారి వాడి ఊరికి వెళ్ళి విషయం కనుక్కుని, వాడికింత గడ్డి పెట్టగలవని ఆశిస్తున్నాను

ఆశీస్సులతో
నీ మామయ్య

ఉత్తరం జేబులో పెట్టుకుని గదంతా మరొక్కసారి పరిశీలించాడు శేఖరం. పరుపుకింద లంగాలు, బ్రాలును ప్యాంటీలు, చీరలు కనిపించాయి శేఖరం గది బయటకు వచ్చి చుట్టు పక్కల చూశాడు సుబ్బారావు గది కెదురుగా ఒక చౌకబారు లాడ్జి కనిపించింది శేఖరంకి ఒక ఆలోచన వచ్చింది

ఆ రోజు సాయంత్రం సుబ్బారావుతో సినిమాకు బయలు దేరాడు శేఖరం

"రేపటినుంచి నైట్ డ్యూటీలు ఉన్నాయిరా రాత్రుళ్ళు రూములో ఉండడం కుదరదు" అన్నాడు శేఖరం సుబ్బారావు మొహం పరిశీలనగా చూస్తూ సుబ్బారావు మొహంలో రిలీఫ్ స్పష్టంగా కనిపించింది

"ఎక్కడకి వెడతావురా!" అని అడిగాడు సుబ్బారావు

"అవన్నీ నీకు చెప్పకూడదు ప్రొఫెషనల్ సీక్రెట్స్"

మరునాడు శేఖరం లాడ్జిలో రూము తీసుకుని రాత్రులు అక్కడ వరండాలో కూచుని సుబ్బారావు రూము కేసి పరిశీలనగా చూడడం ప్రారంభించాడు రెండు రోజులు ఏమీ లాభం లేకపోయింది అయితే మూడవరోజు సమస్య విడిపోయింది మరునాడు శేఖరం లాడ్జి ఖాళీ చేసి, తను వచ్చిన పని అయిపోయిందని వెళ్ళిపోతున్నానని సుబ్బారావుకి చెప్పి బయలు దేరాడు

* * * * *

"విషయం తెలుసుకుని వచ్చాను మామయ్యా! మీవాడు నువ్వు అనుకున్నట్లు ఏమీ చెడిపోవడం లేదు కానీ అనారోగ్యం పట్టుకుంది మొదట్లో ఈ ఊరు తీసుకువద్దామనుకున్నాను కానీ ఈ పల్లెటూళ్ళో మీ వాడికి వైద్యం చేయించరు సరికదా దేముడు, దెయ్యం అంటూ గొడవ చేస్తారు నువ్వు వీలైనంత త్వరలో హైదరాబాద్ తీసుకురా అక్కడ డాక్టర్‌కి చూపిద్దాం" అన్నాడు శేఖరం

ఇంతకీ విషయ మేమిట్రా?" అని ఆతృతగా అడిగాడు శేఖరం మామయ్య

"ఏమీలేదు మామయ్యా మీ వాడికి "ట్రాన్స్ వెస్టిజమ్" అనే మెంటల్ డిజార్డర్ ఉంది. ఆ వ్యాధి ఉన్న ఆడవాళ్ళు మగ డ్రెస్సులు వేసుకోవాలని, మగవాళ్ళు ఆడవాళ్ళ డ్రస్సులు వేసుకోవాలని తహతహలాడతారు హైదరాబాద్‌లో సైకియాట్రిస్ట్‌కి చూపిద్దాం" అన్నాడు శేఖరం అతని మామయ్య మొహంలో ఒక పీడ వదిలించుకుంటే ఇంకొకటి తగులుకుందే అన్న బాధ కనిపించింది శేఖరంకి ●

ఆంధ్రసచిత్ర వార పత్రికలో
వచ్చే వారమే ప్రారంభం

*

ఓ అంధురాలి మహాసాహసం
ఆంధ్రసచిత్రవారపత్రిక
అందిస్తోన్న అద్భుత బహుమానం

*

సెన్సేషనల్ స్టార్ రైటర్
శాతవాహన

# నేత్రధనుస్సు

ఆంధ్రసచిత్రవారపత్రిక
సగర్వంగా సమర్పించే సాహస సీరియల్

ఆమె ఒక అద్భుత సౌందర్యరాశి. పేరు నయన తార. కానీ ఆమెకు నేత్రాలు లేవు. ఆమె భర్తపై పగబట్టిన కొందరు దుండగులు ఒక రోజు ఆమె పసిబిడ్డను చంపి ఆమె భర్తను అపహరించుకుపోయారు.

అప్పుడు తన మాంగల్యాన్ని కాపాడుకోవటం కోసం తన నేత్రాలనే ధనుస్సులుగా, తన నుదుట సింధూరాన్నే ఆయుధంగా మార్చి ప్రయోగిస్తానని ఆమె ప్రతిజ్ఞ చేసి విజయం సాధించింది!

కళ్ళులేని ఆ యువతి ఇదంతా ఎలా చేయగలిగింది ???....!!! అంధురాలైన ఒక యువతి సాహసాన్ని అత్యద్భుతంగా చిత్రించిన విలక్షణ నవల. నవయువ రచయిత శాతవాహన అద్భుత సృష్టి నేత్రధనుస్సు.


# నేత్రధనుస్సు

# హలో డాక్టర్ నేనేం చేయాలి?



డా. కొత్త రవీంద్రబాబు

### కె. వి. లక్ష్మి, కరూర్

ప్ర వయసు 18 సంవత్సరములు. 52 కెజీల బరువున్నాను లావు తగ్గాలి ఆకలి ఎక్కువ

జ . ఆహారంలో కొవ్వు పదార్థం తీపి పదార్థం తక్కువగా వుండేట్లు తీసుకోవాలి. ఆకలి అయినప్పుడు గ్లాసు మజ్జిగ తీసుకు చూడండి అన్నం తక్కువ ఆకుకూర లెక్కువగా ఆహారం తీసుకోండి పాండో రాక్స్ బిళ్ల రోజ కొకటి చొప్పున రెండు నెలలు వాడండి

### ఆర్. ఎన్., భీమ్లి

ప్ర ఒకామెతో కలిశాను ఎయిడ్స్ వచ్చిందని అనుమానంగా వుంది. నిరోద్ వాడాను

జ చేయగూడని పని చేసానన్న భయం మిమ్ములను బాధిస్తున్నది వైజాగ్ మెడికల్ కాలేజీలోని వి డి డిపార్ట్‌మెంట్‌లో తనిఖీ చేయించుకోండి బహుశ మీది అనవసరపు ఆందోళన అయివుంటుంది

### ఆర్. గోపాలరాజు, తిరుపతి

ప్ర వయసు 40 సంవత్సరములు. విరోచనాలవుతున్నాయి అంగం వాసన కొడుతున్నది. సంభోగ సమయంలో గుండె దడ

జ : స్నాన సమయంలో పురుషాంగం శుభ్రం చేసుకోవాలి విరోచనం పరీక్ష చేయించుకోండి డాక్టరు గారికి చూపించుకుని మందులు వాడటం మంచిది. శరీరారోగ్యం హృదయ చలనం గురించి పూర్తిగా పరీక్షలు చేయించుకోండి

థైరోటాక్సికోసిస్ వ్యాధిలో విరోచనా లెక్కువై దడగా వుంటుంది

### ఎం. ఎస్. రాజేశ్వరి, మచిలీపట్నం

ప్ర · చుండ్రు పోవాలి 4 ఏళ్ళ పిల్లలకు ఏ సబ్బు వాడాలి మేము పియర్స్ వాడుతాం

జ .క్లినిక్ షాంపూతో వారానికి రెండుసార్లు తలంటుకుని తలంటుకున్నాక వొక రోజు న్నాక నూనె రాసుకోండి. పిల్లలకు పియర్స్ సబ్బు వాడవచ్చు.

### లతీఫ్‌ఖాన్, బాపట్ల

ప్ర : పెదవి మీద తెల్ల మచ్చ వచ్చింది. బొల్లి అంటున్నారు

జ బొల్లి నిరపాయకరం. ఆందోళన పడ నవసరం లేదు. చర్మ వ్యాధి నిపుణులను సంప్రదించండి.

### ఆర్. మదన్, హైదరాబాద్

ప్ర · 21 సంవత్సరములు. 14వ సంవత్సరం నుండి స్వరతి కలవడ్డాను అందువలన చేతులు సన్నగా వున్నాయి తొడల మీద వీర్యం పడి గజ్జి వచ్చింది

జ : చేతి కండరాలు బలపడటానికి వ్యాయామం బుల్‌వర్కర్ ఎక్సర్‌సైజులు చేయండి

గ్రిస్ ఓవి గొట్టాం రాత్రి ఒకటి చొప్పున నెల వాడండి

### వి. విజయ్, విజయనగరం

ప్ర సన్నగా వున్నాను పళ్ళు పచ్చగా వున్నాయి

జ ఒరబాలిన్ బిళ్ళ రోజుకొకటి చొప్పున రెండు నెలలు వాడుతూ పాలు, గుడ్లు, పళ్లు విరివిగా తీసుకోండి

పంటి డాక్టరుగారిచే క్లీన్ చేయించుకోండి.

### డి. ప్రసాద్, పీలేరు

ప్ర . ఎడమ చంక కింద రెండంగుళాల కణితి వున్నది. ప్లాస్టిక్ సర్జరీ ఎక్కడ చేస్తారు?

జ . చంక కింద కణితిని సర్జన్లెవరైనా తీసివేయగలరు ప్లాస్టిక్ సర్జరీ అవసరం లేదు

### పి. సుమతి, ఏలూరు

ప్ర నగ్నంగా వుండే యువకుని (సినిమా హీరో) వూహించుకుని స్వ రతి కలవడ్డాను

జ దృష్టి చదువు మీద కేంద్రీకరించండి. కోరికలను అదుపు చేయకపోతే అవే మీ మీద సవారీ చేస్తాయి

### ఎ. సుందర్, గుడివాడ

ప్ర సాహిత్యం వలన ప్రయోజనం?

జ · అవధులు లేని పరమానందం!



# ఠవ్వ... ఠవ్వ...



## అరబ్ షేక్‌ల వినోదం బాలలకు ప్రాణ సంకటం

అరబ్బు దేశాలలో ఒంటెల పందాలు షేకులకు వినోదం. ఒంటెల పందాలు వేయడంలో తప్పులేదు. షేకులు వినోదించడంలో తప్పులేదు. కానీ ఈ ఎడారి ఓడలు చురుకుగా పరుగెత్తడానికై వాటి మూపరాలపై జాకీలుగా పది సంవత్సరాలలోపు పిల్లలను కూచోపెట్టడమే విచారకరం.

ఎడారి ప్రాంతం వారికి ఒంటె ఒక కల్పవృక్షం వంటిదనే చెప్పాలి. ఎడారి వాతావరణానికి అక్కడి శీతోష్ణస్థితికి తట్టుకొని నిలబడగల జంతువు ఒంటె ఒక్కటే. స్వారీ చేయాల్సి వస్తే వారి మానసిక పరిస్థితి మీరే వూహించండి. పందాలలో పాల్గొనాల్సిన పిల్లలకు ముందుగా తర్ఫీదు యిస్తారు. శిక్షణ సమయంలో భయం వల్ల ఏడ్చే పిల్లలను కఠినంగా శిక్షిస్తారు. మరీ చిన్న పిల్లలయితే ఎంత బెదిరించినా ప్రయోజనం వుండదు కాబట్టే వానిని ఒంటెల వీపులకు తాళ్లతో కట్టేస్తారు. దాంతో ఆ పిల్లలు శక్తి కొద్దీ ఏడుస్తారు. ఆ ఏడుపులకు బెదిరిపోయిన ఒంటెలు పరుగు లంకించుకుంటాయి. ఈ సమయంలో పరుగెడుతున్న ఒంటెలు పడిపోవడం వల్లా, యింకా మరికొన్ని కారణాల వల్ల పిల్లలకు దెబ్బలు తగిలే అవకాశం వుంది. ఒక్కోసారి ఈ ప్రమాదంలో అంగ వికలురయిన బాలలు ఎందరో వున్నారు. ఒక్కోసారి ప్రాణాపాయం కూడా జరుగుతుంటుంది.

### షేకులకు ఉల్లాసం

అయితే ఈ అవస్థలంతా షేకులకు పట్టవు. వారు మాత్రం అమితోత్సాహంతో

ఎడారిలో ప్రయాణాలకు, బరువులు మోయడానికి ఇవి ఉపయోగపడతాయి అసలు ఇవి ఎడారి వాసుల సేవ కోసమే సృష్టించబడ్డాయా అని అనిపిస్తుంది అయితే వీటిని మాలిమి చేసుకోవడం అంత తేలికైన పనేమి కాదు. అరబ్బులు అష్టకష్టాలు పడి వీటిని మాలిమి చేసుకుంటారు మూడువేల సంవత్సరాల నుంచి ఈ ఎడారి వాసుల జీవితం ఒంటెలతో ముడిపడి వుంది

## ఎడారి ఓడలు

ఒక్క ప్రయాణాలకు, బరువుల మోయడానికే కాక మరెన్నో విధాలుగా ఒంటెలు మనుషులకు ఉపయోగపడుతున్నాయి. అరబ్ దేశీయులు ఒంటె పాలను అమృతప్రాయంగా సేవిస్తారు ఒంటె మాంసం తింటారు. ఒంటె చర్మంతోను, ఉన్నితోను దుస్తులను తయారు చేసుకుంటారు ఎడారి మధ్యలో మండుటెండలో దాహం వేసినప్పుడు అది తీరేటందుకు వేరే దారి లేనప్పుడు, ఆఖరికి ఒంటెని చంపి అది తన కడుపులో దాచుకున్న నీటి సంచిలోని నీటితో దాహం తీర్చుకుంటారు. ఎడారులలో యిసుక తుఫానులు సంభవించినప్పుడు ఒంటె శరీరమే రక్షణగా దాని పక్కనే యిసుకలో బోర్లా పడుకొని ప్రాణాలను రక్షించుకొంటూ వుంటారు. ఇన్ని సదుపాయాలను అందించే ఈ ఒంటెల నుంచే అరబ్ దేశీయులు వినోదాన్ని కూడా వెతుక్కుంటున్నారు. దాని ఫలితమే ఒంటెల మధ్య పరుగుపందాలు

## ఒంటెల పందాలు

పందాలకు సామాన్యంగా ఆడ ఒంటెలనే వుపయోగిస్తారు మనదేశంలో రేసులలో పాల్గొనే గుర్రాలను పోషించినట్లు ప్రత్యేక పోషణ చేసి, తర్ఫీదు యిస్తారు. ఒంటెలు పరుగెత్తాల్సిన దూరం మూడు మైళ్ల నుంచి పద్దెనిమిది మైళ్ల వరకూ వుంటుంది. క్రీడా స్థలం కోడిగుడ్డు ఆకారంలో ఏర్పాటు చేస్తారు ఆ వలయంలో ఒంటెలను పరుగెత్తిస్తారు మూపుల మీద ఎక్కువ బరువుంటె ఒంటెలు వేగంగా పరుగెత్తలేవు. అందుకనే జాకీలుగా పదేళ్లలోపు పిల్లలనే నిర్ణయిస్తారు

## జాకీలుగా పసి పిల్లలు

జాకీగా నిర్ణయించిన కుర్రవాణ్ణి ఒంటె వీపు మీద మూపురానికి దగ్గరగా అన్ని కూర్చోపెట్టి పడిపోకుండా తాళ్లతో కడతారు ఈ తతంగానికి పసి పిల్లలు సామాన్యంగా బెదిరిపోయి ఏడుపులంకించుకుంటారు. ఆ ఏడుపుకి ఒంటెలు బెదిరిపోయి పరుగు వేగాన్ని పెంచుతాయి దాంతో పోటీలు రక్తికడతాయి. పసి పిల్లల పాలిట మాత్రం ఈ వినోదం ప్రాణసంకటమే!

పసి పిల్లలు ఒంటెలను చూసి కేరింతలు కొడతారు కానీ, వాటి మీద ఎక్కిస్తామంటె బెదిరిపోవడం చూస్తుంటాం అటువంటిది వారే ఆ ఒంటెలను

ఈ పందాలలో పాల్గొని లక్షల కొలది రూపాయలను పందాలు కాస్తుంటారు. ఇస్లామిక్ సిద్ధాంతం ప్రకారం పందాలు కాయడం నిషిద్ధం. అయినా అక్కడక్కడ పందాలు కాయడం జరుగుతూ వుంటుంది. కానీ ఎక్కువగా స్వర్ణపతకాలు బహూకరించడంతోనూ, యింకా యితర బహుమతులు అందించడంతోనూ సరిపెట్టుకుంటారు. సౌదీ రాజుగారు ఏటా రియాద్‌లో జరిపే ఒంటెల పోటీలలో కొన్ని వేల ఒంటెలు పాల్గొంటూ వుంటాయి. ఈ పోటీలోని విజేతలకు బంగారంతో చేసిన గొడ్డలిని, నీళ్ల ట్యాంకును, కొంత నగదును కూడా అందజేస్తూ వుంటారు. ఒంటెల పందాలను టెలివిజన్లలో కూడా అరబ్ దేశాలలో ప్రసారం చేస్తూ వుంటారు.

ఈ పందాలలో జాకీలుగా వ్యవహరిస్తున్న చాలా మంది బాలలు భారతదేశం, బంగ్లాదేశ్, పాకిస్థాన్ వగైరా దేశాలకు చెందిన పిల్లలే కావడం చర్చనీయాంశమయింది. నిరుద్యోగంతోను, పేదరికంతోనూ మగ్గిపోతున్న యీ దేశాలలోని బాలలను ఏజెంట్ల ద్వారా తెప్పించుకొని షేకులు తమ వినోదాలకు బలి చేస్తున్నారని వార్తల ద్వారా తెలుస్తోంది పెద్దలకి ఉద్యోగం యిప్పిస్తామని, పిల్లలకు మంచి చదువులు చెప్పించి వృద్ధిలోకి తెస్తామని ప్రలోభపెట్టి తీసుకువెళ్లుతుంటారు. తీరా వారక్కడికి వెళ్లాక ఎదురయ్యే పరిస్థితి వేరు. ఆ దేశం చేరగానే పిల్లలను పెద్దల నుంచి వేరు చేస్తారు. పిల్లలకు వేరేగా గుడారాలలో వుంచి ఒంటెల స్వారీకి శిక్షణ యివ్వటం ప్రారంభిస్తారు.

## తక్కువ బరువు ముఖ్యం

ఒంటెల మూపుల మీద బరువు ఎక్కువ వున్నట్లయితే మోయలేవని పిల్లలు 12 లేక 13 కిలో గ్రాముల బరువును మించకుండా వుండేటట్లు జాగ్రత్త పడతారు. ఒక గుడారంలో వున్న పిల్లలందరికీ కలిపి ఒక పళ్లెంలో ఆహారాన్ని పెడతారట. ఆకలితో వున్న పిల్లలు ఆ పళ్లెం మీదకు ఎగబడతారు. వయస్సు కాస్త ఎక్కువగా వున్న పెద్ద పిల్లలు ఆహారాన్ని చేజిక్కించుకోవడంతో మరి పసి పిల్లలు ఆకలితో అలమటిస్తుండిపోవలసిందే. పందాలలో కాళ్లు చేతులు విరిగిన పిల్లలకు సరైన వైద్య సదుపాయం కూడా వుండదని అల్లాంటి పిల్లలు గుడారాలలో ఎందరో మగ్గుతున్నారని కూడా చూసిన వారు చెబుతున్నారు.

పసి పిల్లల ప్రాణాలను పణంగా పెట్టి నిర్వహించే ఈ పరుగుపందాలు ఎంత వరకూ సమంజసం, వీటిని అరికట్టే మార్గమే లేదా?!

**గల్ఫ్! గల్ఫ్! సీరియల్ యీ విషమ సమస్యను అన్ని కోణాలలోను చర్చిస్తుంది - మీరు చకితులయ్యే వాస్తవాలు చదువుతారు**

**పై వారమే ప్రారంభం!**



"తుమ్‌కితినిఖూబ్ సూరత్ హో..
యే మేరే దిల్ సే పూఛో.......
ఇన్ ధడకనోంసే పూఛో......

పాట వినిపించిన వేపు యాదాలాపంగా కళ్ళెత్తి చూసింది. అప్పుడే లోకల్ ట్రెయిన్ దిగిన అఖిల.

బుకింగ్ విండోలోనుంచి రెండు కళ్ళు తననే చూస్తున్నాయి. నెల రోజుల నుంచి గమనిస్తుంది- తను లోకల్ ట్రయిన్ దిగటం- బుకింగ్ విండో నుంచి- ఈ పాట వినపడటం- తను చూడగానే పాట ఆపేసి- తననే చూడటం- ఇది రోజూ జరిగే కార్యక్రమం. ఆ పాట విన్నప్పుడల్లా-మనసు ఎంతో ఉల్లాసంగా ఉంటుంది.

అతడి వంక ఒకసారి చూసి- చిన్నగా నవ్వుకుంటూ- ప్లాట్‌ఫాం దాటింది అఖిల

ఆ స్టేషన్ చాల నిశ్శబ్దంగా ఉంటుంది అప్పుడప్పుడు- అరగంటకొకసారి వచ్చే లోకల్ ట్రెయిన్స్-ఇద్దరో ముగ్గురో పాసింజర్స్ ఎక్కటమో, దిగటమో జరుగుతుంది చుట్టు ప్రక్కల పెద్ద పెద్ద పచ్చని వృక్షాలు, ఎత్తైన కొండల మధ్య నుంచి రైలుదారి- పక్షుల అరుపులతో- చాల హాయిగా ఉంటుంది ఆ ప్రదేశం. ప్లాట్‌ఫాం అంతా ఖాళీగానే ఉంటుంది. అక్కడక్కడా- అప్పుడప్పుడు- ఏ బిచ్చకాడో- లేదా కూరల కూరగాయ బుట్టలు పట్టుకుని లోకల్ ట్రయిన్ కోసం ఎదురు చూసే వాళ్ళో సిమెంట్ బెంచి మీద కూర్చుని ఉంటారు.

ఆ స్టేషన్‌లో క్రమం తప్పకుండా- దిగే వ్యక్తి అఖిల.

ఆ స్టేషన్‌కి దగ్గరలో ఇళ్ళు లేవు. చుట్టు ప్రక్కలంతా పొలాలు. ఆ స్టేషన్‌లో దిగి- ఒక నలభై నిముషాలు నడుస్తే కాని- ఇళ్ళు, స్కూల్స్ కనిపిస్తాయి. ఆ ట్రెయిన్ అక్కడ ఆగేది- పొలాల్లో కూరలు పండించి, మార్కెట్లోకి దిగుమతి చేయటానికి- రాకపోకలకి అనువుగా- ఆ కష్ట జీవులకోసమే.

బుకింగ్ విండో ఎదురుగా- ఒక బోరింగ్ పంపు, పంపుకి వెనుకగా- ఒక పెద్ద వేపచెట్టు. ఆ ప్లాట్‌ఫాం మీద

# 'తుమ్ కిత్నీ ఖూబ్ సూరత్ హో'

పి. ఇందిరాదేవి



నిలబడిన పాసింజెర్స్‌కి- ఆ వేప చెట్టు చల్లదనమే వేడి తగలకుండా కాపాడేది.

అఖిల నలభై నిముషాలు రానూ పోనూ నడవాలి కాబట్టి- తిరిగి లోకల్ ట్రైన్‌లో వెళ్ళే సమయానికి- ట్రైన్ చాలసార్లు మిస్ అయ్యేది. అఖిల నడచి వచ్చేటప్పటికి- అరగంట దాటి పోతుంది. మళ్ళీ ట్రైన్‌కోసం,, వేచి ఉండాల్సి వస్తుంది. ఆ వేపచెట్టు దగ్గరే నిలబడి నుదుటికి పట్టిన చెమటని కర్చీఫ్‌లో ఒత్తుకుంటూ చుట్టు ప్రక్కల చూస్తూ నిలబడుతుంది.

ఆ స్టేషన్‌లో- ఎన్నో సం.లుగా ట్రెయిన్ ఎక్కటం, దిగటం మామూలే- కాని నెల రోజులుగా- 'తుమ్ కితిని ఖూబ్ సూరత్ హో' పాట వినిపించటం తను అటువేపు చూడటం జరుగుతుంది. రోజూ స్టేషన్‌లో దిగేటప్పుడు ఆ పాట వినవచ్చే వేపు చూడటం. తను చూడగానే- తన పాటకి రెస్పాన్స్ వచ్చినట్లుగా చూసి- పనిలో నిమగ్నమయ్యేవాడు.

* * * *

స్టేషన్ దిగిన ఆమెకు- ఆ రోజు ఏదో లోటుగా ఉంది. కారణం ఎప్పుడూ వినిపించే పాట ఆ రోజు వినిపించకపోవటం. కుతూహలంగా- బుకింగ్ విండో వేపు చూసింది. అక్కడ అంతకు ముందు కనిపించే వ్యక్తి కాక- కొత్త మొహం. ఆమెకి నిరుత్సాహం కలిగింది. ఎన్నడూ లేనిది బుకింగ్ విండోవేపు వెళ్ళి- ఆ కొత్త వ్యక్తిని- పాత వ్యక్తి గురించి అడిగింది.

"నేను ఈ రోజే డ్యూటీలో జాయిన్ అయ్యాను మేడమ్. నాకు. . ."

అతడి మాటలు ఆమెకు నిరుత్సాహం కలిగించింది. ఏదో శక్తి పోయినట్లుగా ఉంది. చాల చిత్రం. మనని అనుక్షణం గమనిస్తున్న వ్యక్తుల్ని లెక్క చేయనట్లుగా ఉంటాము. ఆ వ్యక్తే మనకు కనపడక పోతే- మనం ఎదురు చూస్తుంటాము. అదే జరిగింది అఖిల విషయంలో- ఆమె అన్యమనస్కంగా వెళుతుంది, వస్తుంది. కొద్ది రోజులు ఇలానే గడిచాయి. పిచ్చి పట్టినట్లుగా ఉంది. ఏ పనిచేయబుద్ధి కావటం లేదు. ప్రతిరోజూ బుకింగ్ విండోవేపు చూసే ఆమెని- క్రొత్తగా డ్యూటీలో జాయిన్ అయిన వ్యక్తి గమనించాడు. ఎవరికోసమో వెతుకుతున్నట్లుగా- ఆ కిటికి వేపు చూడటం దిగులుగా ఉన్న ఆమె కళ్ళు రెండు మూడు సార్లు- ఇంతకు ముందు డ్యూటీలో ఉన్న వ్యక్తి గురించి అడగటం 'ప్రేమికురాలు కాబోలు' అనుకున్నాడు.

* * * * * *

"తుమ్ కితిని ఖూబ్ సూరత్ హో:" అప్పుడే ఆగబోతున్న ట్రెయిన్‌లో నుంచి దూకింది అఖిల ఆ కంఠ స్వరం విని సరిగ్గా ఆ ట్రెయిన్- బుకింగ్ విండోకి సమీపంలోనే ఆగుతుంది. ఆమె కళ్ళు ఆత్రంగా విండో వేపు చూసాయి. అతడే- అతడే తననే చూస్తున్నాడు పాట ఆపేసి- అతడిని చేరి మాట్లాడాలన్న ఆతురుత- ఇద్దరు, ముగ్గురు పాసింజర్సు- ఆమెకి- అతడికి మధ్యలో అడ్డంగా వచ్చారు. ఒకరిని ఒకరు చూసుకోలేనట్లుగా-ఎవరో టికెట్స్ కోసం వచ్చారు. ఈ హడావిడి అయ్యేంత వరకు ఆమె అలా నిలబడింది. రైలు కూత వేస్తూ వెళ్ళిపోయింది. మళ్ళీ ఎప్పటిలా నిశ్శబ్దమే.

"ఖూబ్ సూరత్" అన్నాడు అతడు విండోలోపలి నుంచి.

"ఇన్నాళ్ళు ఎక్కడికి వెళ్ళారు?" ఉద్వేగాన్ని అణచుకుంటూ అడిగింది.

అతడు ఆశ్చర్యపోయాడు ఆమె అలా మాట్లాడటం.

"ఏం ఎదురు చూసారా?" నవ్వుతూ అడిగాడు.

"మీ కోసం కాదు- మీరు పాడే పాటకోసం" చెప్పింది.

"అంత బాగుందా?"

"ఊఁ! చెప్పింది."

"నన్ను మీరు గుర్తుపట్టలేదా?" అడిగాడు.

ఆశ్చర్యంగా అతడి వంక చూసింది.

"మీరు గుర్తు పట్టలేదని మీ ప్రశ్నార్థకమైన చూపులే చెపుతున్నాయి" అంటూ నవ్వాడు.

"అవును గుర్తు రావటం లేదు" ఆలోచనగా చెప్పింది.

"సాయంత్రం మీరు తిరిగి వెళ్ళే సమయం వరకు నేను ఇక్కడే ఉంటాను కాబట్టి- ఈ లోపుగా మీరు గుర్తు తెచ్చుకోండి. ఇంకా గుర్తు రాకపోతే నేనే గుర్తు చేస్తాను" చెప్పాడు.

"ఇప్పుడు మీరు చెప్పకపోతే- నేను చేసే పనిలో శ్రద్ధ తగ్గి- మీగురించే ఆలోచించవలసి వస్తుంది" అంది.

"అంత చించుకోవలసిన పనిలేదుగాని- సాయంత్రం వరకు వేచి చూడండి" చెప్పాడు.

అతడు చెప్పడని తేలిపోయింది. పేరన్నా అడుగుదామనుకుంది. అభిమానం అడ్డొచ్చి- సాయంత్రం లోపుగా పేరన్నా గుర్తుకురాకపోతుందా? అనుకుని- వాచి చూసుకుంటూ 'బాప్ రే చాలటైమ్ అయ్యింది ఇంకా నడవాలి అనుకుంటూ'.



"ఓ.కే. సాయంత్రం తెలుసుకుంటాను." చెప్పి ఆ ప్లాట్‌ఫాం దాటి రోడ్డు మీద నడకసాగించింది. అతడు డోర్ దగ్గరకు వచ్చి- ఆమె వెళుతున్న వేపు- కనపడేవరకు నవ్వుతూ చూస్తూ నుంచున్నాడు. ఆమె కనుమరుగు అయ్యే వరకు చూసి-

"తుమ్ కితిని ఖూబ్ సూరత్ హో..." అంటూ హమ్ చేస్తూ- చేసే పని ఏమి లేకపోవటంతో వేపచెట్టు వంక చూడసాగాడు. ఆ స్టేషన్‌లో అతడికి పని చాల తక్కువగా ఉంటుంది. వచ్చేపోయే ట్రైన్స్- అవి బయలుదేరే ముందు- అటువైపు స్టేషన్స్, ఇటువేపు స్టేషన్స్ నుంచి వచ్చే పాసింజర్స్. బండి ఆగినప్పుడు- టిక్కెట్ల కోసం వచ్చే పాసింజర్స్- టికెట్ లేకుండా ప్రయాణం చేసినవాడిని టి.సి. పట్టుకుని, తన దగ్గర నిలబెట్టటం- టి.సి.కి నచ్చచెప్పి, పాసింజర్‌ని మరొకసారి అలాంటి పని చేయవద్దని హెచ్చరించటం. ఇలాంటి చిన్న చిన్నవి తప్ప అతడు బాగా అలసిపోయేంత పని అతడికి లేదు. ఈ పనే అతడికి హాయిగా ఉందంటాడు.

* * * *

"ఆ! ఇప్పుడు చెప్పండి" నుదుటికి పట్టిన చెమట తుడుచుకుంటూ అడిగింది అఖిల విండో దగ్గర నిలబడి.

"నడచి వచ్చిన అలసట తీర్చుకోండి. లోపలికి వచ్చి కూర్చో కూడదు? అలా నిలబడే బదులు" ఆమె వంక చూస్తూ అన్నాడు.

"వద్దులెండి ఇక్కడ వేపచెట్టు గాలిలో హాయిగా ఉంది" చెప్పింది.

"లోపలికి రావటానికి భయమా?" అడిగాడు.

"నో! భయం మన దరిదాపులకి రావటానికి కూడా జంకుతుంది" తల విదిలిస్తూ అంది.

ఓ.కే. ఇవిగో మంచినీళ్ళు. విండో హోల్‌లో నుంచి గ్లాసు అందించాడు. అవి తీసుకుని "థేంక్స్" చెప్పింది. త్రాగిన గ్లాసు విండో లోపలి నుంచి అందుకున్నాడు.

అఖిల కుతూహలంగా- విండో లోపలికి చూసింది. అక్కడక్కడా గోడలకి చిన్న చిన్న స్లిప్స్ అంటించి ఉన్నాయి. వాటి మీద నీతి సూక్తులు వ్రాసి ఉన్నాయి. చేతి వ్రాతతో వ్రాసిన- ఆ సూక్తులు క్రిందగా- 'కర్ణ' అని ఉంది. ఆమె ఆలోచనలో పడింది. అది చూసి-

"చాలా దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. దేని గురించి?" అడిగాడు.

"పెద్ద పెద్ద మహా వ్యక్తులు చెప్పిన సూక్తులు గుర్తు ఉన్నాయి. వాళ్ళ పేర్లు గుర్తు ఉన్నాయి కాని- ఈ 'కర్ణ' ఎవరు?" అడిగింది ఆసక్తిగా-

"కర్ణ అనే పేరు మీరు వినలేదా?"

"సూక్తులు వ్రాసిన వ్యక్తుల్లో కర్ణ అనే పేరు చదవలేదు" అంది.

ఏం 'కర్ణుడు' అనుకోవచ్చుగా?"

"ఇంపాసిబుల్- కర్ణుడు అయితే- కర్ణ అని వ్రాయాల్సిన అవసరం ఉండదు" ఖచ్చితంగా చెప్పింది.

"కలియుగ కర్ణ అనుకోండి" చెపుతూ నవ్వాడు.

"తమరయితే కాదు కదా?" అనుమానంగా అడిగింది.

"హమ్మయ్య ఇంత ఉపోద్ఘాతం జరిగిన తరువాత అయినా- ఆ మాట అనగలిగారు" అన్నాడు.

"అంటే- మీకు ఇక్కడ చేసే పని ఏమీ లేక- ఇలా సూక్తులు వ్రాసుకుంటూ గోడలు పాడుచేస్తున్నారా?"

"ఏం చేస్తాను. ఇవి కాకపోతే పాడుకుంటూ ఉంటాను" చెప్పాడు.

"చాలా అదృష్టవంతులు, ఇంత

ప్రశాంతంగా ఉన్న ఈ ప్రదేశంలో మీరు పాడుకుంటున్నారు. చెట్లు, పక్షులు, కొండలు వింటుంటాయి మీ అద్భుతమైన గానాన్ని మిగతా చోట్ల ఇలా కుదురుతుందా?" అడిగింది

"ఇలాంటి చోట్లకి రావటానికి ఎక్కువగా ఎవరూ ఇష్టపడరు. అందుకే ఈ స్థానంలోంచి నేను కదలటం లేదు " చెప్పాడు

"ఇంతకు ముందు మీరు లేనప్పుడు ఒక వ్యక్తిని చూసానే."

"అవును. అతనికి మొట్టమొదటి పోస్టింగ్ ఇక్కడే అయ్యింది. ఇప్పుడు నైట్ డ్యూటీ అతడిదే. నేను వెళ్ళిన తరువాత- అతడి నైట్ డ్యూటీ ప్రారంభమవుతుంది. మేం ముగ్గురం ఉన్నాము. మేం ముగ్గురం మాకు అనుకూలంగా ఎడ్జస్ట్ చేసుకున్నాము డ్యూటీస్‌ని " వివరంగా చెప్పాడు కర్ణ.

"ఇంతకి అసలు విషయం చెప్పారు కాదు" అడిగింది.

"అయితే నేనెవరో ఇంతవరకు గుర్తురాలేదా?" అన్నాడు.

"ఊహూ!" తల అడ్డంగా తిప్పి అంది

* * * *

"తుమ్ కితిని ఖూబ్ సూరత్ హో...
యే మేరే దిల్ సే పూఛో.....
ఇన్ ధడకనోంసే పూఛో......
యే మేరే దిల్ పే దీవానా. . ."

అద్భుతంగా పాడుతున్న కర్ణని- మైమరచి చూస్తూ వింటున్నారు జనం

ఒకప్పుడు- మాధవపెద్ది రమేష్, చంద్రకాంత, కర్ణ. ఇత్యాది వాళ్ళు స్టేజి మీద పాటలు పాడుతుంటే- జనం వన్స్‌మోర్, వన్స్ మోర్ అనేవారు ఏ కొత్త సినిమా విడుదల అయినా- అందులోని పాటలు హిట్ అయినా- ఆ పాటలే జనాల నోట పలుకుతుండేవి. అప్పుడు కిషోర్ కుమార్ పాటలు ఎక్కువగా వినిపిస్తూ ఉండేవి. కర్ణ వాయిస్- అతికినట్లుగా కిషోర్ కుమార్ వాయిస్ లానే ఉండేది. అలా అని కర్ణ కిషోర్ వాయిస్‌ని ఇమిటేట్ చేసాడని అనటానికి వీలులేదు. ఎందుకంటే- అతడి కంఠం మొదటి నుంచి అలానే ఉండేది.

దానికి తోడు- కిషోర్ పాటలు

## "తుమ్ కితిని ఖూబ్ సూరత్ హో"

ఎక్కువగా ప్రచారంలో ఉండటంతో వీళ్ళు ఎక్కువగా ఆ పాటలే పాడుతుండటంతో- కిషోర్‌కుమార్ మన మధ్యకి వచ్చి పాడుతున్నాడా? అనిపించేది

కర్ణ పాడే పాటలలో- ఎక్కువగా- 'తమ్ కితిని ఖూబ్ సూరత్‌హో' పాట పాడించి వినిపించుకునే వారు. ఏ ప్రోగ్రాంలోనైనా- అతడు ఈ పాట పాడకపోతే- చీటీల మీద వ్రాసి స్టేజి మీదకు- కుర్రాడి చేత పంపేవారు ఆ పాట పాడమని

కర్ణ ఈ పాట పాడుతున్నప్పుడు- టీనేజ్ అమ్మాయిలంతా- తమకు తామే



అందగత్తెలమన్నట్లు ఓర ఓరగా అబ్బాయిల వంక చూసేవారు ప్రోగ్రాం మొదలు పెట్టగానే- ఈపాట పాడమనేవారు జనం అలా పాడగానే- 'ఇంక వినేశాంలే!' అనే భావం వాళ్ళల్లో కలగకుండా ఉండటానికి ముందుగా- వేరే పాటలు పాడి- మధ్యలో ఈ పాట పాడేవాడు.

గొంతులో- విషాదం పలికించే గాయకులలో ముఖేష్, కిశోర్‌కుమార్- ఈ ఇద్దరూ- విషాదగీతాలు పలికించిన క్యాసెట్స్ వినాలంటే-

గదిలో లైట్స్ ఆర్పివేసి- చిన్నగా డిమ్ లైట్ వేసుకుని- ఈ 'దర్ద్ భరే ఆవాజ్' (విషాదం పలికే కంఠం) టేప్ రికార్డ్ ఆన్ చేసి- కళ్ళు మూసుకుని వినాలి వీళ్ళ పాటలలోని మధురిమ, పాటలలోని అర్థం ఎంతో అద్భుతంగా ఉంటాయి. ఆ పాటలు విన్నప్పుడు కలిగే ఆనందం, ఆ ప్రశాంతత- మనకి ఎక్కడా కనిపించవు.

కర్ణ వాయిస్‌లో కూడా చాలా ప్రత్యేకత ఉంది. కొన్ని వేల మంది ఆడియన్స్ ముందు- అతడు ఎవరి వంకా చూడకుండా- పక్కన ఇన్‌స్ట్రుమెంట్‌తో- తన కంఠం కలిపి- తను ఒక ట్రాన్స్‌లోకి వెళిపోతున్నట్లుగా కళ్ళు మూసుకుని పాడతాడు అలా పాడటం వలనే- అతడి కంఠం అంత అద్భుతంగా ఉంటుందని- ప్రజల అభిప్రాయం ప్రతి పాటకి అతడు అదే విధంగా ఫాలో అవుతుంటాడు. అప్పుడప్పుడే యవ్వనంలోకి అడుగు పెడుతున్న అమ్మాయిలు- కర్ణ అంటే చాల ఇష్టపడేవారు కర్ణమాత్రం 'రాముడు మంచి బాలుడు' అన్నట్లు తన పాటలు- తన చదువు కాలేజి తప్ప- అమ్మాయిల గురించి ఆలోచించే తీరిక అతడికి లేదు తల్లి, తండ్రి క్రమశిక్షణలో పెరిగిన వ్యక్తి సరదాగా పాడుకుంటూ- అక్కడక్కడా ప్రోగ్రాంస్ ఇచ్చేవాడే కాని- అదే ప్రొఫెషనల్‌గా పెట్టుకోలేదు. అతడే కాని ప్రొఫెషనల్‌గా- పాటలే నా జీవితం అనుకుంటే- నేషనల్ గాయకుడు అయ్యేవాడు. ప్రతి గాయకుడిపాట, అన్ని రకాల భాషలలోని పాటలు పాడేవాడు.

* * * *

పాటల పోటీల్లో పాల్గొన్నప్పుడు- ఆడపిల్లలంతా కర్ణకే బహుమతి వస్తుందని నిర్ణయించేసారు. ఎప్పటికంటే అద్భుతంగా జరిగాయి పాటల పోటీలు. ముఖ్యంగా కర్ణ పాడిన ఒక విషాద గీతం , అందులో పలికించిన భావం, ఆ మధురిమ ప్రేక్షకులని ముగ్ధుల్ని చేసాయి . ఈ పాటకే బహుమతి వచ్చింది.

"కోయీ లౌటాదే మేరీ- బీతీ హువే దిన్" "రిపీట్"

"బీతే హువేదిన్ వో... మేరే ప్యార్ ఫల్ ఛీన్..."

(ఎవరైనా నా గడిచిపోయిన రోజులని తిరిగి ఇవ్వండి. గడచిపోయిన

# "డెంటల్ హెల్త్ క్విజ్" ③

1: పిల్లల్లో వుండే పాలపళ్ల సంఖ్య.

(ఎ) 10 (బి) 15 (సి) 20.

2. సాంకేతిక భాషలో పాలపళ్లను యీ విధంగా పిలుస్తారు.

(ఎ) మిల్క్ టీత్ (బి) డెసిడ్యుయస్ టీత్ (సి) చిల్డ్రన్ టీత్.

3. పాల దంతాలు, స్థిర దంతాలు కలిసి వుండడాన్ని యిలా అంటారు

(ఎ) మిక్స్‌డ్ డెంటిషన్ (మిశ్రమ ధంతాలు)(బి) డబుల్ డెంటిషన్ (సి) ఫాల్స్ డెంటిషన్.

4. పిల్లల్లో మొదటి స్థిర దంతం, యీ వయస్సులో వస్తుంది.

(ఎ) 6-7 సం.లు (బి) 5-8 సం.లు (సి) 4-6 సం.లు.

5. పిల్లల పాలపళ్లల్లో కన్పించని పళ్లు.

(ఎ) ప్రీ- మోలార్లు + జ్ఞానదంతం (బి) ప్రీ- మోలార్లు + మోలార్లు (సి) కెనైన్.

6. దవుడల్లో అసలు పళ్లు రాకపోవడాన్ని యీ విధంగా పిలుస్తారు.

(ఎ) ఎక్సోడాన్షియా (బి) ఎండోడాన్షియా (సి) ఎనోడాన్షియా.

7. చీల్చే పళ్లను యీ విధంగా పిలుస్తారు.

(ఎ) మోలార్లు (బి) ప్రీ- మోలార్లు (సి) కెనైన్లు.

8. పసి పిల్లల దవుడలలో మొదట వచ్చేపళ్లు.

(ఎ) చీల్చేపళ్లు (బి) కత్తిరించే పళ్లు (సి) విసురుడు దంతాలు.

9. పళ్లతో ఆహారాన్ని నమలడాన్ని యిలా అంటారు.

(ఎ) మాస్టికేషన్ (బి) క్రషింగ్ (సి) ఈటింగ్.

10. దవుడలలోని పళ్ల సంఖ్యను సూచించే సాంకేతిక పద్ధతిని యిలా పిలుస్తారు.

(ఎ) టీత్ కౌంటింగ్ (బి) డెంటల్ ఫార్ములా (సి) టీత్ ఫార్ములా.

జవాబులు

1. సి 2. బి 3. ఎ 4. బి 5. ఎ 6. సి 7. సి 8. బి 9. ఎ 10. బి

## "తుమ్‌కితినిఖూబ్ సూరత్ హో"

రోజుల్లో నా ప్రేమ ఫలాన్ని లాక్కున్నారు.)

తరువాత పాట 'తుమ్ కితిని ఖూబ్ సూరత్ హో'- కళ్ళుమూసుకుని- ట్రాన్స్‌లోకి వెళ్ళిపోతున్నట్లుగా పాడుతున్న అతడికి -కళ్ళు తెరచి చూసేసరికి- అర విరిచిన లేత గులాబి మొగ్గలా ఉన్న అఖిలని చూడటం జరిగింది. అఖిల తన ప్రక్కన కూర్చున్న ఇంకో అమ్మాయికి- స్టేజి వంక చూపుతూ మాట్లాడుతుంది.

ఆ అమ్మాయిని చూసిన కర్ణకి - 'ఖూబ్ సూరత్-' అంటే ఈ అమ్మాయే అనిపించింది. అలా అతడిని ఆకర్షించిన అమ్మాయిని చాలసార్లు బజారులో, పిక్చరులో- ఫ్రెండ్స్‌తో వెళుతున్నప్పుడు ఎన్నో సార్లు చూసాడు. కాని పులకరించ లేకపోయాడు. అతడితోపాటు ఎవరో ఒకరు ఉండటం, ఆ అమ్మాయితోపాటు ఎవరో ఉండటం.

ఫ్రెండ్స్‌తో ఉన్నప్పుడు- రోడ్డు మీద వెళుతున్న అఖిలని ఆపి మాట్లాడుకోవటం- అందులోను అల్లరి అబ్బాయి లయిన తన స్నేహితులు ఉండగా ఆ అమ్మాయిని పలుకరించ లేకపోయాడు. ఎందుకంటే- తరువాత అల్లరి పెట్టేస్తారని. ఎట్లాగో ఆ అమ్మాయి పేరు మాత్రం తెలుసుకోగలిగాడు. కాలక్రమేణా- రోజులు, నెలలు, సం.లు గడచిపోతున్నాయి.

కాని కర్ణ మనసులో రూపుదిద్దుకున్న ఆ అమ్మాయి రూపం మాత్రం చెక్కు చెదరలేదు. తరువాత- తరువాత అతడు పాటలు పాడటం తగ్గించేసాడు. స్నేహితులు ఎవరికి వారు- ఎక్కడెక్కడికో వెళ్ళిపోయారు. చదువు పూర్తి అయిన తరువాత టెంపరరీగా ఎన్నో ఉద్యోగాలు చేసాడు.

ఎక్కడ ఉన్నా- అతడికి- నోటి వెంట ఖూబ్ సూరత్ పాట విని పిస్తూ ఉండేది. స్టార్ హోటల్స్‌లో- కొన్నాళ్ళు 'సింగర్'గా చేరాడు. అక్కడి పద్ధతులు, ఆ వ్యవహారం అతడికి నచ్చలేదు. అలా ఎన్నో ఉద్యోగాలు మారి- మారి- ఆఖరికి- పర్మినెంట్‌గా

రైల్వేలో జాయిన్ అయ్యాడు. అతడి పాటలకి పూర్తిగా ఫుల్‌స్టాప్ పడిపోయింది. సాదా సీదాగా అతడు జీవిస్తున్నాడు. ఎక్కడ ఉన్నా- ఎలా ఉన్నా- అఖిల మాత్రం అతడి ఊహల్లో మెదులుతూనే ఉంది.

* * * *

"ఇదీ సంగతి ఇప్పటి కయినా గుర్తు వచ్చిందా?" అడిగాడు.

"ఎప్పటి మాట చాల చిత్రంగా ఉందే! మన ఇద్దరం కలసి మాట్లాడుకోలేదు. పరిచయం చేసుకోలేదు. అయినా నేను మీకు అంత గుర్తు ఉన్నానంటే- ఆశ్చర్యంగా ఉంది. ఎన్నో సం.లు గడచిపోయాయి. మేం ఆ ఊరు వదిలి వెళ్లిపోయాము కాలగమనంలో ఎన్ని మార్పులు- మీ జ్ఞాపక శక్తికి నా జోహార్లు" నవ్వుతూ చెప్పింది.

చిరు చీకటి పడసాగింది. పక్షులు వేప చెట్టుమీద చేరి గోల గోలగా అరుస్తున్నాయి. అఖిల వాచి చూసుకుంది "మాటలలో పడి సమయం తెలియలేదు. అవును ఇంతవరకు ట్రైన్ రాలేదేమిటి?" అడిగింది.

"లైన్ సరిగ్గా లేదు. మధ్యాహ్నం నుంచి ట్రైన్స్ ఆలస్యంగానే వస్తున్నాయి" చెప్పాడు.

'మీరు ఎక్కడ ఉంటున్నారు?' అడిగింది.

"ఈ స్టేషన్‌కి నాలుగు స్టేషన్ల అవతల ఉంటున్నాను. నా డ్యూటి కూడా అయిపోయింది. ట్రైన్ ఆలశ్యం వలన, నా కొలీగ్ కూడా రావటం ఆలశ్యం అయ్యింది. అతడు వచ్చే ట్రైన్‌లో మీరు వెళతారు. మీకు ఎదురు వచ్చే ట్రైన్‌లో నేను వెళతాను" చెప్పాడు.

"మీకు క్వార్టర్స్ ఇస్తారు కదా? ఇక్కడ దగ్గరలో క్వార్టర్ ఏమీ లేదా?" అడిగింది.

'ఉంది. ఇప్పుడు చీకటి పడింది. రేపు చూపిస్తాను ఆ క్వార్టర్. పగలంతా గడపవచ్చుగాని- రాత్రిపూట మాత్రం ఈ ప్రదేశం శ్మశాన నిశ్శబ్దంగా ఉంటుంది' అన్నాడు.

ఇంతలో అటు వెళ్ళే ట్రైన్- ఇటువచ్చే ట్రైన్ రెండు వస్తున్నట్లుగా సూచన అందుకుంటూ- తన పనిపూర్తి చేసుకుంటున్నాడు. ట్రైన్ ఆలస్యం వల్ల- అక్కడక్కడా సిమెంట్ బెంచీల మీద కొంతమంది మనుష్యులు కూర్చుని ఉన్నారు వెయిట్ చేస్తూ-

ట్రైన్ రావటంతో కొంచెం హడావిడి మొదలు అయ్యింది. అతడి దగ్గర వీడ్కోలు తీసుకుని ట్రైన్ ఎక్కి చేయి ఊపింది అఖిల.

* * * *

అఖిల తన పని త్వరగా పూర్తిచేసి వడి వడిగా అడుగులు వేయసాగింది ఈ రోజు కర్ణ వాళ్ళింటికి రమ్మని ఆహ్వానించాడు త్వరగా వస్తే ఇద్దరం కలిసే వెళదామని చెప్పాడు.

ఆమె స్టేషన్‌కి చేరుకునేసరికి, అప్పుడే లోకల్ ట్రైన్ వచ్చి ఆగివుంది. కర్ణ అఖిల కోసం చూస్తూ కంపార్ట్ మెంటుకి సమీపంలో నిలబడి ఉన్నాడు ట్రైన్ కదలబోతుండగా- ఆయాసపడుతూ- ప్లాట్‌ఫాం మీదకు పరుగుతీసి- కంపార్ట్‌మెంటు ఎంట్రెన్స్‌లో నిలబడిన కర్ణ తన చేయి ఆమెకి అందివ్వగా- ఆ చేయి పట్టుకుని ఎక్కింది. ట్రైన్ ప్లాట్‌ఫాం దాటింది.

"హమ్మయ్య గుండె దడ ఇప్పటికి తగ్గింది" అంది.

ఈ మాత్రం దానికే అంత గుండె దడనా? అడిగాడు.

"ట్రైన్ మూవ్ అవుతుంటే ఎక్కటం చాలకష్టం. మీరంతా రన్నింగ్ ట్రైన్‌లోకి ఎలా ఎక్కుతారో తెలియదు" అంది.

"అలవాటు అంతే" అన్నాడు.

ఏదయినా గాని- అంత పరుగులు పెట్టి వెళ్ళాలి వస్తే కొంచెం ముందుగా బయలుదేరాలి. అంతేగాని. ఇలా హడావిడిగా వెళ్ళి -ప్రాణాలకి అపాయం తెచ్చుకునే పరిస్థితికి మాత్రం, నేను ఇష్టపడను" అంది ఆలోచిస్తూ.

"మరి త్వరగా రావచ్చు కదా?" అన్నాడు.

"మీ రైల్వే డిపార్ట్‌మెంట్ ఇంత ఖచ్చితంగా టైమ్ మెయిన్‌టెయిన్ చేస్తుందని తెలియక" అంది.

"ఏమైనా మీ విషయాలు చెప్పండి' అంది మాట మార్చి

"ముందు మీ విషయాలు చెప్పండి" అన్నాడు

"చెప్తానుగాని ఒక పాట పాడండి. ఇక్కడ మన ఇద్దరిమే కదా ఉన్నాము" అంది

"ఇక్కడ మన ఇద్దరం ఉన్నా- మీవెనక- నా వెనుకా ఉన్న వాళ్ళు వచ్చేసి ఇక్కడే కూర్చుంటారు" అన్నాడు.

"పోని ఈ విధంగా అయినా మీ పాట వినే అదృష్టం వాళ్ళకి కలుగుతుంది. ఇదొక కొత్త రకం ప్రోగ్రాం అనుకుంటారు" చెప్పింది.

"ఏ పాట పాడనూ? అదే పాటనా?" అడిగాడు.

## జెబాపై సల్మాన్ కన్ను



రాజ్‌కపూర్ ఫిలిమ్స్ బేనర్ క్రింద తయారవుతున్న 'హెన్నా'లో హీరోయిన్‌గా నటిస్తున్న జెబాపై సల్మాన్‌ఖాన్ కన్నేశాడు ఆ పిల్లను ఎత్తుకు పోవాలని పథకం వేశాడుట ఈ విషయమై సల్మాన్ ఖాన్‌కు-చింపూ కపూర్‌కు మధ్య గొడవైంది. ఈ చిత్రం షూటింగ్ జరిగే మనాలీలో రెండేళ్లక్రితం ఒక హోటల్లో జరిగిన పార్టీలో వీళ్లిద్దరూ కొట్టుకున్నారట అప్పట్నుంచి వీళ్లిద్దరిమధ్యా పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటోంది ఆ కోపం మనసులో పెట్టుకొనే సల్మాన్‌జెబాను ఎత్తుకు పోదామని అనుకోనుంటాడు

"వద్దు వేరే ఏదైనా పాడండి. ఎప్పుడూ అదే పాటనా?" అంది.

"ఆ పాట నాకు చాల ఇష్టం. ఆ పాట పాడుతూ మిమ్మల్ని ఊహించుకుంటూ ఉంటాను" అన్నాడు.

"మీరు వంటరిగా ఉన్నప్పుడు పాడుకోండి. ఇప్పుడు వద్దు."

అతడు ఆమె వంక ఒకసారి చూసి- కళ్ళు మూసుకుని ట్రాన్స్‌లోకి వెళ్లిపోతున్నట్లుగా-

"జిందగీకే సఫర్ మే గుజర్ జాతిహై....

జో మకా... ఓ ఫిర్ నహి ఆతీ .. ఓ ఫిర్ నహి ఆతీ...."

అలలు అలలుగా తేలివస్తున్న అతడి గానం ఆ గానంలోని విషాదం, ఆ పాటలోని మధురిమ, ఆ పాట అర్థం విని- ఆ కంపార్ట్‌మెంట్ లోని వారందరూ ఒక చోట చేరి తన్మయంగా విన్నారు. పాట పూర్తి అయి కళ్ళు తెరచిన కర్ణకి- చప్పట్లు కొడుతూ- మెచ్చుకోలుగా తన వంక చూస్తున్న ప్యాసింజర్స్‌ని చూసి- చిన్నగా నవ్వాడు.

దిగవలసిన స్టేజి రావటంతో అదే ఆఖరి స్టేషను- అక్కడి నుంచి మళ్ళీ లోకల్ ట్రెయిన్ పెద్ద స్టేషనుకి బయలుదేరుతుంది. ఆ ట్రైన్ ఇంజన్- విడివడి ఇటు కంపార్ట్‌మెంట్‌కి ఎటాచ్ అవటానికి సిద్ధం కాసాగింది. ఒక పదిహేను నిముషాలకి బయలుదేరుతుంది

ఫ్లాట్‌ఫాం మీదకి దిగిన- అఖిల

## "తుమ్ కిత్నీ ఖూబ్ సూరత్ హో"

కాసేపు అక్కడే నిలబడి కర్ణ చెపుతున్న విషయాలు వింది. అక్కడే సమీపంలో గల రైల్వే క్వార్టర్ సమీపించారు ఇద్దరూ.

కొంతమంది పిల్లలు గోల గోలగా ఆడుకుంటున్నారు. కర్ణని చూడగానే నలుగురు పిల్లలు 'డాడీ' అంటూ చుట్టూ నిలబడిపోయి- అఖిలని చూసి ఆగిపోయారు. కొత్త మొహం కావటంతో-

"మా పిల్లలు. శ్వేత, సంస్కృతి, ప్రథమ్, ద్వితీయ్ ఈమె ఆంటీ" అని పరిచయం చేసాడు కర్ణ

"చాలా అందమైన పేర్లు" మెచ్చుకుంటూ అంది. ఈ లోపుగా పిల్లలు లోపలికి వెళ్ళి- "ఎవరో కొత్త ఆంటీ వచ్చారు." అని చెప్పడంతో- ఆమెని ఆహ్వానించడానికి బయటకు వచ్చిన భార్యని చూసి-

"నా భార్య రెయినా- ఈమె అఖిల." అంటూ ఒకరికొకరిని పరిచయం చేసి లోపలికి వెళ్లిపోయాడు కర్ణ. అఖిల రెయినా వంక ఒకసారి చూసి పలకరింపుగా నవ్వి ఆమెతోపాటు లోపలికి వెళ్ళి కూర్చుంది. మంచి నీళ్ళు ఇవ్వాలని లోపలికి వెళ్ళింది రెయినా.

రెయినా- సామాన్యంలో- ఇంకా సామాన్యంగా ఎటువంటి ప్రత్యేకతలు లేకుండా ఉంది. ఇల్లు చాల శుభ్రంగా. పిల్లలు శుభ్రంగా, ఆ ఇంట్లోకి రాగానే- మనసుకి, ఆహ్లాదంగా ఉన్నారు. ఎటువంటి డాబులకి పోకుండా-సింపుల్‌గా, ప్రశాంతంగా జీవిస్తున్నట్లుగా ఉన్నారు ఆ కుటుంబం . రెయినా గ్లాసుతో నీరు తెచ్చి, అఖిలచేతికి ఇచ్చింది. 'థేంక్స్' చెప్పి తీసుకుంది.

ఈ లోపుగా- కర్ణ మొహం వాష్ చేసుకుని- టవల్‌తో తుడుచుకుంటూ వచ్చి-

"రెయినా- కాఫీ, ఏదైనా టిఫిన్ చేసి తీసుకురా" చెప్పాడు. ఆమె లోపలికి వెళ్ళింది. ఆమె వెనుకనే- అఖిల కూడా వెళ్ళింది. "కాఫీ చాలు-టిఫెన్ ఏమి చేయవద్దు " అంది.

"మొట్ట మొదటిసారిగా మా ఇంటికి వచ్చారు. అందులోను- మా వారి చిన్ననాటి స్నేహితురాలు. నేను చెయ్యకుండా ఉండలేను. మీ బలం వంతం మీద నేను చెయ్యలేదనుకోండి ఆయనే స్వయంగా వచ్చి చేస్తారు." చెప్పింది ఉల్లిపాయలు కోస్తూ.

అఖిల రెయినా మాట్లాడుతున్నంతసేపూ ఆమె మొహాన్ని గమనించసాగింది. ఆమె మామూలుగా మాట్లాడుతుందా? లేక ఏదైనా అనుమానంగా మాట్లాడుతుందా? అని- అటువంటి దేమి ఆమె మొహంలో కనిపించలేదు. చాల స్వచ్ఛంగా, కలుపుగోలుగానే మాట్లాడసాగింది.

"అంటే మొట్టమొదటి సారి వస్తేనే- మర్యాద చేసినట్లా? రెండవసారి వస్తే బయటనుంచే పంపించేస్తారా?" ఆమె చేస్తున్న పని తను అందుకుంటూ అంది

"ఛ. ఛ అలా అనికాదు" నొచ్చుకుంటూ అంది.

"మీరు అంత నొచ్చుకుంటారు. ఏమిటి? సరదాగా అన్నాను

అంతే- నవ్వుతూ అంది అఖిల రెయినా చేతిలోని శెనగపిండి డబ్బా అందుకుంటూ-

ఇద్దరూ కలసి- పకోడీలు, కాఫీ తయారుచేసారు. పిల్లలు, కర్ణ- అందరూ తలా ఒక ప్లేట్ అందుకుని కబుర్లు చెప్పుకుంటూ తిన్నారు.



ఆ కుటుంబం స్నేహానికి విలువనిచ్చే వాళ్ళుగా ఉన్నారు.

కర్ణని పాటలు పాడమని పిల్లలు గొడవ చేయసాగారు

"ఇంటికి రావటంతోనే- పిల్లలు ఆయన్ని పాట పాడమని గొడవ చేస్తుంటారు" చెప్పింది రెయినా

"అయితే పిల్లలకి కూడ కర్ణగారి పాటలు అంటే ఇష్టమన్నామాట. నేను కూడా వీళ్ళకి తోడు. పాడండి" అంది అఖిల.

"మరి నీ అభిప్రాయమో?" అడిగాడు కర్ణ.

"ఎప్పుడైనా కాదన్నానా? మీరు పాడతానంటే" చిరుకోపంగా అడిగింది

"పాడు డాడీ" ఏక కంఠంతో అన్నారు పిల్లలు

"ఓకే. ఓకే." అంటూ గొంతు సవరించుకుని-

"ధూ ప్ మే నికలా నకరో.
రూప్‌కి రాణీ
గోరా రంగు కాలాస పడ్ జాయే...."

పాట పూర్తి అవుతుండగానే- ఇంకొకటి అని అరిచారు.

"ప్రథమ్ అంటే నీ గొంతు విని లేదు కాబట్టి నీవు పాడు." చెప్పాడు కర్ణ

"మీ అబ్బాయి కూడ పాడతాడా?" ఆశ్చర్యంగా అడిగింది.

"వింటే ఆశ్చర్యపోతారు. వాడి వయసు పన్నెండేళ్ళు అయినా- వాడు పాడే పాటలు ఎంతో విషాదంగా ఉంటాయి. వినండి. ఆ కంఠంలో- అంత విషాదం ఎలా పలికిస్తాడో తెలియదు. వాడు పాడగలడని నాకే తెలియదు వాడి ఫ్రెండ్స్ చెప్పగా తెలిసింది ఆయన ఏ రోజూ శ్రద్ధగా కూర్చుని నేర్పినది లేదు." అంది రెయినా.

"ఊ స్టార్ట్ చెయ్యి" అన్నాడు కర్ణ.

అఖిల ఇంట్రస్టింగ్‌గా ప్రథమ్ వంక చూడసాగింది.

"ఝూమ్‌తీ చలీ హవా ..
ఫిర్ భులాగయా కోయీ . ...
భుజితి భుజితి ఆగ్ కో.....
ఫిర్ జలాగయా ... కోయీ.....
ఝూమ్"

(తిరిగుతూ వెళ్ళిపోతున్న గాలిని మళ్ళీ ఎవరో పిలిచారు ఆరిపోతూ- ఆరిపోతూ ఉన్న నిప్పుని మళ్ళీ ఎవరో వెలిగించారు)

"వెల్ డన్ మైడియర్ సన్- ఇంత విషాదమైన పాట- ఇంత మధురంగా నీ గొంతులోంచి వింటుంటే- నా మనసు ఎందుకో బరువుగా అయిపోయింది ప్రథమ్

చాల వింతగా ఉంది ఎంత బాగా పాడావు. ఇంత చిన్న వాడు అంత విషాదం పలికించటమా? నిజంగా ఎంత బాగుంది నీకంఠం. ఇక్కడి వాతావరణం బరువుగా ఉన్నట్లు లేదూ?" అడిగింది అఖిల ప్రథమ్ తల నిమురుతూ- అవునన్నట్లుగా తల ఊపింది రెయినా-

"ఎక్కడ నేర్చుకున్నావు బాబూ?" అడిగింది.

"డేడీ పాడుతున్నప్పుడు శ్రద్ధగా వినేవాడిని- అలా అలా అలవాటయిపోయింది" చెప్పాడు ప్రథమ్ సిగ్గుపడుతూ-

"రెయినా-మీ ఇంట్లో ఒక కిశోర్‌కుమార్, ఒక ముఖేష్‌ల వారసులు ఉన్నారు. ఇంతకంటే అదృష్టం ఏం కావాలి. చక్కని కంఠం ఉండటం ఎంత మందికి లభిస్తుంది మీ అబ్బాయిని ఎంకరేజ్ చేస్తుండండి" చెప్పింది.

"అలాగే" అన్నట్లు తల ఊపింది.

"అవును అడగటమే మరచిపోయాను. మీరు ప్రోగ్రాంస్ ఇవ్వటం ఎందుకు మానేసినట్లు?" అడిగింది అఖిల కర్ణని.

"చెప్పానుగా జీవితాన్ని బిజీగా గడపాలనుకోలేదు. భార్యా, బిడ్డలకి దూరం కావాలనుకోలేదు. అందుకే- ఎన్ని ఆఫర్స్ వచ్చినా- తిరస్కరించాను. ఇలా జీవించటమే బాగుంది" రెయినా వంక చూస్తూ చెప్పాడు. భర్త వంక ప్రేమగా చూసింది.

మంచి కంఠం ఉండి- అద్భుతంగా పాడగలిగే నేర్పు ఉండి- వచ్చిన ఆఫర్స్‌ని కాలదన్నుకునేవారిని మిమ్మల్ని

## చిట్కాలు



### రసం త్వరగా తీయాలంటే!

నిమ్మకాయ రసం తొందరగా రావాలంటే ఐదునుంచి ఎదు నిమిషాలు వేడినీళ్ళలో వుంచి ఆ తరువాత రసం పిండాలి!

### ఫ్రిజ్ ఎలర్జీ

పుచ్చకాయను ఎక్కువ రోజులు ఫ్రిజ్‌లో ఉంచరాదు అలా అయితే రంగు రుచి వాసన కోల్పోతుంది

అలాగే అరటిపండ్లను ఫ్రిజ్‌లో వుంచకూడదు ఉంచితే తీప తగ్గిపోతాయి





### చెడిపోకుండా ఉండాలంటే...

మామిడిపండ్లను ఎండుగడ్డిపై పరిచి వుంచితే కుళ్ళిపోకుండా వుంటాయి. ద్రాక్షపండ్లు గాలిదూరే వెదురు బుట్టలో వుంచితే కుళ్ళిపోకుండా వుంటాయి వీటిని తినే ముందే కడగాలి ముందే కడిగి వుంచితే కుళ్ళువాసన వస్తాయి

–కె వాణీప్రభాకరీ

ఒక్కడినే చూసాను" అంది అఖిల.

"నాకు జీవితం తృప్తిగా ఉంది. ఉన్నదానిలో హాయిగా జీవిస్తున్నాను. ప్రోగ్రాంస్ ఇవ్వటం దానిలో పేరు, ప్రఖ్యాతలు, బిజి, బిజీలైఫ్. పది నిముషాలు కుటుంబ సభ్యులతో గడిపే అవకాశం ఉండదు. ఎంత సంపాదించినా- పేరు, ప్రఖ్యాతులు వచ్చినా- జీవితంలో కొన్నిటిని త్యాగం చెయ్యాల్సి వస్తుంది. ఆ త్యాగం ఆ ఉరవడిలో గొప్పగానే ఉండవచ్చు- తరువాత రిలైజేషన్- అనుభవించాల్సిన వయసు దాటి పోయిన తరువాత- ఆలోచించి ప్రయోజనం ఏముంది?" అతి సామాన్యంగా చెప్పాడు కర్ణ.

అతడి మాటలకు అబ్బురపడుతూ చూసింది అఖిల

"అది సరేగాని- ఎంతసేపు మేము మాట్లాడటమేనా?" మీ గురించి ఏమి చెప్పరే అన్నాడు.

"నా గురించి చెప్పటానికి ఏమీ లేదు" ఎటో చూస్తూ అంది అఖిల.

"చెప్పటానికి ఇష్టం లేకపోతే వద్దు" అన్నాడు.

"అలా అని కాదు నాకు అనుభవాలు, త్యాగం, జీవితం అంటూ ఏమీ లేదు, వికలాంగుల స్కూల్లో పనిచేస్తున్నాను నేను రోజూ వెళ్ళేది అక్కడికే-" నెమ్మదిగా అంది.

"అంటే పెళ్ళి చేసుకోలేదా?" ఆమెని పరిశీలనగా చూస్తూ అన్నాడు.

చేసుకోవాలనే అనుకున్నాను. కాని- కాలం కాటేసింది" అంది. వాచి చూసుకుంటూ ఇంక వెళ్తాను అన్నట్లుగా లేచి నిలబడింది.

"భోజనం చేసి వెళ్ళండి కాసేపు ఆయన చేత పాటలు పాడి వినిపించుకుందురుగాని" అంది రెయినా- అఖిల మొహంలో కనిపిస్తున్న నీలి నీడలు చూసి- ఆమె చాల బాధపడుతున్నట్లుగా ఉందని- వాతావరణం చాల బరువుగా ఉన్నట్లు- మళ్ళీ అఖిలని మామూలుగా చెయ్యాలని అనుకుంది రెయినా.

"వద్దు నేను వెళ్ళేటప్పటికి చాల రాత్రి అయిపోతుంది. ట్రైన్ దిగిన తరువాత- కొంచెం నడవాలి" అంది

'దగ్గరలో ఇల్లు చూసుకోక పోయారా?' ఇలు స్కూలుకి వెళ్ళాలన్నా- అటు

## కొడుకును అమ్మబోయిన దంపతులు

విశ్వామిత్రుడి కిచ్చిన మాట నిలబెట్టు కొనేందుకు అలనాడు సత్య హరిశ్చంద్రుడు భార్యా బిడ్డల్ని సైతం అమ్ముకున్నాడన్న సత్యం అందరూ ఎరిగినదే కాని ఈనాడు తమకున్న అప్పుల్ని తీర్చలేక డబ్బుకోసం కన్నకొడుకుని అమ్ముకునేందుకు సిద్ధపడ్డారట ఒక దంపతులు.

ఆగ్నేయ విక్టోరియాలోని ఒక పట్టణంలో నివసించే ఫిలిప్, జుధవాల్టర్ అనే దంపతులు తమకున్న ముగ్గురు కొడుకుల్లో ఒక కొడుకును అమ్ముతామని ప్రకటించారట. వారు చేసిన అప్పులు 15 వేల డాలర్లున్నాయని అంత మొత్తానికే కొడుకును అమ్మజూపారు. సత్యధర్మ పరిపాలనాదీక్షతో ఆనాడు హరిశ్చంద్రుడు ఆలుబిడ్డల్ని అమ్ముకుంటే, నేడీ దంపతులు తాము చేసిన అప్పుల్ని తీర్చేందుకు స్వార్థంతో కన్నకొడుకునే అమ్మజూపారు. ఇదెక్కడి కలికాలమో?

## "తుమ్ కిత్నీ ఖూబ్ సూరత్ హో"

ఇంటికి వెళ్ళాలన్నా అంతంత సేపు నడిచే చోట ఇల్లు ఎందుకు తీసుకున్నారు?" అడిగింది రెయినా-

"కొంత దూరం నడవటం వలన- శరీరానికి వ్యాయామం చేసినట్లుగా ఉంటుంది రాత్రి పడుకోబోయే ముందు- ఇంక ఏ ఆలోచనలు నా మనసులో చోటు చేసుకోకుండా నిద్ర ముంచుకువచ్చేస్తుంది. మామూలుగా అయితే- నాకు టైమ్ చాలా తక్కువ- ఈ విధంగా అయితే నాకు ఎక్సర్ సైజు అయినట్లు ఫీల్ అవుతాను" చెప్పింది అఖిల.

"ఆలస్యం అయితే పరవాలేదు. కొంతదూరం వరకు ఆయన్నే పంపిస్తాను తోడుగా"అంది రెయినా-

"వద్దు భయమని కాదు మళ్లీ కర్ణగారు ఎందుకు? ఉంటానులే. భోజనం చేసే వెళతాను" అంది. అఖిలకి ఆ ఇంట్లోంచి వెళ్ళబుద్ధి కావటం లేదు. ఒంటరిగా ఇన్నాళ్ళు ఉంది. ఇప్పుడు సరదాగా మాట్లాడుతున్న ఆ కుటుంబాన్ని చూస్తుంటే- ఎంతో ముచ్చటగా ఉంది. అదే మాట రెయినాతో అంటే- మృదువుగా నవ్వి ఊరుకుంది.

పిల్లలు హోంవర్క్ చేసుకుంటామని ముందు వరండాలోకి వెళ్ళారు. రెయినా కూరలు తీసుకువచ్చి- అక్కడే కూర్చుని- కత్తిపీట ముందేసుకుని- కూరలు తరగసాగింది.

అఖిల-పిల్లలు వరండాలో కూర్చుని చదువుకుంటున్నారని చూసి- మొదలు పెట్టింది. తను చెప్పబోయే విషయాలు.

"ఇందాక పిల్లలు ఎదురుగా ఉన్నారని చెప్పలేదు. ఈ విషయాలు వింటే వాళ్ళ మనసులు పాడవుతాయి."

"కొన్ని సం.లు క్రితం-నాకు పెళ్ళి నిశ్చయం చేసారు. నన్ను చేసుకోబోయే వ్యక్తి- మంచి పొజిషన్‌లో ఉన్నవారు. చాల ఆస్తిపాస్తులు. ఒక్కరే సంతానం- తల్లి, తండ్రికి గారాల పుత్రుడు- అందం ఐశ్వర్యం, హోదా అన్నీ ఉన్నాయి. అటు వాళ్ళకి, ఇటు వాళ్ళకి పూర్తిగా ఇష్టమయిన సంబంధం. నన్ను కోరికోరి చేసుకుంటామని ముందుకు వచ్చారు."

అవును. మిమ్మల్ని వదులుకోవటానికి ఏ వ్యక్తి ఇష్టపడదు. చూసిన మొదటి క్షణంలోనే- మీ ఆకర్షణలో పడిపోతారు" అంది రెయినా అఖిల మాటలకి అడ్డువస్తూ.

"అందుకే- దేవుడు చాల పెద్ద శాపం ఇచ్చాడు" రెయినా వంక చూస్తూ అంది అఖిల.

"ఊ ప్రోసీడ్" అన్నాడు కర్ణ.

"పెళ్ళి ఒక నెల ఉందనగా- ఆయన అప్పుడప్పుడు మా ఇంటికి వస్తూ ఉండేవారు. అవి, ఇవి మాట్లాడేవారు. పిక్చర్స్‌కి, షికార్లకి, షాపింగ్‌లకి వెళుతుండేవాళ్ళము. ఇంట్లో ఎవరూ అభ్యంతరం పెట్టలేదు కాబోయే భార్యా, భర్త అని ఫ్రీగానే వదిలారు. పెళ్ళికి నాకు ఏమేమి పెట్టాలనుకున్నారో అన్ని సమస్తం తన చేతుల మీదుగానే కొన్నారు. నాకు ఏ చీరలు నప్పుతాయో? ఏ కలర్స్ బాగుంటాయో! చెపుతూ సెలెక్ట్ చేసేవారు. పెళ్ళికి ముందే- మేము చాలా హేపీగా తిరిగాము. ఒకరికొకరం బాగా పరిచయం ఉన్న వాళ్ళలాగ మెలిగాము.

కాని హద్దుమీరలేదు. ఆ విషయంలో ఇద్దరికి ఖచ్చితమైన కండిషన్ పెట్టుకు న్నాము."

"ఎటువంటి పరిస్థితుల్లో హద్దు మీర కూడదని- అలాచేస్తే- మొదటి రాత్రి థ్రిల్ ఉండదని- ఆ హద్దు మాత్రం ఆ రోజు మాత్రమే అని చెప్పకున్నాము."

"ఆ రోజు పిక్చర్‌కి వెళ్ళి వచ్చి- భోజనం చేస్తూ- నాన్నగారితో అన్నారు. మీ అమ్మాయికి ఇంకా ఏమేమి కావాలో అన్ని ఆలోచించుకుని లిస్ట్ వ్రాయమ నండి. ఈసారి వచ్చేటప్పుడు బాకీ ఉంచ కుండా మొత్తం కొనేస్తాను."

"నాకేం తెలుసు. నేనేం అడగను. మీతోటే అమ్మాయిని తీసుకువెళుతు న్నారుగా. మీరే అడిగి తెలుసుకోండి" అన్నారు నాన్న. అమ్మ మా సంభా షణ నవ్వుతూ వింటూ- కావలసినవి వడ్డిస్తుంది.

"ఇంక కొద్దిరోజులే ఉంది. పెళ్ళికి- ఇంకా చేయవలసిన పనులు చాల ఉన్నాయి." అన్నారు నాన్నగారు. భోజనం పూర్తి అయ్యింది. ఆయన ఆ రోజు బెంగుళూరు వెళ్ళవలసి ఉంది. టైమ్ అయిపోతోందని- సూట్‌కేస్ తీసు కుని బయటపడ్డారు. నాన్నగారు స్టేష నుకి వస్తానంటే- వద్దని- నేనే కారు బయటకు తీసి డ్రైవ్ చేసాను. మేం స్టేషన్‌కి వెళ్ళేసరికి- ట్రైన్ సిద్ధంగా ఉంది ప్లాట్‌ఫాం మీద. ఇద్దరం పరు గులు పెడుతూ- మెట్లు ఎక్కి అవతల ప్లాట్‌ఫాం మీదకు చేరుకునే సరికి ట్రైన్ మూవ్ అయ్యింది.

'మూవ్ అవుతున్న ట్రైన్‌ని కాచ్ చెయ్యాలని- ట్రైన్‌కి అనుకుని- ఫస్ట్ క్లాస్ కంపార్ట్‌మెంట్ ఎక్కబోతూ- నా వంకచూసారు. మా ఇద్దరి చూపులు కలుసుకోలేదు- ట్రైన్ వెళిపోతున్నట్లుగా ఆయనకి అనిపించిందేమో- హేండిలింగ్ పట్టుకుని- కంపార్ట్‌మెంటు మెట్టుమీద కాలుపెట్టటం చూసాను. ఆ తరు వాత ట్రైన్ వెళ్లిపోయింది. పట్టాల మీద ఆయన రెండు కాళ్ళు- మాంసం ముద్దలు అయిపోయాయి. ఆయన బేలన్స్ తప్పి పడిపోయారు. ఆ తరు వాత ఎలా ఇంటికి ఫోన్ చేసానో నాకు ఇప్పుడు గుర్తు లేదు. బ్రతికి ఉన్నా కూడా ప్రాణం లేని శవంలానే ఉండే దానిని-'

"ఆయనని హాస్పటల్‌లో అడ్మిట్ చేసారు. వెళుతున్నాం, వస్తున్నాం. పెళ్ళి ఇల్లు శ్మశానంలా ఉంది. శుభా కాంక్షలు చెప్పవలసిన ఆ ఇంట్లో - కండో లెన్స్‌లు ఎక్కువగా వినిపిస్తున్నాయి"

"ఎందరో ఎన్నెన్నో అంటున్నారు వింటున్నాం. బాగా డబ్బుగలవారు కాబట్టి ఆర్టిఫిషియల్ లెగ్స్ అమ ర్చవచ్చు" అంటూ ఏవేవో చెప్పకుం టున్నారు.

"నేను బాగా స్లీపింగ్ పిల్స్ వేసుకోవటం అలవాటు చేసుకున్నాను. నా మెదడు మొద్దుబారిపోయినట్లు ఉండేది."

"ఒక అర్ధరాత్రి హాస్పటల్ నుంచి ఫోన్ వచ్చింది. నేనే ఆ ఫోన్‌ని అందు కున్నాను. స్లీపింగ్ పిల్స్ కూడ నా మీద పనిచేయటం లేదు. అందరూ అలసి నిద్రపోయి ఉన్నారు."

"ఫోన్‌లో డాక్టరు చెప్పిన విషయం విని కెవ్వున కేక వేసి పడిపోయాను. నాకు తెలివి వచ్చి చూసేసరికి అన్ని అయిపోయాయి కనీసం ఆయన శవాన్ని కూడా నన్ను చూడనీయలేదు."

"ఇంత బ్రతుకు చాల అందంగా గడిపి ఇక ముందు ఈ అవిటి బ్రతుకు బ్రతకటం చాల దుర్భరమని- దానికంటే చావే నయం" అని- పాయిజన్ తీసు కుని ఆత్మహత్య చేసుకున్నారు ఆయన పోస్ట్‌మార్టంలో తేలింది పాయిజన్ తీసు కున్నట్లుగా-

"ఇంక తరువాత కథ మామూలే. నేను ఇలా ఏ అనుభూతులు లేకుండా మిగిలిపోయాను. నేను మామూలు మని షిగా అవటానికి చాలా సం.లు పట్టింది. కొడుకు మీద బెంగతో- ఆయన తల్లి తండ్రి కొడుకుని చేరుకున్నారు. నా మీద బెంగతో- నన్ను వదిలి మళ్ళీ రాలే నంత దూరంలోకి వెళ్ళిపోయారు నా తల్లీ తండ్రి."

"అటు ఆస్తి- ఇటు ఆస్తి నాకే దక్కింది. ఏం చేసుకోను ఆ డబ్బు- నాకు ఏ కోరికలు లేవు. అనుక్షణం ఆయన మాటలు, ముందు జీవితం గురించి ఎంతో ప్లాన్‌గా మాట్లాడి-

ఎన్నో ఆలోచనలు చేసేవారు. అవి అన్నీ ఏమయిపోయాయి."

"ఎప్పుడూ ఒక మాట అంటుండేవారు. వికలాంగుల కోసం- అన్ని హంగులు ఏర్పరచి- ఒక స్కూల్, హాస్టలు పెట్టాలని ఉంది అనే వారు ఆయనకు ఆ ఆలోచన ఎందుకు కలిగిందో నాకు తెలియదు. కాని ఆయన బ్రతుకు మాత్రం కొన్నాళ్ళు అవిటిగానే గడిచింది. వికలాంగుల స్కూల్ పెట్టకుండానే, బెడ్‌మీద అవిటిగా జీవించి, ఆ జీవితం దుర్భరమనిపించి ఆత్మహత్య చేసుకున్నారు."

"నేను సమస్తం అమ్మేసి- చాల పెద్ద స్కూల్, హాస్టలు కట్టించాను. వాళ్ళకి కావలసిన భోజన సదుపాయాలు, అన్ని వసతులు, ఆటవస్తువులు తయారుచేయటానికి కావలసిన సరంజామా, సబ్బులు తయారు చేయటం కవర్సు తయారుచేయటం, గ్రీటింగ్ కార్డ్సు తయారుచేయటం, కుట్టుమిషన్లు- సమస్తం ఏర్పాటు చేసాను. నేను మాత్రం ఒక గదిలో చాలా సాదా సీదాగా గడుపుతున్నాను."

"ఆ స్కూల్‌కి టీచర్లు-ఆయాలు చాల మంది వికలాంగులే- ఎవరి పనులు వాళ్ళు చేసుకునేటట్లు ట్రైనింగ్ ఇవ్వబడుతుంది. ఇన్ని విధాలుగా ఏర్పాట్లు చేసిన ఆ స్కూల్‌ని చూసి, ఎంతో మంది ఆశ్చర్యపోతున్నారు. ఈ విధంగా

## "తుమ్‌కిత్నిఖూబ్‌సూరత్‌హో"

నేను వ్యాపకం కల్పించుకుని- ఏ దిగులు లేనట్లుగా కనపడుతున్నాను" చెప్పింది అఖిల.

చాల బలవంతాన కన్నీళ్ళు బయటకురాకుండా- రెప్పల చాటున బిగపట్టింది. కనురెప్పలు తడితడిగా అయ్యాయి. నేల మీద చేతితో గీతలు గీయసాగింది. ఆమెని ఏ విధంగా ఓదార్చాలో తెలియలేదు. అఖిల చెపుతుండగానే రెయినా వంట పూర్తిచేసింది.

"అయాం సారీ అఖిలా" బాధగా అన్నాడు కర్ణ. కళ్ళెత్తి అతడి వంక చూసింది. కళ్ళల్లో-ఇన్నాళ్ళు- గుండెలో దాచుకున్న బాధ స్పష్టంగా కనిపించింది కర్ణకి.

"రండి భోజనం చేద్దురుగాని" చెప్పింది రెయినా. "అన్నీ ఇక్కడికే తెచ్చిపెట్టు అందరం కలిసి తిందాం" అన్నాడు కర్ణ. అఖిల హెల్ప్ చేద్దామని లేవబోతుంటే వారించి- పిల్లలు తను కలిసి అన్నీ తెచ్చి పెట్టారు. ప్లేట్లల్లో రేయినా వడ్డిస్తుండగా-

ప్రథమ్ టేప్ రికార్డు ఆన్ చేసాడు.

"తుమ్ కితిని ఖూబ్ సూరత్‌హో....." అది కర్ణ వాయిస్.

ఆ సమయంలో ఆ పాట వినాలనిపించలేదు. "ప్రథమ్ వేరే పాట పెట్టు" అంది అఖిల.

"ధూప్‌మే నికలా న కరో రూప్‌కిరాణీ

గోరా రంగ్ కాలా నా పడ్ జాయే....."

"ప్లీజ్ ఇలాంటి పాటలు వద్దు సరేలే ప్రథమ్ విషాదగీతలు రెండు పాడు అంది."

"అసలే విషాదమయిన సంఘటనలు చెప్పావు. ఇంకా విషాదగీతాలు ఎందుకు అఖిలా?" అన్నాడు కర్ణ.

"నాకు అవే వినాలనిపిస్తుంది" చెప్పింది.

"ఇంక నుంచి ఆ పద్ధతి మార్చుకో. బీహేపీ. అన్ని మరచిపోయి క్రొత్తగా జీవించు మీకో తోడుగా మేము ఉన్నాము" చెప్పాడు కర్ణ.

"ఇప్పుడు పాతగా జీవిస్తున్నానా?" నవ్వింది విషాదంగా.

"అలానే అనిపిస్తుంది. ఇప్పుడు గుర్తుకు వచ్చింది. ఇందాక మూవ్ అవుతున్న ట్రైన్ ఎందుకు ఎక్కలేకపోయావో. ఎందుకు భయపడ్డావో అర్థమయ్యింది" అన్నాడు.

"ఇంక ఆ సంగతి వదిలేయండి: మాస్కూల్ పెట్టి పది సం.లు ఎల్లుండికి పూర్తి అవుతాయి. ఆ రోజు సెలబ్రేట్ చేస్తున్నాం. ముందుగా- ప్రథమ్ పాడాలి. ఆ తరువాత మీరు" చెప్పింది.

"స్టేజి మీద పాడటం మానేసానుగా" అన్నాడు.

"పరవాలేదు. ఇది మా స్కూల్ గురించి- బయట ప్రోగ్రాం గురించికాదు" అంది.

"తప్పకుండా పాడతారు" చెప్పింది రెయినా- ఖాళీ ప్లేట్స్ లోపలికి తీసుకు వెళుతూ.

"ఖూబ్ సూరత్-"నెమ్మదిగా అన్నాడు కర్ణ.

"అందమైన రూపమేకాదు. అందమైన మనసు కూడ ఉంది" మెచ్చుకుంటూ అన్నాడు.

"ఘూమ్‌తీ చలీ హవా ఫిర్ భులా గయా... కోయీ .....

భుజితి భుజితి ఆగ్‌కో ఫిర్ జలా గయా.......కోయీ"

ప్రథమ్ పాడుతున్నాడు. కళ్ళు మూసుకుని వినసాగింది అఖిల. ○



# ఈ వారంలో మీ యోగం

## 26-10-1990 శుక్రవారం మొదలు
## 1-11-1990 గురువారం వరకు

**మేషం :** వివిధ రంగాలందు అభివృద్ధికై పాటుపడుటకు ఆస్కారం. పంపిణీదారులకు నిర్మాతలకు అపూర్వావకాశాలుంటాయి. పాత్రికేయులకు వారమంతా అపూర్వావకాశాలు. సభా గౌరవమున్నది. స్త్రీలకు : రచనా విధానాన సర్వానుకూలం, గ్రహించాలి.

**వృషభం :** కానివర్గమున్నది గదా! కార్యాచరణం. యిటీవల కుంటుపడిందిగా! రావలసిన పైకం అందలేదుగా! 'శని'వారాన్నుండి మీ ప్రయత్నాలు సానుకూలం కాగలవు. వృత్తియందు పెంపు చేకూరనున్నది. సజ్జన సాంగత్యమున్నది. అప్పులు తీర్చెడి శక్తి యుక్తులు ఏర్పడనున్నవి. స్త్రీలకు : రాదగిన పైకం అందుట గమనించండి.

**మిధునం :** ద్వితీయ రాశి స్థితి 'గురునకు' చెప్పరాని యోగం. ధనరీత్యా ఎలాంటి యిబ్బంది లేదు. కొందరు వాహనం సేకరించగలుగుతారు. . రాజకీయంగా మేలు చేకూరుట, ప్రతిష్ఠాకరమైన వ్యవహారాలందు జోక్యం కనిపించుట, గమనింపదగిన అంశాలు. స్త్రీలకు : చాలా కాలంగా వెనుకబడిన ఒకానొక వ్యవహారం సానుకూలం కావటం గమనించగలుగుతారు.

**కర్కాటకం :** ప్రసిద్ధుల స్నేహం లాభప్రదం. రచయితలకు, పత్రికాధిపతులకు, నూత్న వ్యాపారం చేయాలని, సంకల్పించు వారికి, సంతాన నిమిత్తం ఉద్యోగ యత్నం, అధికారుల ఆదరమున సాగించువారికి అనుకూలం. వారమంతా యోగదాయకమనుట శాస్త్ర విధి. స్త్రీలకు : శుభదాయక వారం. సభా గౌరవం, మరియాదవృద్ధికి ఆస్కారం. వృత్తియందు వికాసం.

**సింహం :** విశిష్ట వస్తువులు, మీ వ్యాపారానికి అనుగుణ్యమయిన వాటిని సేకరించుకోగలుగుతారు. బహుదూరాన్నుండి బంధువులో, పరిచితులో యింటికి రానున్నారు. శుభకార్య ప్రస్తావనలుంటాయి. స్త్రీలకు : యోగప్రదం, ఆదాయమందు పెంపు, అభిమానులవలన కళారంగాన మేలు

**కన్య :** ఏ వ్యవహారమయిన సుకరం. ప్రజారంగాన అనుకూలత చేకూరనున్నది. రాజకీయవాదులకు అనుకూలసమయం. ఆదాయం క్రమాభివృద్ధి నొందనున్నది. కొందరకు నూతనోద్యోగ ప్రాప్తి, చేసిన యత్నం సానుకూలం కావటంలో ఆక్షేపణలేదు. అభిప్రాయ భేదం లేకుండా మిత్రులతో సంచరించుట న్యాయం. స్త్రీలకు : ధనలోపం లేదు. వృత్తియందు పెంపు చేకూరనున్న వారం.

**తుల :** సత్యసంధుడనే పేరు తెచ్చుకున్నారుగా! కాపాడుకోండి. దగ్గరచేరిన వారి మాటలు విని యిబ్బందిలో చిక్కుకోకండి. అతిగా వ్యయం చేయటంగాని, అతిగా మాట్లాడటంగాని తగదు. ఈ వారం అసలు తగదు. స్త్రీలకు : ఉద్యోగవృత్తులందు జాగరూకత అవసరం.

**వృశ్చికం :** పదిమందిలో ప్రతిష్ఠ, కళా సాహితీరంగాన పదవకాశం, చిత్రరంగాన లాభదాయకం, మిత్రసమాగమం, రాజకీయాలందు సదవకాశం ఈ వారాంతాన లభ్యం కావటం గమనించగలుగుతారు. ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగా నడుచుకోకండి. స్త్రీలకు : వారమంతా అనుకూలమే, ధనాదాయమున్నది, వృత్తియందు పెంపు.

**ధనుస్సు :** నూతన మిత్రులు చేరుతారు. ప్రజారంగాన అనుకూలతయున్నది. సభా మర్యాద యున్నది. చిత్ర రంగాన ప్రతిష్ఠ ఏర్పడనున్నది. రాజకీయ రంగాన ప్రసిద్ధి ఏర్పడనున్నది. సభా గౌరవం ఏర్పడగలదు. చుట్టుప్రక్కలవారితో జాగ్రత్తగా సంచరించాలి. స్త్రీలకు . ఉద్యోగలాభం, గ్రహించండి.

**మకరం :** అభిమానులున్నారుగా! మీ చాకచక్యాన్ని మెచ్చుకొనేవారున్నారు. సహాయం చేయువారున్నారు. వ్యాపార రీత్యా ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా ముందుకు వెళ్లాలి పదిమందిలో ప్రతిష్ఠ ఏర్పడుతుంది! 'గురుని' ఆశీస్సులున్నాయి. ముద్రణా యంత్రాంగాన శ్రమించు వారికి అనుకూలం. వెనుకటి రోజులు రానున్నాయి. స్త్రీలకు : వృత్తి వికాసం ముఖ్యాంశం.

**కుంభం :** విలువగల వస్తువులు సేకరిస్తారు. వ్యాపారం సుకరంగా, లాభదాయకంగా, అనుకూలంగా సాగుతుంది. ఒకవేళ శుభకార్యానికి ఆస్కారం. ప్రజారంగాన, సాంఘికంగా మేలు చేకూరుట గమనింపదగిన అంశం. స్త్రీలకు : చాలా వారాలుగా అందని ప్రభుత్వ 'ఆర్డరు' అందనున్నది.

**మీనం :** ధనవసతి యున్నది. కొందరు వ్యవహారాలు చక్కబడనున్నారు. సభా మర్యాద యున్నది. రాజకీయంగా మేలు చేకూరమున్నది, యత్నించండి. సాధుసజ్జన సంపర్కం, వ్యాపారరీత్యా అనుకూలం, ఇష్ట బంధు సమాగమం, యిష్టాలు లాభప్రదంగా నెరవేరనున్నాయి. స్త్రీలకు : సభా గౌరవం, ఉద్యోగమందు పెంపు.

[illegible]

# 1952 లో విడుదలైన యం. కె. యం. వారి "మరదలు పెళ్లి"




(దర్శకుడు నిర్మాత : ముక్కామల, పాటలు-మాటలు : శ్రీ శ్రీ, సంగీతం : నాగయ్య, సూర్యకుమారి, నటీనటులు : ముక్కామల కృష్ణమూర్తి, కృష్ణకుమారి. తదితరులు.)

**సు**మారు 38 ఏళ్ల క్రితం విడుదలై ఎం. కె. ఎం. బ్యానరుమీద నటుడు, దర్శకుడు అయిన శ్రీ ముక్కామల కృష్ణ మూర్తి హీరోగా నటించిన సాంఘిక చిత్రం "మరదలు పెళ్లి".

జానపద చిత్రాలు వదిలి పల్లెటూరి గాథలతో నిండిన తెలుగు చిత్రలోకంలో "మరదలు పెళ్లి" చిత్రం ప్రత్యేకమైనది.

ప్రకాష్ (ముక్కామల) అనే ఒక పిచ్చి అసుపత్రి డాక్టరు - మరదలు గిరిజను (కృష్ణకుమారి) పిచ్చిగా ప్రేమించి ప్రేమ పథంలో తనకు అవరోధమని భావించిన తన భార్య లక్ష్మికి విషం పెట్టి చంపుతాడు. హత్యానేరం తెలివిగా గిరిజను ప్రేమిస్తున్న తన అసిస్టెంట్ డాక్టరుపై మోపి, అతనిని జైలుకు పంపుతాడు. కాని నిజంగా తానే హంతకుడని ప్రపంచానికి క్రమేణా తెలియవస్తుంది. ఒక హత్య మరొక హత్యకు దారితీస్తుంది. డాక్టర్ ప్రకాష్ రెండు - మూడు హత్యలుచేసి చివరకు "డిటెక్టివ్" చేతిలో చనిపోతాడు.

మరదలు గిరిజ - అసిస్టెంట్ డాక్టర్ పరిణయమాడ్తారు.

ఈ కథకు కొంతవరకు కర్దార్ గతంలో పృథ్వీరాజ్, మాధురి మున్నగు వారితో తీసిన "పాగల్" చిత్రం మాతృక.

ఈ హిందీ చిత్రాన్ని 'మరదలుపెళ్లి' దర్శకుడు, నిర్మాత శ్రీ కృష్ణమూర్తిగారు మక్కీకి మక్కీగా అనుకరించినా బాగుండేది. లేదా తీసుకున్న కథావస్తువుకు సమగ్రమైన పాత్రలు సమకూర్చినా బాగా ఉండేది. రెండూ చేయక, అసంపూర్ణమైన పాత్రలతో, అతుకుల సన్నివేశాలతో అసభ్య హాస్యంతో చిత్రాన్ని నింపారు. ముఖ్యపాత్ర అయిన అసిస్టెంట్ డాక్టర్‌కు ఎక్స్‌ట్రా వేషానికి ఇచ్చే విలువ ఇచ్చారు. శ్రీ శ్రీ, బెల్లంకొండ రామదాసుగారల సంభాషణలు పెక్కుచోట్ల ప్రశంసనీయంగా వున్నాయ్.

నాగయ్య - సూర్యకుమారి గారల సంగీతం విశిష్టంగా లేదు.

నటీనటులలో సూర్యకుమారి, శ్రీరామమూర్తి గారలు చిత్రం వారి స్థానం కొద్దిదైనా తమ పాత్రలలో లీనమై - సర్వోత్తమంగా నటించారు.

"మరదలు పెళ్లి" చిత్రంలో కొన్ని లోపాలున్నప్పటికీ - రెండు విషయాలు గమనార్హం, ప్రశంసనీయం కూడా. ఇందులో మొదటిది-కథలో క్రైమ్-డిటెక్టివ్ అంశాలు ఈ తెలుగు చిత్రంలో మొట్టమొదటి సారిగా ప్రవేశపెట్టడం! రెండవది-ట్రీట్‌మెంట్. గిరిజ ఆత్మహత్య చేసుకోవడానికి సముద్రానికి వెళ్లిన దృశ్యం. ఈ సన్నివేశంలో దర్శకుడు శ్రీ ముక్కామల కృష్ణమూర్తి ప్రథమ ప్రయత్నంలోనే హిందీ దర్శకులనే మించారంటే అతిశయోక్తి కాదు.

(డిస్ట్రిబ్యూటర్లు : ఆంధ్ర జనతా పిక్చర్స్-విజయవాడ, సీడెడ్ : శాంతి పిక్చర్స్-గుంతకల్, నైజాం : సుందర్ పిక్చర్స్ నర్యూ్యట్-సికింద్రాబాద్, మైసూరు : ఫిలిమ్ డీలక్స్-బెంగుళూరు, మద్రాసు సిటీ : చెంగల్పట్టు, ఉత్తర-దక్షిణ అర్కాట్లు : ఎ. ఎస్. పిళ్లై-మద్రాసు.)

## అలనాటి మేటి చిత్రాలు-2

- సేకరణ : ఛీశెట్టి

బామ్మ ఎంతగానో ప్రేమించే ఈ చిట్టి బంగారు పాప. వారి ఆనందం సదా నిలిచి ఉండేందుకు, హార్లిక్స్ యొక్క పోషక శక్తిని వారికి అందించండి. అందులో మీ కుటుంబం ఆరోగ్యంగా ఉండేందుకు కావలసిన పోషక పదార్థాలు పుష్కలంగా ఉన్నాయి.

మంచి ఆరోగ్యపు అనుభూతి. మంచి జీవితపు ఆనందం. హార్లిక్స్ సద్గుణాలలో పాలుపంచుకోండి.




మంచి పుష్టికరమైనది

# కుటుంబపు హృదయానందం

# అమర్‌నాథ్

తెలుగు చలన చిత్రరంగం ఎందరో రంగస్థల కళాకారులు వెలుగులోకి రావడానికి దోహదపడింది ఆయా కళాకారుల కృషి, పట్టుదల, సాధన ఫలితంగా కొందరు బాగా రాణించారు. దానికి అదృష్టం తోడైతే అందలం ఎక్కిన వారున్నారు ఈ (వి)చిత్రసీమలో ఎవరు ఎప్పుడు తళుక్‌మని మెరుస్తుంటారో, ఎవరు ఎప్పుడు తమస్సులో అదృశ్యమవుతారో జోశ్యం చెప్పడం కష్టసాధ్యం! అందుకే దీన్ని సినీ 'మాయా'లోకం అని అంటుంటారు వ్యంగ్య ధోరణిలో కొందరు.

తెలుగు చిత్రలోకంలో 1950–60 మధ్య దశాబ్దంలో అనేకమంది నటీ–నటులుగా ప్రవేశించారు కొందరు తారా చువ్వల్లా పైపైకి వెళ్లారు కొందరు అధోగతి పాలయ్యారు అదే కాలంలో చిత్ర ప్రవేశం సల్పి వెలుగు చూసిన వారిలో అమర్‌నాథ్ ఒకడు

"నా చెల్లెలు (53) అమర సందేశం (54) చిత్రాలు చూచిన నాటి సినీమా ప్రేక్షకులు అమర్‌నాథ్‌ని మరచిపోవడం కష్టం. ఇతని భవిష్యత్తుని ఈ చిత్రాలే నిర్ణయించాయి నటుడిగా స్థానం కలిగించాయి.

భరణి, నేషనల్ ఆర్ట్స్, భాస్కర్ ప్రొడక్షన్స్, గోకుల్, కృష్ణా పిక్చర్స్ వంటి నాటి పలుసంస్థల్లో ఇతనికి ప్రధాన పాత్రలు లభించాయి

అమర్ విశాఖపట్టణానికి చెందిన వాడు అతని పూర్తి పేరు మానాపురం సత్యనారాయణ పట్నాయక్ 1925 సం.లో జన్మించాడు. చిన్నప్పటి నుంచి నటన, సంగీతంపై ఆకర్షితుడై వాటిలో కృషి చేయసాగాడు

సంగీతంలో బాగా కృషి చేసి, "లలిత సంగీత కచేరీ"లు జరుపుతుండే వాడు. మధురమైన కంఠ స్వరంతో శ్రోతలను రంజింప జేస్తుండేవాడు.

నాటకాల్లో ప్రధాన పాత్రలు నటించి పెద్దల మెప్పులు సంపాదించుకున్నాడు.

హాస్యరసంతో కూడిన కొన్ని గీతాలు రచించి, గ్రామఫోన్ రికార్డులు ఇవ్వడం జరిగింది 1950 సం ప్రాంతాల్లో ఎం ఎస్. పట్నాయక్ అనే పేరుతో ఇచ్చిన రికార్డులకు మంచి గిరాకీ వుండేది .

ఇంటర్మీడియట్ చదువయ్యాక విశాఖ పట్నంలో ఆహార సంస్థలో గుమస్తాగా పని చేస్తూ, సినీమా అవకాశాల కోసం



ప్రయత్నిస్తుంటే, జి కె మంగరాజు, ఎం ఎస్ నాయక్ సహకరించి కొందరి నిర్మాతలకు ఇతన్ని సిఫార్సు చేయడం జరిగింది.

తత్ఫలితంగా అమ్మలక్కలు, నా చెల్లెలు చిత్రాల్లో నటించే అవకాశం కలిగింది ఇవి నిర్మాణం జరుగుతుండగానే కొందరు ఇతని నటనాశక్తిని గమనించి తమ చిత్రాల్లో నటించడానికి ఒప్పందం కుదుర్చుకోవడం జరిగింది.

నా చెల్లెలు (53)లో పెద్దన్న పాత్ర అమర్‌నాథ్ చక్కగా పోషించాడు. ప్రేక్షకులు, నిర్మాతలు ఎంతో మెచ్చుకున్నారు.

చండీరాణి (53) అమ్మలక్కలు (53) పిచ్చి పుల్లయ్య (53) ఇవన్నీ ఒకే సంవత్సరంలో విడుదలై వైవిధ్యమున్న పాత్రలతో నటుడిగా నిలద్రొక్కుకున్నాడు

ఆదుర్తి సుబ్బారావు తొలి దర్శకత్వంలో తీసిన 'అమర సందేశం'లో నాయకుడిగా నటించి యావదాంధ్ర ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొన్నాడు.

చక్రపాణి (54) ఆడబిడ్డ (55) చెడపకురా చెడేవు (55) వదినగారి గాజులు (55) కనకతార (56) చింతామణి (56) అక్కా–చెల్లెళ్ళు (57) వరుడు కావాలి (57) సతీసుకన్య (59) మగవారి మాయలు (60) మొదలగు చిత్రాల్లో నటించి కీర్తిగాంచాడు. ఆ తర్వాత ఇతనికి చిత్రాల్లో అవకాశాలు తగ్గిపోయాయి

'మగవారి మాయలు' ఇతను నిర్మించిన చిత్రం. ఈ చిత్రం అపజయం పాలయింది చిత్రాల్లో వేషాలు లేవు అమర్‌నాథ్ మరుగున పడిపోయాడు.

1973 సం.లో "అమరచంద్ర మూవీస్" అను చిత్ర నిర్మాణ సంస్థను స్థాపించి, "బాలయోగి" అనే చిత్రం ఆరంభించాడు అమర్‌నాథ్,విజయ నిర్మల నాయకీ నాయకులుగా కొంత తీయడం జరిగింది ఆర్థికంగా పుష్టి లేనందున ఆ చిత్రం పూర్తి చేయలేకపోయాడు.

తే 22–2–1980 దిన స్వర్గస్థుడయ్యాడు.

ఇతని కొడుకు రాజేష్, కూతురు శ్రీలక్ష్మి చిత్రసీమలో నటీనటులుగారాణిస్తున్నారు.

నా చెల్లెలు, అమరసందేశం, అక్కాచెల్లెళ్ళు చూచిన నాటి సినీ ప్రేక్షకులు అమర్‌నాథ్‌ని తలంచకుండా వుండలేరు. 7 ఏళ్ళు వెలిగి, తర్వాత చీకటిలో మ్రగ్గిపోయాడు. అదృష్టం వెంట దురదృష్టం అంటే ఇదే మరి!

–ఆరిపాక సూరిబాబు

## హీరో కృష్ణంరాజు అలవాటు!

హీరో కృష్ణంరాజు- ప్రతిరోజూ [illegible] గంటల నుంచి 7-30 గంటల [illegible]- షటిల్ ఆడతారు ఆ తర్వాత [illegible]

[illegible]



## రాఘవేంద్రరావు- రాఘవేంద్రరావే!

సాదారణంగా సభలూ- సత్కారాలు- పబ్లిసిటీ అంటే- ఆమడ దూరంలో వుండే ఏకైక దర్శకుడు దర్శకేంద్రుడు శ్రీ కె రాఘవేంద్రరావు ఒకవేళ తప్పనిసరి



పరిస్థితుల్లో ఎప్పుడైనా స్టేజి ఎక్కవలసి వస్తే- సభ జరుగు తున్నంతసేపూ కార్యక్రమాన్ని తిలకిస్తూ- ఆడియన్స్ రియాక్షన్స్ గమనిస్తూ- చిర్నవ్వుతో- దర్జాగా కూర్చుంటారే తప్ప- పెదవివిప్పరు. ఉపన్యాస మివ్వరు

## మాట్లాడని 'మాటల' రచయిత!

ఎన్నో విజయవంతమైన చిత్రాలకు కథ- మాటలందించిన రచయిత సత్యానంద్, తన కలం బలంచేత



అమోఘమైన మాటలు రాసి, నటీ నటులచేత పలికించి ప్రేక్షకుల చేత 'సెహభాష్' అన్పించు కుంటారే తప్ప- తనంతటతానై- ఏ స్టేజిమీద- ఒక్క పలుకు పలుకరు!

## నెం 1 రాజశ్రీ



ప్రఖ్యాత రచయిత రాజశ్రీ- పరభాషా చిత్రాలకు- 'డబ్బింగ్' రాయడంలో దిట్ట ఏ భాషా చిత్రాన్ని ముందుగా చూడరాయన! తెరమీద బొమ్మపడి- 'ఫ్రేమ్' పూర్తయ్యే లోగానే- అప్పటి కప్పుడు డైలాగ్ రాసి- కండక్టర్‌కి ఇచ్చేస్తాడు అంతే. ఏ క్లాస్ "స్ట్రయిట్" చిత్రంలా రూపొందుతుందా పరభాషా చిత్రం అందుకే యీనాడు డబ్బింగ్ రైటర్స్‌లో రాజశ్రీ నెంబర్‌వన్

సాధన

# సినిమా..సినిమా..

## "కృష్ణపర్వం"

"బ్రహ్మ, విష్ణు, త్రిమూర్తులకు మల్లే ధర్మం, నీతి, న్యాయాలను త్రిమూర్తులతో పోల్చవచ్చు. వీటికి ప్రతినిధులుగా పోలీస్ అధికారి (కృష్ణ), లాయర్ (రమేష్), విద్యార్థి (మహేష్) ఉంటారు. విద్యార్థి తండ్రిగా కృష్ణంరాజు ప్రత్యేక పాత్రలో, జర్నలిస్ట్‌గా నేను నటిస్తాం," అన్నారు పరుచూరి గోపాలకృష్ణ. పద్మాలయా క్రియేటివ్స్ పతాకంలో పద్మాలయా స్టూడియోస్ సమర్పించే "కృష్ణపర్వం" చిత్రంలో జయప్రద, కోట శ్రీనివాసరావు ఆదిగా గలవారు పాల్గొంటారు. కథ : భీశెట్టి, కథా సంవిధానం : శివశక్తి దత్త, మాటలు : పరుచూరి సోదరులు, గీతాలు : వేటూరి, సంగీతం : కీరవాణి, నిర్వహణ : జి. హనుమంతరావు, జి. ఆదిశేషగిరిరావు, నిర్మాతలు : పద్మావతి, మంజుల. నవంబర్ మొదటి వారంలో మొదలయ్యే షూటింగ్ జనవరిలో ముగుస్తుంది.

## "దాగుడుమూతలు"

అర్ధాంతులను అంతమొందించిన ఒక మందారం కథ. రాజేంద్రప్రసాద్ అసమాన నటనకు ప్రేక్షకుల ప్రశంసలు అందుకుంటారు," అన్నారు పోకూరి బాబూరావు. ఈయన సమర్పించే ఈతరం పిక్చర్స్ "ఎర్రమందారం" చిత్రంలో యమున నాయిక, దేవరాజు, పి. ఎల్. నారాయణ, నర్రా, సంజీవి, ఎస్. ఆర్. రాజు, ఎం. బి. కోటేశ్వరరావు, జయలలిత, శైలజ పాత్రధారులు. ఎం. వి. ఎస్. హరనాథరావు కథ, మాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, ఆర్. రామారావు ఛాయ, సోమనాథ్ శిల్పం, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, సాంబశివరావు సాహసాలు, గౌతంరాజు కూర్పుతో, ముత్యాల సుబ్బయ్య దర్శకుడు, పోకూరి వెంకటేశ్వరరావు నిర్మాత.

## "మాయ"

"కామెడీ, సస్పెన్స్ పుష్కలంగా ఉన్న చిత్రాన్ని విశాఖపట్నంలో ప్రారంభించాం," అన్నారు వడ్డే రమేష్. ఈయన నిర్మిస్తున్న విజయమాధవి వారి "మాయ" చిత్రంలో జగపతిబాబు, శాంతిప్రియ, సుధాకర్, శివాజీరాజా, కోట శ్రీనివాసరావు, డిస్కో శాంతి ఆదిగా గల వారు పాల్గొంటున్నారు. యడవల్లి మాటలు, మోహన్ ఛాయతో ప్రదీప్‌శక్తి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

-జి.వి.జి.



"కామెడీతో పాటు ప్రేమ, సెంటిమెంట్ సమపాళ్ళల్లో మేళవించిన చిత్రం." అన్నారు రేలంగి నరసింహారావు. ఆయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వం నిర్వహించిన శ్రీ విజయప్రసన్న ఫిలిమ్స్ "దాగుడు మూతల దాంపత్యం" చిత్రంలో ఎ. ఎన్. ఆర్– శారద, రాజేంద్రప్రసాద్– వాణీవిశ్వనాథ్, రమ్యకృష్ణ, వై. విజయ, నిర్మల, సత్యనారాయణ, గుమ్మడి ప్రభృత నటవర్గం. శ్రీనివాస చక్రవర్తి కథ, సత్యానంద్ మాటలు , వేటూరి పాటలు, కీరవాణి సంగీతం, శరత్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, తార నృత్యాలు, సత్యనారాయణరాజు ప్రొడక్షన్, నందం హరిశ్చంద్రరావు సంయుక్త దర్శకత్వం. కోటగిరి కూర్పుతో భోగవల్లి ప్రసాద్ నిర్మాత.

## డిసెంబర్‌లో "విక్రమందారం"

"మనకు స్వాతంత్ర్యం సిద్ధించి 35 ఏళ్ళు దాటినా, మనం ప్రజాస్వామ్య వ్యవస్థలో మనుగడ సాగిస్తున్నా– ఇంకా రాతియుగం నాటి రాచరికపు వ్యవస్థ కొనసాగుతూనే ఉందని అనడానికి ఆ 'దొరవారి పల్లె' సాక్షి. ఆ ఊళ్ళో దొరగారి అధికారానికి, అహంకారానికి అవధులు లేవు. అలాంటి దశలో మన రాజ్యాంగం ద్వారా సంక్రమించిన అర్హత మూలంగా అధికారం ఓ సామాన్యుడి వర్గమైతే– తన వర్గానికి ఆ గ్రామానికి ఏదో మేలు చేయాలన్న ఆ సగటు మనిషి పోరాటంలో ఎదురైన చేదు అనుభవాలను,



రాజా విక్రమార్కతో చిరంజీవి

సీరియల్

# భారత మహా కవిత్రయం

భాగవతుల సుబ్రహ్మణ్యం

*<u>ఇంతవరకూసాగిన కధ-1 :</u>* చాళుక్య ప్రభువు రాజరాజనరేంద్రుల కుల బ్రాహ్మణుడు నన్నయ భట్టారకుడు. ఒకనాడు భగవధ్యానంలో వున్న నన్నయకు షోడశ బీజ సందర్శనం జరుగుతుంది. మహామంత్రి వజ్జియ, నన్నయల సలహాపై రాజరాజనరేంద్రుడు విజయాదిత్యుడిపై యుద్ధానికి సన్నద్ధమవుతాడు.

(గత సంచిక తరువాయి)

రాజమహేంద్రి పుర పొలిమేరలలో, గోదావరీ తీరం వెంట కూత వేటు దూరం వ్యాపించిన ఒక నారికేళ వనంలో ఓ పసిడి వర్ణపు పల్యాంకిక విడిసింది. దాని వెనుకనే మరొక సాధారణ పల్లకీ వుంది కాని, అందులో అపూపాది తినుబండారాలు, వస్త్ర సంభారాలు, చందనపు చెక్కతో చేసిన నగిషీ వస్తువుల వంటి పలు చిరు కానుకలు వున్నాయి.

అస్తాద్రిలో కర్మసాక్షి కెంజాయతో అస్తమిస్తున్నాడు.

ఆ కాంతులు గౌతమీ పయఃపూరాలపై ప్రతిఫలించి కొబ్బరితోటకు వర్ణపటలాన్ని అద్దుతున్నాయి.

దినమంతా ఎర్రని ఎండలో ప్రయాణించి డస్సిన బోయీలు, పల్లకీలను దట్టమైన ఆ తోటలో దించి కాళ్ళు చేతులు కడుక్కోడానికి గోదావరి వైపు రాసాగారు వాళ్ళు ఎనమండుగురు వాళ్ళ వేషభాషాభూషణాలు ఇక్కడివి కావు

వెంటనే ప్రచ్ఛన్న వేషధారి అయిన చాళుక్య భటుడు వాళ్ళని అడ్డుకున్నాడు

అసలే ఒక వైపు భీకర యుద్ధం జరుగుతోంది కొప్పం ప్రాంతంలోనే మళ్ళీ యుద్ధం జరగడం- ఇది రెండోసారి

కొత్తవాళ్ళెవరు రాజ్యంలో ప్రవేశించినా ఎక్కడి కక్కడ భటులు నిలదీసి లక్ష ప్రశ్నలు వేస్తున్నారు

ఉన్న ఎనమండుగురు బోయీల్లోనూ నిడుపాటి బోయీ నుద్దేశించి, ప్రచండ కృపాణపాణి అయిన ఆ చాళుక్య భటుడు "ఓయీ! మీరెవరు?" అని అడిగాడు.

"మాది కర్ణాట రాజ్యం. అయినా మీకు మేము శత్రువులం కాము."

"వైరి రాజ్యం నుంచి వచ్చి మా రాజధానిలో ప్రవేశించిన మీరు శత్రువులుకాక మిత్రులెలా అవుతారు?" అని కొరకొరా చూసి కరసంకేతం విసిరాడు భటుడు.

లిప్తపాటులో పదిమంది భటులు వలయంలా వాళ్ళని చుట్టు ముట్టారు.

"ఆగండాగండి! వైరం ప్రభువుల మధ్యనే గాని ప్రజల మధ్య ఉండదుకదా!" అన్నాడు ఒక బోయీ

"అవన్నీ మా ఉన్నత న్యాయస్థానం విచారిస్తుంది. పర రాజ్య ప్రాణి ఈ పొలిమేరల్లో అడుగు పెడితే పట్టి బంధించే వరకే మాకు అనుమతి. పదండి!" తొందర చేశారు చాళుక్య భటులు

ఇంతలో వెనుకకు దువ్విన సిఖ, చందనపు పట్టుపై దిద్దిన తిలకం, కొనవంపు నాసిక, నిడుద నేత్రాలు కలిగినవాడు, కర్ణాభరణాలు, పట్టు పచ్చడాలు ధరించినవాడు గుండ్రని మోముపై చిరునవ్వు తొణికిస

లాడుతుండగా ఒక ధీర గంభీర మూర్తి వారి ఎదుట నిలిచాడు చూడగానే నమస్కరించాలని మనస్కరించే రూపంతో భాసిస్తున్న ఆ మహానుభావుణ్ణి చూసి అప్రయత్నంగానే భటులు తామున్న స్థితిని మర్చిపోయారు

ఆశ్చర్యంగా చూస్తున్న వాళ్లని ఉద్దేశించి "శ్రీశ్రీశ్రీ రాజమార్తాండ రాజరాజనరేంద్రులకుల బ్రాహ్మణ శ్రేష్ఠుడు నన్నయ భట్టారాఖ్యుని చిరకాల మిత్రుడను అనగానే "కన్నడ రాజ్య చక్రవర్తి త్రైలోక్య మల్లదేవుని ప్రదాని నారాయణ భట్టారకులు వారి పల్లకీ బోయీలం మేము అన్నాడొక బోయీ

భటులు వెంటనే వారిని వదిలి "మహాభాగా! మమ్మల్నిమన్నించండి కర్తవ్యవశాన అడ్డగించాము తప్ప కక్షతో కాదు విప్ర ప్రముఖులు, రాజన్య ప్రియులైన నన్నపార్యుల మిత్రులు మిమ్ము మొదట దర్శించిన భాగ్యము మాది అని నారాయణ భట్టుకు వినమ్రంగా నమస్కరించారు

వారిలో వారే ఒకర్ని ఉద్దేశించి "ఓయీ! శంభూ! నీవు ముందుగా వెళ్లి నన్నయ అయ్యవారికి వార్త వివరించి రా" అనుకుని, "స్వామి! మేమిక పోయి వస్తాం" అంటూ సెలవు తీసుకున్నారు తమ రాజ్యంలోనే కాక, పొరుగు రాజ్యంలో సైతం తమ ప్రదానుల వారికి ఎంతటి ఔన్నత్యం వుందో కళ్లారా చూసిన బోయీలు అబ్బుర పడుతూ, ఆ విషయమే చర్చించుకుంటూ నది వైపు దారితీశారు

కబురందిన తక్షణమె, నన్నయ ఉన్నవాడున్నట్టు బయలుదేరి పరుగున వడివడిగా నది తటానికి చేరుకున్నాడు



## భారత మహాకవిత్రయం

"నారాయణా! ఎన్నాళ్లయిందోయీ నిన్ను చూసి. అంతా కుశలమేనా? తనూభవ కుపమ ఎలా వుంది? కురు వృద్ధులు శంకనామాత్యులెలా వున్నారు? ప్రపితామహులు కంచెన సోమయాజుల నిత్యాగ్నిహోత్రం ఎలా సాగుతోంది?" అంటూ పేరు పేరునా పలకరించి, మిత్రుడ్ని కౌగలించుకున్నాడు నన్నయ. "ఇంత కాలానికి, రాక రాక వస్తున్న వాడివి, చిన్న కబురు ముందుగా తెలియజేయనైతివి" అని నిష్ఠూర మాడాడు.

అదొక అపూర్వ అపురూప మిత్ర సమాగమం....

"అన్నయ్యా! నన్నయా! ఎన్నాళ్లకెన్నాళ్లకురా! నాడు గురుకులంలో సహాధ్యాయిగా వున్నప్పుడెలా వున్నావో ఇప్పుడూ అలాగే వున్నావు. నీలో మార్పే లేదు సుమా!" కనుకొలకుల్లోంచి ఆనందబాష్పాలు జాలువారుతూండగా అన్నాడు నారాయణభట్టు.

* * *

చిరునవ్వుతో ప్రియ నెచ్చెలిని చూస్తూ అన్నాడు నన్నయ.

"ఎలా వుంటుందోయి? నిత్యానుష్టానాల్లో గాని, ఆహార విహారాల్లోగాని మార్పు రానంత కాలం ఏ జీవికీ మార్పు అంత త్వరగా కలగదు. పైగా నిత్యయోగాభ్యాసం మనం గురుకులంలో నేర్చుకున్నదే! అది కూడా కొంత తోడ్పడుతుంది కదా!"

"నేనన్నది భౌతికమైన మార్పు కాదన్నయ్యా! మానసిక సంబంధి. అప్యాయతానురాగాల్లో కూడా నీ..."

"సరి సరి! వాగతల కేమిలే గాని నారాయణా! పద!... పద!... ఇప్పటికే పొద్దు పోయింది..." తొందర చేశాడు నన్నయ.

ముఖ, కర, పాద ప్రక్షాళన చేసుకొచ్చిన పల్లకీ బోయీలను వెనుక రమ్మని సంజ్ఞ చేసి, చిరకాలంనాటి మైత్రీ బాంధవ్యం హృదయాన్ని పులకరమూగిస్తుంటే, ఈ నడిమి కాలపు విశేషాల్లో ఏది ముందో ఏది వెనకో అన్న ధ్యాస కూడా లేకుండా అప్పటికి మనస్సంచారంలోకి వచ్చిన విషయాల మీద మాట్లాడుకుంటూ నడుస్తున్నారు ఇర్వురూ.

"నన్నీ! మా వదిన మాణిక్యాంబ కుశలమా?" నారాయణభట్టు ప్రశ్నించాడు.

"ఓ! దానికేం- మాణిక్యంలా వుంది. అది సరేగాని, మన మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలాగిపోయి ఎన్నాళ్లయిందోయీ?"

"అదే!... నాకు బాగా గుర్తున్నంత వరకు మా అమ్మాయి కుపమ బారసాలకు రమ్మని నే రాసిన కమ్మకు 'రాజ్య కార్యాందోళనాంత రంగుడనై వున్నానని, రాలేనని' నీవు రాసిన ప్రత్యుత్తరమే తుది లేఖ అనుకుంటాను. దానికిప్పుడు పది వసంతాలు".

"అవునవును!.... గుర్తొస్తోంది!... విశేషించి అప్పటి పరిస్థితులు

రాయాలన్నా కూడా జంకు గొంకులుత్పన్నమయ్యే రోజులవి. నీడని సైతం అనుమానించే పరిస్థితు లానాటివి".

"అంత ఉపద్రవాలేమిటోయి?"

"కర్ణాట రాజ్య ప్రధానోద్యోగివైన నీకు తెలీకనా? నా చేత చెప్పించాలని కాదూ?..."

"నిజం నన్నీ! పంచ ప్రధానుల్లోనూ ముఖ్యులు ముగ్గురే! యువ ప్రభువులు సరేసరి! వారికి తండ్రిగారి వల్ల విషయం ఎలాగూ తెలుస్తుందనుకో! మహామాత్య, సైన్యాదీశ, దుర్గదళాధ్యక్షులకు మాత్రమే పరరాజ్య విశేషాలు అధికంగా తెలిసేది. మంత్రాంగంలో పాల్గొని విలువైన సలహాలు చెప్పడానికి మాత్రం అర్హత కలిగించినందు వల్ల, వరుసలో ఆఖరి ప్రధానినైన నాకు అన్ని విషయాలు తెలియవలసిన అవసరం లేదు. అది కర్ణాట రాజ్యాచారం".

"కాని మా చాళుక్యాచారం ప్రకారం కుల బ్రాహ్మణ పదవికెంతో విలువుందోయి!ఇక్కడ ప్రభు శయ్యా గృహంలోకి సైతం సమయా సమయ విచక్షణ అయినా లేకుండా ప్రవేశించగల సర్వాధికారాలతో పాటు, రాజ్య-పరరాజ్య విశేషాదులు కూడా కుల బ్రాహ్మణునికి తెలిసి తీరాలి. పంచ ప్రధానులలో అగ్రపూజ్యత కుల బ్రాహ్మణునిదే!

"ఆ విషయం నేనెరుగుదును. అది చాళుక్య ప్రభువుల ఉదారబుద్ధి. అదృష్టవంతుడవు. మత్ప్రభు నింద కూడదు గాని సారస్వత, కవితా శ్రేష్ఠులకూ అంత ఆదరణ లేని పరిస్థితులు దాపురించిన వక్కడ. త్రైలోక్యమల్ల సోమేశ్వర ప్రభువుల వారికి సామ్రాజ్య కాంక్ష, విజిగీష హెచ్చు కదా! ఇక కవితా గోష్ఠులకు చోటెక్కడ? కవితా సారాన్ని ఆస్వాదించేటత సమయమే వుంటే వజ్రసారమనే తన కత్తిని సాన్బట్టడానికి ఆ తీరికను వెచ్చించాలనుకొనే రోజులొచ్చేశాయి".

"అయితే కావ్య పరిశ్రమ ఏమీ చేయలేక పోయావన్న మాట".

"కావ్యోపరి పరిశ్రమ కూడా లేదు. ఈ మధ్య కాలంలో నువ్వేమైనా రచించావా నన్నీ?"

"ఆ!... దాక్షారామ భీమేశ్వరుని కృప చేత, రాజరాజనరేంద్ర ప్రభువు ఆదరణ చేత కొంచెం సారస్వత సేవ సాగింది. రాఘవాభ్యుదయం, ఇంద్ర విజయం అయ్యాయి. శ్రీమాత రాజరాజేశ్వరీ అనుగ్రహంతో చౌడేశ్వరీ విలాసం కూడా ఇటీవలే పూర్తయింది. వాటికి పరిష్కర్తగా వ్యవహరించి నీ ఆమోద ముద్ర వేయించుకోవాలన్న కుతూహలం కూడా నాకుంది".

"ధన్యుణ్ణి నన్నీ! ఈ విషయంలో నూ నీవదృష్టవంతుడవే!"

"అలా అంటున్నావేమిటోయి సరస్వతీ కర్ణావతంసా?"

"చెప్పాను కదా! సారస్వత లతికకు పందిరి లేదని".

ఇంతలో ఇద్దరూ నన్నయభట్టారకుల దివ్య సౌధాన్ని సమీపించారు.

చందనంతో కలయంపి జల్లి, కాశ్మీర రజంతో ముగ్గులు తీర్చి, పుష్ప రజనుతో రంగవల్లికలు అద్ది, తామరపూల తోరణం కట్టిన మంగళప్రదమైన ఆ గృహసీమ సౌభాగ్యాన్ని పరికిస్తున్న నారాయణభట్టుతో "ఇదే మద్గృహ వాటిక" అన్నాడు నన్నయ.

ఇద్దరూ పంచపాళి లోనికి అడుగు పెట్టారు.

సీతా మహాసాధ్విని బోలిన ఉత్తమ ఇల్లాలు మాణిక్యాంబకు నమస్కరించాడు నారాయణభట్టు. మరిది సమానుడైన, లక్ష్మణస్వామి వంటి నారాయణభట్టును ఆప్యాయంగా కుశలమడిగి, తలపూరములిచ్చి తదుపరి బంధూపచారాలకు లోనికేగింది మాణిక్యాంబ.

బాల్య మిత్రుడు, అప్పుడు, ఇష్ట సఖుడు అయిన నారాయణభట్టు రాకతో తనని తాను మరచిపోయాడు నన్నయ ఆ ఆనందంలో నాటి సాయంకృత్యాలన్నీ ఇంచుక ఆలస్యంగా పూర్తి అయ్యాయి.

తన ఆనందాన్ని మిత్రునితో పలు రకాలుగా పంచుకొనే ప్రయత్నంలో తల మునకలవుతున్నాడు.

కాని నారాయణభట్టు అందోళిత మనస్కుడై వున్నాడు..

సమాగమానంతరం కొంతవరకు నన్నయ సాన్నిధ్యంలో సేద తీరినా, రాచకార్య వ్యగ్రుడై వచ్చిన అతని హృదయం కల్లోల తరంగితమైన మహార్ణవంలా వుంది. ..

తన ప్రతిపాదనకు ప్రియ

## రజని కడుపు పంట

మన రాష్ట్ర రాజధానిలోని నెహ్రూ జంతు ప్రదర్శనశాలలో 'రజని' అనే ఒక ఏనుగు మగపిల్లకు జన్మ నిచ్చింది. ఏనుగు ప్రసవించటం అనేది వింతగాక పోవచ్చు కాని ఈ ప్రదర్శనశాల 26 ఏళ్ళ చరిత్రలో ఒక ఏనుగు తల్లి కావడం అనేది యిదే ప్రథమమట. 'రజని'ని జూలైలో కేరళ నుంచి తీసుకు వచ్చారు. ఆ పిల్ల ఏనుగు బరువు 40 కిలోలు కాగా ఎత్తు 3 అడుగులు. తల్లీ బిడ్డ క్షేమంగా వున్నాయి.

మిత్రుడిచ్చుగించునో లేదో?!..

ఊహ పరి పరి విధాల పోతోంది.

మనస్సే కదా పెద్ద సంగ్రామక్షేత్రం

## 5

విశాలమైన బీడు భూమిలో విడిసిన సేనలు మూడో రోజు పోరుకు సమాయత్తమవుతున్నాయి.

యుద్ధ శిబిరాలలో ఇరు పక్షాలా కలకలం తారాస్థాయినందుకుంది

కొప్పం రణక్షేత్రం అప్పటికే దారుణమైన రుధిరార్ణవాన్ని మరపింపజేస్తోంది

ఉదయార్కుడు ప్రాగ్దిశను చెల రేగుతుండగా ఆరు ఫిరంగులు పేలాయి. అది సమర సూచిక

తృతీయ దివస సంగరం సమధికోత్సాహంతో ప్రారంభమైంది

పూర్వం నుంచీ గజ బలానికి ప్రఖ్యాతి గాంచిన చాళుక్య మహా సేనలు, తమ మత్త గజాలతో కర్ణాట సేనలపైకి చొచ్చుకొచ్చాయి.

భిల్లులను, కొండజాతులను దండిగా చేరదీసి విలువిద్యలో సుశిక్షితులను చేసిన కళింగ సేనలు, వడగళ్లలా బాణాలు కురిపించడంతో పెనుభూజాలు తుపానుకు కూలిపోయినట్టు మద గజాలు నేల కొరిగిపోసాగాయి. మావటీల మాట వినక కొన్ని చెల్లాచెదురయ్యాయి.

ఒక వైపు ఆలీఢ పాద విన్యాసాలతో, కళింగ సేనలో బాణధారులు మిడతల దండులా దూసుకొస్తున్నారు. బాణ ఘాతాల తాకిడికి కాల్బలం కూడా నిలవలేక పోతోంది. శిరస్సుల పైనా, భుజాలకు, ఊరువులకు తగిలిన బాణాలకు సైనికులు లెక్కకు మిక్కిలిగా మరణిస్తున్నారు.

మరో వైపున కర్ణాటాశ్వికులు వీపున వున్న డాలులు మెరుపు వేగంతో ముందుకు తెచ్చుకుని ఆత్మరక్షణ చేసుకుంటూ చిత్రాతి చిత్రమైన ఆయుధాలతో చాళుక్య తురుంగ యోధులను కంపింపజేస్తున్నారు. వాజిసేన రాజీ పడని పోరు సల్పుతోంది అయినా ఇరు వైపులా గుర్రాల పైనుంచి



### అశ్వినీ నాచప్ప చిత్రరంగ ప్రవేశం

క్రీడాకారులు కూడా చిత్రరంగ ప్రవేశం చేస్తున్నారు. దేవానంద్ టెన్నిస్ క్రీడాకారులపై తీస్తున్న చిత్రంలో విజయ్ అమృతరాజ్ నటిస్తున్నాడు. అదేవిధంగా క్రీడారంగాన్ని యితివృత్తంగా తీసుకొని ఒక కుటుంబ కథాచిత్రాన్ని నిర్మిస్తున్నారు. వాస్తవిక గాథను ఆధారం చేసుకొని తీస్తున్న చిత్రంలో కథానాయికగా ప్రముఖ క్రీడాకారిణి అశ్వినీ నాచప్ప నటిస్తోందట. ఈ చిత్రంలో అశ్విని కోచ్‌గా భానుచందర్ నటిస్తున్నాడు

కూలిపోతున్న వాళ్లు పెక్కుమంది

ఒరలోంచి వజ్రపు పిడులున్న కత్తులు విద్యుద్వేగంతో తీస్తూ, రెప్పపాటులో పది కుత్తుకల్ని ఒక్కరే ఉత్తరిస్తున్నారు కర్ణాట పదాతిదళం నేతలు.

చాళుక్య రాజ రాజుకు సహాయం చేయడానికి వచ్చిన చోళ సైనికులు కూడా కదనరంగంలో విజృంభిస్తూనే వున్నారు. మల్లయుద్ధ ప్రవీణులైన చోళ సైనికులు తృటిలో శత్రుసేన ఆయుధాలు పడగొట్టి ముష్టి యుద్ధానికి తలపడుతున్నారు. పట్టు సడలి లేచి నుంకించడానికి ప్రయత్నిస్తున్న వారిని చిత్రగతుల మల్ల బంధనాలతో కదలనీకుండా చావు దెబ్బ తీస్తున్నారు అప్పటికీ తప్పించుకున్న వాళ్లని, ఔడుగరిచి 'ఆగు! ఆగు!' మంటూ వెంటబడి తరుముతున్నారు

జయజయ ధ్వానాలొక పక్క, హాహాకారాలొక పక్క మిన్నంటుతున్నాయి ఈ పరిస్థితి కొంతసేపు అటు దిటు మారుతోంది

అరుణబింబం అస్తాద్రితో గ్రుంకే సరికి చోళ చాళుక్య సేనల్లో అధిక భాగం 'వీరగతి'ని పొందింది. ముఖ్యంగా గజ, కాల్బలాలు విపరీతంగా నష్టపోయింది వేగి

పర్జన్యఘోషతో సమానమైన ధ్వని బయల్వెడలే పెను యుద్ధ ఘంటికను ఆరుగురు మల్లయోధులు మోగించడంతో మూడో రోజు యుద్ధం పరిసమాప్తమైంది. డస్సిన సైన్యం తమ తమ గుడారాలకు దారి తీసింది

అది చోళ సామ్రాట్టు రాజాధిరాజు యుద్ధ శిబిరం . అప్పుడే లోనికి వచ్చిన అతడి తమ్ముడు రాజేంద్రదేవుడు అన్నకు ప్రణమిల్లి, బావగారైన చాళుక్య ప్రభుని లేఖ అందజేశాడు

అన్నదమ్ముల మధ్య పెద్ద వయోభేదం లేదు అప్పటికి రాజాధిరాజుకు ముప్పయ్యారు వసంతాలు. చిదిమితే పాల్గారే ఒకే ఒక్క ముద్దుల పట్టి– 'మధురాంతకీ దేవి'కి జన్మనిచ్చి, ప్రసూతి జ్వరంతో తన దేవేరి మరణించిన దగ్గర్నుంచీ అతడన్య మనస్కుడై కొంతకాలం తండ్రి గంగైకొండ చోళుడికి పరిపాలనా వ్యవహారాల్లో బాసటగా నిలవలేక పోయాడు మళ్లీ పెళ్లికి అంగీకరించనూ లేదు ఈ సమయంలో చిన్నవాడైనా తన బుద్ధి కుశలతతో రాజేంద్ర దేవచోళుడు తండ్రి పరిపాలనా దక్షతను ఇనుమడింప జెయ్యడానికి నడుం కట్టాడు. చొరవతో స్వయంగా కొన్ని పాలనా వ్యవహారాలతో ప్రత్యక్ష సంబంధం ఏర్పరచుకున్నాడు

దేవేరి గతించిన మూడున్నరేళ్లకు పితృ మరణానంతరం రాజాధిరాజు సింహాసనాధీశుడయ్యాడు అనుంగు సోదరుని అప్రతిమాన ధీ ధైర్య ప్రతిభా విశేషాది అండదండలతో రాజ్య పాలన చేస్తున్నాడు చోళ చక్రవర్తి రాజాధిరాజు.

తమ ప్రియ సోదరి అమ్మంగీ దేవి నిజభర్త, తరతరాలుగా తమకు బంధువులు పరమాప్తులు అయిన చాళుక్య ప్రభువులకు యుద్ధ సహాయం

# భారత మహాకవిత్రయం

కావాలని వచ్చిన లేఖ చూడగానే హుటాహుటిన తరలి వచ్చాడు.

'జయ సింఘుకాలుడ'న్న బిరుధుతో ప్రఖ్యాతి వహించిన, అవక్ర పరాక్రమోపేతుడయిన చమూపతి సోరియ వరసన్'కు రాజధాని కాంచీ దుర్గ రక్షణ బాధ్యత నిర్వహించమని, ప్రభు భక్తిపరాయణులు మహామాత్యులు అయిన జయందమ్మికి పరిపాలనా భారాన్ని అప్పగించి, చాళుక్య శత్రు వినాశనానికి విస్తార ధనబలగాలను తరలించుకు వచ్చాడు రాజాధి రాజు. లక్ష్మణస్వామిలా అనుక్షణం వెన్నంటి ఉండడానికి రాజేంద్ర దేవుడు కూడా తోడుగా వచ్చాడు.

శ్యాలకు లిద్దరినీ కోటలో వుంచి, తానే యుద్ధరంగానికి పయనం కాబోతూన్న రాజ రాజనరేంద్రుని శాంతపరచి, పరిపరి విధాల నచ్చజెప్పి బావగారిని అడుగు కదలనీయక తామే ఆహవ రంగంలోకి ముందంజ వేశారు. రాజాధిరాజ రాజేంద్ర దేవులు.

వ్యూహం ప్రకారం రాజాధిరాజు సర్వసైన్యాలతో నూ యుద్ధావనిలో వుండేట్టుగాను, రాజేంద్రదేవుడు ఇటు రణరంగానికీ- అటు రాజధానికీ మధ్య అతిముఖ్యమైన నమ్మకమైనవర్తమానాలు నిర్ణయాలు . చేరవేసే బృహత్తర బాధ్యత తీసుకొనేట్టుగాను నిర్ణయం జరిగింది.

అందులో భాగంగానే, ఇప్పుడీ లేఖ....

అది రాయించిన రాజరాజ నరేంద్రుని వద్ద నుండి తెచ్చిన రాజేంద్రదేవుడు "సోదరా! ఇది చదివిన తక్షణం. అనవాళ్లైనా దొరక్కుండా కాల్చి మసి చేయమని బావగారి ఆనతి. పరిస్థితులు ఎటుతిరిగి ఎటు వచ్చినా శత్రు సైనికుల కాలేఖ చేతికి చిక్కరాదు.." అని చెప్పి కూర్చున్నాడు.

విషయమంతా చదవగానే, రాజాధిరాజు భృకుటిముడి పడింది. అతని నయనాలు రోషభీషణో దగ్రారుణిమ దాల్చాయి.

ఇది అసలు రాజరాజ నరేంద్రుల వారు రాయించినదేనా? అన్న శంక క్షణకాలం ఆవహించింది.

చాళుక్య రాజ్య చిహ్నమైన వరాహ ముద్రిక లేఖోపరిభాగాన స్పష్టంగా కన్పిస్తూంటే ఇంకా అనుమానం ఎందుకు?... కాని- ఇదేమిటీ విచిత్ర ధోరణి?....

బావగారా లేఖను వినాశన మొనర్చాలని, వేరే ఉద్దేశ్యంతో కోపినాం పుచ్చుతావిత సర్పంలా బుసలు కొడుతూ ఆగ్రహం చేత దాన్ని కాడ లేని కాగడా పైకి విసరేశాడు రాజాధి రాజు.

శిబిరాంతర్భాగంలో వెలుగులు వెదజల్లే పాత్రికా దీపశిఖ కెర అయిని ఆ చామరీ మృగ చర్మపుకమ్మ నుండి ఒక వింత వాసన బయల్వెడలి గుడారం అంతా కమ్ముకుంది.

(ఇంకా వుంది)

# బాలాసుందరి

## అవధానుల సుధాకరరావు

'పోస్ట్'లో శుభలేఖ అందింది– శ్రీధర్ దగ్గర్నుంచి. వివరాలు ముందే తెలుసు కాబట్టి, 'క్యాజువల్'గా కవరు తెరిచి, 'కార్డ్'ని పరికించి చూస్తూనే ఉలిక్కిపడ్డాను. దిగ్భ్రమ... 'షాక్'తో అచేతనుణ్నయాను. నా ఊహ తారుమారు కావడంతో– బుర్ర గిర్రున తిరిగినట్లని పించింది.

వధువు స్థానంలో...!? ఎవరి శ్యామల?

నన్ను నేను 'నిలువరించుకోలేక – ఎన్నో సందేహాలు వేధించుకుతింటుంటే– వెంటనే వాడి దగ్గరకు ప్రయాణం కట్టాను. దారిలో నా మనసు గతాన్ని నెమరేసుకుంది ఓ మాటు...

★ ★ ★ ★ ★

బాలాత్రిపురసుందరి పేరుకి తగ్గట్లే మనిషి కాస్త పొడగరి ఆకాశంలో తారలెన్ని ఉంటేనేం– అందాల జాబిల్లి అసలు ఒక్కటే అని ఎనీకవిగారు శలవిచ్చినట్లు– ఆడవాళ్ళందరిలో కి ప్రత్యేకంగా, విలక్షణ సౌందర్యంతో, అమిత ఆకర్షణీయంగా ఉంటుందామె

నేను, తను సర్వీస్ కమీషన్ కేండిడేట్లం ఆఫీసు పని కొత్త కాబట్టి, రెణ్నెళ్ళు ట్రైనింగుకి పంపించారు మా ఇద్దర్ని నిన్నగాక మొన్న డిగ్రీ పూర్తి చేశాం కదా– ఇంకా ఆ ఫ్రెష్‌నెస్, ఉత్సాహం అలాగే ఉన్నాయి మాలో

జస్ట్ ఓ ఆర్నెల్ల ముందు అదే ఆఫీసులో 'ట్రెసర్'గా అపాయింటయిన శ్రీదర్ నాకు బాగా సన్నిహితుడయాడు నన్ను కలుసు కోవడం కోసం ట్రైనింగ్ సెంటర్'కి రాకపోకలు సాగించేవాడు అలా.. నా ద్వారా వాళ్ళిద్దరూ ఒకరికొకరు పరిచయ మయ్యారు

ఓ రోజు సాయంత్రం 'గార్డెన్'లో నాతో పిచ్చాపాటీగా మాట్లాడుతూ, హఠాత్తుగా– "బాల మీద నీ అభిప్రాయం?" అనడిగేడు, సూటిగా

నేను ఆశ్చర్యపోతూనే, "మంచిది తెలివైనది అనవసర విషయాల్లో తల దూర్చేరకం కాదు నా కెందుకోగాని ఆమె పట్ల– ఓ విధమైన 'అఫెక్షన్', సిస్టర్ ఫీలింగు కలుగుతోంది " అని నా మనసులోని మాట చెప్పాను

"థాంక్యూ బావా! థాంక్యూ వెరిమచ్ " నా చెయ్యిని జోరుగా ఊపుతూ, యమ ఉక్కిరి బిక్కిరవుతూ, పిచ్చి సంతోషాన్ని ప్రదర్శించేడు నాకు విషయం అర్థమయింది ఇద్దరి జంట చాలా చక్కగా ఉంటుంది. ఒకరి కొకరు సరైన జోడి ఆ తరువాత నేను పెద్దగా ప్రయాస పడనక్కర్లేకుండానే వా రిద్దరి మధ్యనా ప్రేమ అంకురించి, పుష్పించి, ఫలించింది.

తరచు సినిమాలకి, షికార్లకి తిరిగేవాళ్ళు స్వేచ్ఛగా మావాడి 'హూం'కి పచ్చి, గంటలు, గంటలు గడిపి పోతుంది బాల నా కింటులో **అనౌచిత్యం,**- అభ్యంతరకరము ఏమీ కన్పించలేదు ఎందుకంటే– మా శ్రీధర్ మామూలు మగవాడు కాడు పెళ్ళయేదాకా బాలతో కేవలం స్నేహబంధాన్ని మాత్రమే పెంచుకుంటూ– తమ ప్రేమని పవిత్రంగా, పదిలంగా కాపాడుకోవాలను ఉన్నతాశయం కలవాడు

**అతనికి పెళ్ళి కెదిగిన ఓ చెల్లెలుంది** మా వాడికొచ్చే కట్నం డబ్బుతో ఆ అమ్మాయి పెళ్ళి చేద్దామని తం... ఆలోచన.

" ఇంకో ఏడాదిలోగా ఎలాగో విధంగ మా చెల్లాయి పెళ్ళి జరిపించేసి, ఆ తరువాత బాలని నే... వేసుకుంటాను ." అని నాతో చెప్పాడొకసారి

ఈ నేపథ్యంలోనే, నా కోరిక మీదట నను మా సొంత ఊరికి బదిలీ చేశారు

ఆ ప్రేమికు లిద్దరూ స్టేషన్‌కొచ్చి నాకు వీడ్కోలు పలికేరు శ్రీధర్‌కి, నాకు మధ్య ఉత్తరాల వారధి ఏర్పడింది అక్కడి విషయాలన్నీ పూసగుచ్చినట్లు నాకు తెలియ చేసేవాడు అప్పుడప్పుడూ బాల కూడా అదే ఉత్తరంలో నాలుగు ముక్కలు రాసేది నాకు

అనుకున్న ప్రకారమే శ్రీధర్ స్వశక్తితో - ఓ సలక్షణమైన సంబంధం చూసి, చెల్లెలి పెండ్లి జరిపించేశాడు

ఆ తరువాత ఈ మధ్యనే మా ఇంట్లో జరిగిన ఓ 'శుభకార్యానికి' శ్రీధర్ హాజరయ్యాడు ఆ సందర్భంలో మేం ఎడతెగని ముచ్చట్లు చెప్పుకున్నాం కరువుదీరా కబుర్లాడుకున్నాం

"పెళ్ళి సంగతేం చేశావు ?"

"త్వరలోనే " అంటూ నా ప్రశ్నకి హుషారుగా జవాబిచ్చాడు

" మరి, మీ పెద్దవాళ్ళు..?" సందిగ్ధంగా అన్నాను

**"అందుకే– రిజిస్టర్ మ్యారేజ్..."** చెప్పాడు **ఆ ఆహ్వానం కోసం నేను** ఎదురు చూస్తున్న **తరుణంలో**– పిడుగుపాటులావచ్చిన **ఈ శుభలేఖ**– నాకు బోల్డంత ఆశాభంగం కలిగించింది. కోపం కూడా వచ్చింది ప్రేమించానని– బాలతో బంధాన్ని పెంచుకుని, ఇప్పుడు మరెవర్నో పెళ్ళాడుతూ, ఆమె బ్రతుకు బండలు చేసే అధికారం ఎవరిచ్చారు వాడికి ? పైగా, వాడికి ఆమెని

పరిచయం చేసింది నేనే కాబట్టి- ఈ పాపం నాకు చుట్టుకుంటుంది.

ప్రపంచమంతా ఏకమై, ఎదురునిలిచి ప్రతిఘటించినాసరే- మా ప్రేమ ఫలించి, 'పెళ్ళి'గా మారితీరుతుంది అని ఘంటాపదంగా చెప్పిన మహానుభావుడు- ఇప్పుడిలా ప్లేటు ఫిరాయించాడంటే- నా కింకా అపనమ్మకంగా ఉంది ఏం జరిగిందో తెలుసుకోవాలని మహా ఆరాటంగా ఉంది

* * * *

" ఊహించేను కాని, ఇలా తిరుగు టపాలో వచ్చేస్తావనుకోలేదు బాసూ!"

ఎక్కడో ఓ చోట- మీ ఫ్రెండ్ యాజ్ వెల్ ఈజ్ నా మాజీ ప్రేయసి మిస్ బాలా త్రిపురసుందరి నీకు తప్పకుండా తారసపడుతుంది ఆమె గానీ తిరిగి చిక్కితే- నీక్కావలసిన సమాచారం అడుగు అఫ్‌కోర్స్ ఆ అవసరం ఉంటదనుకుంటాను " అంటూ తన 'రాజ్‌మాత్' మీద నన్ను అభిష్కించి చేశాడు ఏమిటో . అంతా గందరగోళంగా ఉంది శ్రీధర్ అని తూచి మాట్లాట్టం చూస్తే- తొందరపడి అతనిమీద అభియోగాలు మోపా




నవ్వుతూ నన్ను రిసీవ్ చేసుకున్నాడు శ్రీధర్

అప్పుడే పెళ్ళి కళ వచ్చేసింది బాలతో ప్రేమ శ్యామలతో పెళ్ళి మరి సంసారానికి మరో అమలో, విమలనో సిద్ధం చేసుకునే ఉంటావు అవునా ?" నా వ్యంగ్య వాగ్బాణానికి- శ్రీధర్ ముఖం ఎరుపెక్కింది

"చాలా దారుణంగా మాట్లాడుతున్నావు బోస్! ఈ అంశం మీద నేనేమి చెప్పదల్చుకోలేదు నువ్వో పని చెయి ఈ జంటనగరాల్లో ఉన్న కొన్ని సైట్ సీయింగ్ ప్లేసెస్'కి ఓ రౌండ్ కొట్టిరా

కనిపించింది. సంగతేవిటో ముందు తెలుసు కుందామని, 'బైక్'ని ముందు కురికించాను.

నే నాట్టే శ్రమపడాల్సిన అవసరం లేకుండానే, బాల 'ట్యాంక్ బండ్' మీద కన్పించింది.

ఆడవాళ్ళకి మనసనేది ఉంటదా..?ప్రేమించిన వ్యక్తిని ఇంత సులభంగా మరిచిపోయి, ఆ స్థానాన్ని మరో వ్యక్తికి కేటాయించడం- వాళ్ళకి బొమ్మలాటతో సమానం కాబోలు.

ఇంతకీ, ఆమె సరసన చోటు సంపాదించుకున్న ఆ వ్యక్తి మరెవరో కాదు. అదే ఆఫీసులో 'జూనియర్ ఇంజనీర్'గా పనిచేస్తున్న తాజుద్దీన్ అనే యువకుడు. శ్రీమంతుల బిడ్డడు. కేవలం అచ్చెల రూపంలోనే నెలకి పదివేల రూపాయలు ఇతగాడి 'పాకెట్ మనీ' క్రింద- బ్యాంక్ అకౌంట్‌లో క్రెడిట్ అవుతూ ఉంటాయి. బంగారు పిచ్చుకలాంటి వాడు.

అసలు- బాలకీ, మా వాడికీ ఎలా చెడింది? అంత త్వరగానూ బాల- మా వాడిని మరచి, మనసులోంచి తొలగించి- ఈ షోకిల్లా రాయుడితో రాసుకు, పూసుకుని షికార్లు తిరుగుతోందేవిటి...?

తాజుద్దీన్ 'బైక్' నడుపుతోంటే- బాల సన్నిహితంగా అతడ్ని అతుక్కుపోయి కూర్చుని ఉన్న దృశ్యం, నవ్వుతూ, తుళ్ళుతూ అతడితో సరససంభాషణలు జరుపుతున్న సన్నివేశం... పదే, పదే కళ్ళముందు మెదులుతూ.... నా మనసుని నొప్పించ సాగింది.

★ ★ ★ ★

రాత్రి తొమ్మిది గంటలు. డాబా మీద ఇద్దరికీ పడకలు ఏర్పాటు చేయించాడు శ్రీధర్. వాళ్ళింట్లో పెళ్ళి సందడి అప్పుడప్పుడే మొదలవుతోంది.

"ఏం మిత్రమా? ముఖం అలా వాడిపోయిందే? అంటే- మీ ఫ్రెండ్ కనిపించిందన్నమాట. ఇప్పటికీ ఆమె అమాయకురాలనే భావిస్తున్నావా...?" అని ప్రశ్నించేడు- అటు, ఇటు పచార్లు చేస్తూ.

"ఇలా జరిగిందేవిట్రా...?"

## కృశ్చేవ్ ఛలోక్తులు

సోవియెట్ కమ్యూనిస్టు పార్టీ ప్రధమ కార్యదర్శి నికితా . కృశ్చేవ్ భారతదేశం వచ్చినప్పుడు విసిరిన కొన్ని ఛలోక్తులు ఆయన హాస్య ప్రియుడని తెలియజేస్తు న్నాయి.

హిమాలయాలలోని టెరాయ్‌వద్ద వున్న యు.పి. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రం దర్శించడానికి వెళ్లినప్పుడు కృశ్చేవ్ అక్కడ కనిపించిన రెండు కోళ్లను చేతుల్లోకి తీసుకున్నాడు. ఆ దృశ్యాన్ని ఒక అమెరికన్ ఫొటోగ్రాఫర్ ఫోటోతీశాడు. కృశ్చేవ్ అతనితో ఇలా అన్నారు. "ఫొటో తీస్తే తీశావు కానీ, కృశ్చేవ్ కోళ్లను పీకనులిమి చంపేస్తున్నాడని మాత్రం ఫొటో క్రింద రాయబోకు, నీకు పుణ్యం ఉంటుంది"

* * * *

కోయంబత్తూరుకు వెళ్లినప్పుడు పోక చెక్కల కార్మికులు చెట్లమీదకు ఎగబ్రాకడం చూసి బుల్గానిన్‌ని కృశ్చేవ్ అడిగారు. "వాళ్లంత గబగబ మీరెక్కగలరా?" బుల్గానిన్ : "కమ్యూనిస్టుపార్టీ నాయకులు మీరు. మీరు ముందుచేస్తే బాగుంటుంది." కృశ్చేవ్ : "అహహ అలా కాదు, మంత్రిమండలి అధ్యక్షులు మీరు. మీరు దోవతీయాలి. నేను అనుసరించాలి."

* * * *

బెంగుళూరులో తమకు అదేపనిగా పూలదండలు వేస్తుండగా "మా దేశంలో ఇనుపతెర ఉందని కొందరు అంటూ ఉంటారు. దాని సంగతి అలా ఉంచి మీ దేశంలో మాత్రం పువ్వుల తెర ఉన్నది."

"ఏముంది? వడ్లగింజలో బియ్యపు గింజ. వెరీ సిల్లీ థింగ్. నేన్ను వందేళ్ళక్రితం పుట్టాల్సిన పాతకాలపు మనిషినట. నాలో చాదస్తపు భావాలు, పురాతన ఆలోచనలు కంపు కొడుతున్నాయట. తనలాంటి చలాకీ అమ్మాయికి నేను తగనట...." శ్రీధర్ చెబుతుంటే నేను శ్రద్ధగా, సావధానంగా వింటుండి పోయాను.

"...మేం ప్రేమికులుగా ఏడాదికి పైగా కలిసి మెలిసి ఉన్నాం కదా! ఆ సమయంలో నే నెలాంటి చొరవ తీసుకోలేదు. కనీసం.... 'కిస్' కూడా చెయ్యలేదు. ఎందుకని...? నా దృష్టిలో ప్రేమంటే- దేవుడి గుళ్ళో పెట్టే 'ప్రసాదం'లా పవిత్రంగా ఉండాలని భావిస్తాను కాబట్టి.

నా నిదానం, నిగ్రహం త్రిపురకి నచ్చలేదు. నన్ను రెచ్చగొట్టడానికి ప్రయత్నించి, విఫలమయ్యేది.

"ఏం మగాడివి బాబూ? ఇంత 'జడపదార్థం'ని ఎక్కడా చూళ్లేదు..." అనేది చిరుకోపంగా.

"ప్రేమికులంటే ఎలా ఉండాలి?మూడు ముద్దులు, ఆరు కౌగిలింతలతో తియతియ్యగా గడపాలి. ఇద్దరికీ ఇష్టమైనపుడు శారీరకంగా ఏకమైనా తప్పులేదు.

ఫైడియర్ శ్రీ ! ఇంత ఇదిగా నేను బయటపడి, గ్రీన్ సిగ్నలిచ్చి పిలుస్తోంటే- నువ్వు 'ప్రాసిక్కై', నన్ను ప్రసన్నురాలిని చేయక పోవడం భావ్యమా...?"

రసాస్వాదనకి ఆమె నుండి ఆహ్వానం లభించినా నేను నిశ్చలంగా ఉండిపోవడంతో... "ఛీ.... నువ్వొక చలిమిడి ముద్దవి. ఏమీ చేతకాని మొద్దువి... అంటూ నా మీద నిప్పులు చెరిగి విసవిస నడుచుకుంటూ వెళ్ళి పోయింది. అప్పట్నుంచీ నన్ను కలవడం తగ్గించి. క్రమక్రమంగా దూరం కాసాగింది. ఆ తరువాత- 'తాజా'గా మళ్ళీ తాజుద్దీన్‌తో ప్రేమాయణం మొదలెట్టింది. నన్ను కాదని వెళ్ళినందుకు కాదు- వెనకా ముందు ఆలోచించకుండా- అతను వివాహితుడని తెలిసి కూడా, ఏం సాధించాలని అతడికి దగ్గరవుతోందో...? దాదాపు ఓ మూన్నెళ్ళ పాటు నిర్భయంగా అతడితో 'వ్యవహారం' సాగించింది. అక్కడ మళ్ళీ ఏం బెడిసికొట్టిందో...? ఒక రోజు మళ్ళీ హఠాత్తుగా నా 'రూం' కొచ్చి- తన ఒంపు సొంపుల్ని ప్రదర్శించి, ఓ 'వాంప్'లా ప్రవర్తించి, మళ్ళీ నాకు

'గాలం వేసేందుకు ప్రయత్నిస్తే- నేను ఛీ కొట్టి వెళ్ళగొట్టాను...'' ఇవంతా చెప్పుకొస్తూ- చివరలో శ్రీధర్ ఒక మాటన్నాడు.

''...నిజానికి బాలని నే నెప్పుడూ ద్వేషించలేదు. ఆమె పట్ల నా ప్రేమ చెక్కు చెదరలేదు. ఆఖరికి- ఆమె చేసిన పొరపాటుని క్షమించి, ఆమెని స్వీకరించడానికి కూడా సుముఖంగానే ఉన్నాను. అయితే- ఆమె పశ్చాత్తాపానికి బదులుగా- తన పడుచుదనాన్ని ఫణంగా పెట్టి- నన్ను లొంగదీసుకోవాలనే వక్రబుద్ధిని చూపెట్టింది. అదే నేను భరించలేక పోయాను....'' స్ఫటికంలాంటి వాడి స్వచ్ఛమైన ప్రేమ, హృదయౌన్నత్యం నన్ను ముగ్ధుణ్ణి చేశాయి

బ్రహ్మదేవుడా! ఈ ఆడపిల్లల్ని చిత్రాతి చిత్రంగా సృష్టిస్తావయ్యా! వాళ్ళ మనస్తత్వాన్ని అర్థం చేసుకోవడం ఎవరి తరమూ కాదు. మారుతున్న రోజుల్ని బట్టి- వాళ్ళ ఆలోచనలూ మారుతున్నాయి. విపరీత భావాల్తో- విప్లవం సాధించాలను కుంటున్నారు. నేటి విలువల ప్రకారము- శీలాన్ని హరించేవాడే 'హీరో'. ప్రేమ పేరుతో, 'బెడ్' మీదకు లాగితే- 'గుడ్' అని మెచ్చుకుంటుంది. ఆరాధిస్తూ కూర్చుంటే 'అసమర్థుడు'... నిలువెల్లా

## బాలాసుందరి

ఆక్రమించుకుని, అనుభవించిన వాడు ఘనుడు... మొనగాడు... అసలైన మగాడు. ఏం రోజులొచ్చి పడ్డాయిరా దేవుడా!

★ ★ ★ ★ ★ ★ ★ ★

ఎందుకనో 'బాలా త్రిపుర సుందరి' మీద జాలి కలిగింది. ఏం కావాలో తెలీదు... ఎటు పోతున్నామో తెలీదు... అలాంటి అగమ్య బాటసారులకి నాలుగు మంచి మాటలు చెప్పాలి. అది మన కర్తవ్యం. విననీ, వినక పోనీ- ఆ పైన వాళ్ళ ఖర్మం. అందుకే, లాస్ట్ అండ్ ఫైనల్‌గా మరోసారి ఆమెని కలుసుకోడానికి వెళ్ళాను.

"ఎప్పుడొచ్చారు? బావున్నారా?" అల్లంత దూరాన నన్ను చూస్తూనే నవ్వుతూ స్నేహ పూర్వకంగా పలుకరించింది.

కాసేపు విశేషాలు ముచ్చటించుకున్న తరువాత- శ్రీధర్ పెళ్ళి శుభలేఖ ఆమె చేతి కందించేను. ఆమె ముఖం ఒక్కసారిగా మ్లాన మయింది. ఆ తరువాత ఏమీ మాట్లాడలేక మూగవోయింది. పాపం... తెలిసో, తెలీకో జీవితంలో కొన్ని నిర్ణయాలు ఏదో ఆవేశంలో, అనాలోచితంగా తీసుకోవడం వల్ల- ఆ తరువాత ఎంతో విలువైన వాటిని కోల్పోయి, తీరిగ్గా విచారించి ప్రయోజనం...?

"చూడండి బాలగారూ! శ్రీధర్ ఎంత మంచివాడో మీకు నేను వేరే చెప్పాల్సిన అవసరం లేదు. రత్నానికి- రాయికి తేడా తెలుసుకోవడంలో మీరు కాస్త ఆలస్యం చేశారు.

ఇక మీదటైనా వివేకంతో నడుచుకోండి. నేను మీ శ్రేయోభిలాషిని. వయసొచ్చిన ఆడది- గులాబీలా నిండుగా విరబూసాక- తన పరువాన్ని చూసి మురిసి పోవడమే కాదు- కుటుంబ పరువు, మర్యాదల గురించి కూడా కాస్త ఆలోచించాలమ్మా! నయ వంచకులు, విష నాగులూ... అనుక్షణం... అడుగడుగునా... మీకు ఆపదలు తెస్తూ ప్రమాదాలు కల్పిస్తూ- మిమ్మల్ని దోచుకోడానికి పొంచి ఉంటారు. జాగ్రత్తగా మెలగండి..."

ఒకరా, ఇద్దరా...? ఎంద రెందరో గులాబి 'బాల'లు!

రంగు రంగుల సీతాకోక చిలుకల్లాంటి అమ్మాయిలు లెక్క లేనంత మంది.. అమాయకంగా, కల్లాకపటం తెలీకుండా... స్వేచ్ఛగా సంచరిస్తూ... భగవంతుడా! వారికి వయసు, సొగసుని... సున్నితం, లావణ్యంతో పాటు యుక్తాయుక్త విచక్షణని కూడా ప్రసాదించు స్వామి...!











అడ్వొకేట్: **బి.భాస్కరరావు** ఎం.ఎ., ఎల్.ఎల్.బి.

**బి. నిర్మలాదేవి, హైదరాబాద్-32**

ప్రశ్న:- కులాంతర వివాహాలు చేసుకొని ఎన్నో అవమానాలు, నిందలు భరిస్తున్న వారి సంతానమునకు ఏమైనా రాయితీలు ఉన్నవా? వారినీ, వారి సంతానాన్ని బలహీన వర్గాల్లో చేర్చి ప్రభుత్వం రాయితీలు కల్పించగలదా?

జవాబు:- విద్యలోను, ఉద్యోగాలలోను ఎస్. సి; ఎస్. టి. లకు ప్రభుత్వం రిజర్వేషన్ కల్పించినది. భార్యగాని, భర్తగాని ఎస్. సి. గాని ఎస్. టి. గాని అయినట్లయితే ఈ రాయితీలు పొందవచ్చును. వారి సంతానము కూడా ఈ రిజర్వేషన్ పొందవచ్చును. బి. సి. లకు కూడా ఈ రిజర్వేషనులు వర్తిస్తాయి. ఇవి కాకుండా ఈ మధ్య కేంద్ర ప్రభుత్వం మండల్ కమిషన్ రిపోర్టు ప్రకారం 27 శాతం రిజర్వేషన్ బి. సి. లకు ప్రకటించింది. ఈ రిజర్వేషన్‌లు కూడా పొందవచ్చును.

**యర్రా శ్రీనివాసరావు, పాలకొల్లు**

ప్రశ్న:- నా టెన్త్ క్లాస్ మార్కుల లిస్టులో ఇంటి పేరు బాగానే పడినది. కాని ఇంటర్ మార్కుల లిస్టులో ఒక్క లెటర్ "ఎ"కు బదులుగా "ఇ" అని పడినది దీనివలన ఏమైనా రిస్క్ వున్నదా?

జవాబు:- దీనివలన ప్రమాదము లేదు అయినప్పటికి హైదరాబాద్‌లోని బోర్డ్ ఆఫ్ ఇంటర్ మీడియెట్ ఎడ్యుకేషన్ వారికి ఈ విషయం తెలియపరచి మీ ఇంటి పేరు మార్చమని వ్రాయండి.

**వి ఎస్. రామదాస్, విశాఖపట్నం-4**

ప్రశ్న - నేను 1981లో ఒక ప్రయివేట్ కంపెనీలో పనిచేస్తూ జౌన్నెలలో నా భార్యకు ముగ్గురు పిల్లలు అనంతరం ఫేమిలీ ప్లానింగ్ ఆపరేషన్ ఒక ప్రయివేట్ నర్సింగ్ హోమ్‌లో చేయించాను 1981 డిశంబరులో నేను గవర్నమెంట్ జాబ్‌లో విశాఖపట్నం పోర్ట్ ట్రస్ట్‌లో జాయిను అయ్యాను నేను ఫ్యామిలీ ప్లానింగ్ ఇంక్రిమెంట్ మంజూరు చెయ్య వలసిందని కోరాను నీవు జాబులో జాయిను అగుటకు ముందు ఆపరేషన్ చేయించావు కాబట్టి నీకు ఆ ప్రివిలేజ్ వర్తించదు. అని మా డిపార్ట్‌మెంట్‌వారు సమాధానం ఇచ్చారు నాకు ఫ్యామిలీ ప్లానింగ్ ఇన్‌సెంటివ్ వచ్చే అవకాశం వుందా? సలహా ఇవ్వ ప్రార్థన

జవాబు:- మీ పోర్ట్ ట్రస్ట్ వారు మీకు ఫ్యామిలీ ప్లానింగ్ ఇంక్రిమెంట్ నిరాకరించినట్లు ఇచ్చిన సమాధానం కాపీ జతపర్చలేదు. మీకు ఏ అథారిటీ క్రింద నిరాకరించారో ఆ రూలు తెలియపర్చాలి కదా? ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు 1976 ముందు ఫ్యామిలీ ప్లానింగ్ ఆపరేషన్ చెయ్యించుకున్న వారికి ఇంక్రిమెంట్ లేదు అన్నారు. కాని ఇప్పుడు మంజూరు చేశారు. మీరు ఉద్యోగంలో జాయిన్ అవుటకు పూర్వం ఆపరేషన్ చేయించుకున్నా, మీకు ఇంక్రిమెంట్ ఇవ్వాలి. లేనట్లయితే వివక్ష చూపినట్లు అవుతుంది ఈసారి మీరు కూడా ఫ్యామిలీ ప్లానింగ్ ఆపరేషన్ చేసుకొనండి. మీ పోర్ట్ ట్రస్ట్ వారి నియమావళికి అనుగుణంగా ఉంటుంది కనుక ఇంక్రిమెంట్ ఇవ్వక తప్పదు.

**శ్రీ కొండనవీన్, గూడూరు.**

**ప్రశ్న: 1950 జనవరి 26 తేదీన భారత ప్రజలు సర్వస్వతంత్రులు కాగలిగారు. భారత స్వాతంత్ర్యమునకు హాని కలిగినప్పుడు రాష్ట్రపతి అధికారములు తెలుపవలెను.**

జవాబు: భారతదేశ రక్షణకు ప్రమాదము ఏర్పడినప్పుడు భారత రాజ్యాంగములోని 352 అధికరణ క్రింద రాష్ట్రపతి అత్యవసర పరిస్థితిని ప్రకటించవచ్చును. ౦

ఆంధ్రసచిత్ర వారపత్రిక

న్యాయ చట్టం-ప్రశ్నలు జవాబులు

ప్రశ్న: ..................................................

పేరు: ..................................................

పూర్తి చిరునామా: ..................................................

..................................................



# శుభాంతం

శ్రీరాధానాథ కొండపి

ఒక బండిలో కొంతమంది ప్రయాణీకులు ఒక నగరానికి ప్రయాణం చేస్తున్నారు. వారు కాలక్షేపం కొరకు ఆ రోడ్డుమీద దారి కొట్టే దొంగల వృత్తాంతములు, వారినుండి తప్పించుకున్న కొందరు ధీరుల చరిత్రలను చెప్పుకొంటున్నారు. వారంతా "డబ్బుగల వారు ముందే జాగ్రత్తగా దాచుకోవా" లని హెచ్చరించు కొంటున్నారు. ఒక యువతి పకపక నవ్వుతూ, నావద్ద మూడువందల రూపాయల నోట్లు వున్నయ్. ఆ నోట్లు నా కాలి మేజోళ్లలో వున్నయ్. వాటిపైన చెప్పులు తొడుక్కున్నాను. దొంగలు నా డబ్బు యెక్కడున్నదీ గుర్తించలేరని తన తెలివి తేటలు ప్రదర్శించింది. వారిలో మూలగా కూర్చున్న వృద్ధుడు ఆమె చెప్పినదంతా శ్రద్ధగా విని తల పంకించాడు. కొంతదూరం పోయేసరికి వారనుకున్నట్లే దొంగలు బండి నాపారు. "మీవద్ద ఉన్న డబ్బు యిలా పడేయండి మర్యాదగా" అని గర్జించాడు దొంగల నాయకుడు. ప్రయాణీకులందరూ డబ్బు నాయ కునిముందు పోశారు. అది తృప్తి కలిగించలేదు దొంగలనాయకునికి." మరి మూడు వందల రూపాయలు యివ్వండి, లేకపోతే మీదగ్గరినుండి యెలా-రాబట్టుకోవాలో నాకు తెలుసునని ఒక వురుము వురిమాడు.

బండిలో మూలగా కూర్చున్న వృద్ధుడు పొడిదగ్గు దగ్గుతూ "ఆమె కాళ్ల మేజోళ్లు విప్పండి, మీకు కావలసిన ధనము దొరుకుతుం"దన్నాడు. దొంగల నాయకుడికి తను జాగ్రత్తగా దాచుకున్న డబ్బు యివ్వక తప్పిందికాదు పాపం ఆ దీనురాలికి. దొంగలు వెళ్లిపోయారు. ఆ యువతి దుఃఖానికి అంతంలేదు. వృద్ధ ప్రయాణీకుని ఆడిపోసింది. బండిలోని యితర ప్రయాణీకులు కూడ ఆ వృద్ధుని - ఎంతో తిట్టిపోశారు. ఇంకా కసితీరక మధ్యమార్గంలోనే అతనిని బండినుండి క్రిందికి తోస్తామని బెదిరించారు. అన్నిటికీ వృద్ధుని సమాధాన మొకటే. "ఎవరి జాగ్రత్తలో వారుండాలిగదా" అని.

బండి నగర పరిసరానికి పోయింది. వృద్ధుడు హఠాత్తుగా బండినుండి దూకి పారిపోయాడు, వారతనిపై కసి తీర్చుకోక మునుపే. అందరూ గమ్యస్థానం చేరుకున్నారు. ప్రొద్దుక్రుంకింది. రాత్రి అయ్యేసరికి ఆ అనాథ యువతికి తన కింక వేరే దిక్కులేదని, వున్న డబ్బుకాస్తా పోయినదని [illegible] కాసాగింది. ఆ రాత్రంతా ఆమెకు కంటి మీద కునుకులేదు.

తెల్లవారింది. తనగదిలో గది మంచె మీద తన పరుపుచుట్ట పెట్టుకోటానికి పోగా మేజా బల్లమీద ఒక పెద్ద కవరు కనిపించింది. దానిపై ఆమె చిరునామా కన్పించింది పెద్ద అక్షరాలలో. ఆశ్చర్యంతో కవరు చించి చూచింది. ఆమెకు వుత్తరం వ్రాసే వాళ్లీలోకంలో ఎవరూలేరు. కాని కవరులోనున్న డబ్బు చూచేసరికి ఆమె దుఃఖం పటాపంచలైంది. దుఃఖంతో నీరసించిన ఆమె ముఖంలో నూత్నవికాసం కనిపించింది. దానిలో మూడు వందరూపాయల నోట్లు, శ్రేష్టమైన దంతపు చట్రంలో బిగించిన ఒక అందమైన అద్దమూ వున్నాయి. తన పేరుతో ఒక వుత్తరంకూడ వుంది. వుత్తరంతీసి చదువనారంభించింది.

ప్రియమైన శ్రీమతికి

మీకు నిన్నటి దినం నేనొనర్చిన అపరాధానికి పరిహారంగా యీ చిన్న పారితోషికాన్ని తమకు పంపుకొంటున్నాను. ఈ అద్దము నాలుగువందల రూపాయల విలువ చేస్తుంది. కనక నాయందాగ్రహము విడిచి అవి పుచ్చుకోండి. నిన్న మనం పయనించేటప్పుడు నావద్ద ముప్పై వేల రూపాయల చెక్కువుంది. మనం ఉపేక్షచేస్తే నీ పైకంతోపాటు నా 30,000 రూపాయల చెక్కుకాగితం గూడా దొంగల పాలైపోయేది. నేను అష్టకష్టాలు పడి ఆర్జించిన ఆ ధనం పోగొట్టుకోలేక నీ డబ్బు వారికి వప్పజెప్పాను. క్షమించాలి. తరవాత నీ డబ్బు నీకు ముట్ట చెప్పాలనే నా ఉద్దేశ్యం. నీ కెల్లప్పుడూ కృతజ్ఞుడనై వుంటాను.

నీ శ్రేయోభిలాషి, "రఘువీర్"

(ఆంధ్రసచిత్ర వారపత్రిక 14-2-51 సంచిక నుంచి) ○

సీరియల్

# సాగరమథనం

## అడివి సూర్యకుమారి

<u>ఇంతవరకూ సాగినకథ- *11:*</u> శ్రీలంక ఉగ్రవాదులను అరికట్టడంలో తమవంతు కర్తవ్యాన్ని నెరవేర్చి స్వదేశం తిరిగి వెళ్తున్న భారత శాంతి సేనకు వీడ్కోలిచ్చేందుకు వచ్చిన ముగ్గురు అధికారులు హత్యచేయబడతారు. ట్రింకోమలిలో శక్తి నెలకొల్పిన సేవాగ్రామంలో జయసూర్య డాక్టరుగా చేరతాడు రణసింఘె పారిపోవటంలో నిర్ల క్ష్యంచూపిన పోలీసుల్ని, ఇన్‌స్పెక్టర్‌ను డి.జి.పి. మేఘవర్ణ కాల్చి చంపుతాడు. హెడ్ క్వార్టర్సుకు తీసుకువెళ్తున్న ముగ్గురు వ్యాన్ డ్రైవర్లను ఎత్తుకుపోయిన వారిని అగ్ని పట్టుకుంటాడు కాని డ్రైవర్లు పరారీ అవుతారు. అగ్ని సమయస్ఫూర్తితో వ్యవహరించి ఎలుకరూపంలోవున్న బాంబును కనుక్కుంటాడు.

[గత సంచిక తరువాయి]

హోటల్ హిల్టన్.

లాస్ట్ ఛాంబర్

భారత్ ఎక్స్‌పోర్ట్స్ అండ్ ఇంపోర్ట్స్ ఆఫీసుడోర్ తెరుచుకొని లోపలికి ప్రవేశించాడు అగ్ని.

విష్‌చేస్తూ వచ్చాడు.

ఛైర్మన్ భట్టాచార్య అతణ్ణిచూస్తూనే 'రా! రా!' ఏమిటంత ఆలస్యం చేశావ్? గంటబట్టి వెయిట్ చేస్తున్నాం నీకోసం అన్నారాయన.

అగ్ని ఆయన కెదురుగా కూర్చున్నాడు.

ఆయన అగ్నివైపు చూస్తూ 'ప్రధాని నీకు తన అభినందనలు తెలియచేయమన్నారు. మొన్నటి నీ సెక్యూరిటీ ఏర్పాట్లు సలహాలు జాగ్రత్త ఉండబట్టే గొప్ప ప్రమాదం నుండి బైటపడ్డాం టీస్టాల్‌లోని వ్యక్తులంతా చనిపోయినట్లేనా?'

అగ్ని ఆయన అభినందనలని తల వంచి అందుకుంటూ 'పోయారనే అనుకుంటున్నా తారసపడనంత వరకూ..' అని ఆగాడు చిరునవ్వుతో తనే అడిగాడు. 'ఇంతకీ ఆ చర్చల ఫలితాలు...'

'ఔనుకదూ!' అంటూ భట్టాచార్య శ్రీలంకకి సంబంధించిన ఫైల్ తీసి అతని ముందుకి నెడుతూ

"భారత్ శ్రీలంకల మధ్య కొన్ని ముఖ్యాంశాల్లో ఒప్పందం జరిగింది. అందులో మొదటిది శ్రీలంక తూర్పు ఉత్తర ప్రాంతాల విలీనం. రెండవది తమిళ రాజకీయ డిటెన్యూలకు క్షమాభిక్ష, మూడవది ఎమర్జన్సీ ఎత్తివేత" అన్నారు.

"చాలా ముఖ్యమైన విషయాల్లో ఈ ఒప్పందం కుదరటం ఇరుదేశాల ప్రజలకి ఆనందం కల్గిస్తుంది. కేవలం ప్రజా విముక్తి పెరమున, సిలన్‌స్ప్రింగ్‌లని అణచివేయటమే ప్రధాన కార్యక్రమంగా పెట్టుకున్నారేగాని అసలు సమస్యల జోలికి పోలేదు వారింకా. ఇప్పటికైనా శ్రీలంక అధ్యక్షులు ఒప్పందంలోని ఈ అంశాలు అమలు జరిపితే శాంతియుత పరిస్థితులేర్పడతాయి. అందుకు తగిన గట్టి చర్యలు ఆయన తీసుకోగలగాలి. అవి అమలు కావాలి" అన్నాడు అగ్ని.

"అంటే...అమలు కావని నీ ఉద్దేశమా?"

'ఔను అమలు కానివ్వరు. అక్కడ శాంతి ఏర్పడటం కొందరికి ఇష్టం లేదుగదా' ఆగాడతడు.

'ఆ కొందరిని కొద్దిసేపు అవతల ఉంచుదాం. ఎన్నికల నిర్వహణ కూడా ఒప్పందంలో అతి ముఖ్యభాగం సింహళ భాషతో సమానంగా తమిళ భాషను శ్రీలంక అధికార భాషగా చెయ్యాలని శాసనం తేబోతున్నారు. శ్రీ జయవర్ధనే ఈ ఒప్పందంలో ప్రధానాంశాల అమలుకు సిద్ధమైనారంటేనే ఆయన తన దేశంలోని జాతుల సమస్యను పరిష్కరించాలని ఆతృత కనపరుస్తున్నట్లే అవగతమౌతోంది. అదీ గాక ఆయన ఇపుడు అంగీకరించిన ఈ అంశాలన్నీ

తమిళ ప్రజల చిరకాల వాంఛితాలే కదా!'

అగ్ని ఆయన చెబుతున్నది వింటు న్నాడు. ఇవన్నీ అమలు జరగటం ఒప్పం దంపై సంతకం చేసినంత తేలిగ్గాదు.

"భారత శాంతిసేన 5 రోజుల పాటు కాల్పుల విరమణకు కూడా ఒప్ప కొంది" అన్నారాయన.

అగ్ని ఏమ్మాట్లాడకపోవడం గమ హస్తం ఏదో తెలుసుకుంటే నిమి షాల మీద మిగతా అలజడినంతా సప్రెస్ చెయ్యొచ్చు."

భట్టాచార్య రెండవ వైపునున్న డ్రాయర్ సొరుగు లాగి దానిలో నుండి ఒక స్టైన్‌గన్ తీసి అతనికందించాడు.

అగ్ని దాన్నందుకొని చూశాడు. దానిపై 'సిక్ ఇండియా' అని వుంది అంటే 'సెటిలింగ్ ఇన్‌స్ట్రుమెంట్స్ కంపెనీ ఇండియా లిమిటెడ్'.

'మనదేశంలోనే వుందా?' కనుబొ మలు ముడుస్తూ అడిగాడు అగ్ని.

ఆయన లేచి నిలబడి కిటికీ దగ్గరగా వచ్చారు. అతనివైపు తిరిగి ఈ స్టైన్ గన్‌ని మొన్న శ్రీలంక బృందం అందిం చారు. ఈ గన్స్‌నే వారి దేశంలో విప్లవ కారులు ఎక్కువగా ఉపయో గిస్తున్నారట. ఇవి మన కంట్రీలో



సించి 'నీ ఎఫర్ట్స్ ఎంత వరకొ చ్చాయి?' అన్నారు

"వ్యక్తులని గుర్తించడం దాకా వచ్చాను అందరికీ వెనక వున్న ఆ అజ్ఞాత

[redacted]

—————— ప్రశ్నావళి: ——————

## రచయిత్రి జవాబులు

శ్రీలంకలో ప్రస్తుత రాజకీయ పరిణామాల మీద, జాతి విద్వేషాలమీద పాఠకులు అడిగే ప్రశ్నలకు రచయిత్రి శ్రీమతి అడివి సూర్యకుమారి ఆంధ్ర సచిత్ర వారపత్రికలో జవాబులు యిస్తారు. పాఠకులు తమ ప్రశ్నలను కార్డుమీద వ్రాసి -

"సాగర మథనం ప్రశ్నావళి", ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3 అన్న చిరునామాకు పంపాలి: వ్యక్తిగత ప్రశ్నలు, చొప్పదంటు ప్రశ్నలు వద్దని మనవి. - ఎడిటర్



తయారయ్యే ఆయుధాలని దాని మీద ముద్ర చెబ్తోంది కదా! 'ఊ..' అని వచ్చి ఇంటర్ కమ్‌లో 'రెండు కాఫీ' అని చెప్పారు. అగ్ని ఆ గన్‌ని శల్యపరీక్ష చేస్తూ వింటున్నాడు.

"మీ దేశం నుండి ఆయుధాలు సరఫరా అవుతున్నాయి. ఓ వైపు శాంతి ప్రయత్నాలు. రెండో వైపు ఆయుధాల అందింపు. ఈ డబుల్ గేమ్‌కి అర్థమేమిటి?ని" అడిగారు వాళ్ళు.

ఇంతలో కాఫీ లొచ్చాయి.

కాఫీలు తీసుకున్నారిద్దరూ.

"అసలివి మనదేశంలో ఎక్కడ తయారౌతున్నాయి? వాళ్ల కెవరిద్వారా చేరుతున్నాయి కనుక్కొని వెంటనే స్టాప్ చేయించే ఏర్పాటు చూడు" అన్నారాయన. ఒక తోలు సంచీ అతనికిస్తూ.

అగ్ని ఆ సంచీలో గన్ ఉంచి దాని మూతి బిగించి లేచి 'మళ్లీ కలుస్తాను' అన్నాడతడు.

అగ్ని ఆ గన్ తీసుకొని బైటికొచ్చాడు.

కారులో అతను యామ్యునేషన్ లైసెన్సెన్ డిపార్ట్‌మెంట్‌కి వెళ్లాడు.

స్టెనో దగ్గరికెళ్లి "ఎక్స్‌క్యూజ్‌మీ మేడమ్. లైసెన్సెస్ కంట్రోలర్ బ్రిగేడియర్ మల్హోత్రాని కలుసుకోవటానికొచ్చాను" అన్నాడు.

'జస్ట్ ఎ మినిట్'అంటూ ఇంటర్ కమ్‌లో ఆయనతో వెంటనే మాట్లాడిందా అమ్మాయి. అతనివైపు తిరిగి చక్కని ఇంగ్లీషులో "ఒక్క నిముషం తర్వాత మీరు బ్రిగేడియర్ మల్హోత్రాని

## సాగర మథనం

కలవొచ్చు" అంది.

అతనెవరో ఆమె కనుక్కోలేదు. కాని అతని రూపం, మాట తీరు అనుమానాస్పదుడుగా కన్పడలేదు సరికదా ఆ విగ్రహం, సూటిగా చూసే కళ్లూ, గంభీరమైన ఆ మూర్తి ఆమెకు గౌరవంతో కూడిన భయాన్ని కల్గించింది.

"థాంక్యూ" అని అతను అక్కడే వున్న సోఫాలో కూర్చున్నాడు.

ఓ నిముషం తర్వాత లోపల నుండి కొందరు బైటికొచ్చారు.

ఆ తర్వాత తను లోపలికెళ్తూనే

### పెద్ద స్టేషన్

దేశంలో కెల్లా పెద్ద రైల్వేస్టేషన్ ఏది? అంటే... హౌరా స్టేషన్‌ట. ఈ స్టేషన్‌గుండా రోజుకు 490 రైళ్లు రాకపోకలు సాగిస్తుంటాయి. 1854లో తొలిసారిగా ఈ స్టేషన్‌కోసం కట్టిన భవనం స్థానే 1905లో యిప్పుడున్న భవనం నిర్మింపబడింది.

ప్రస్తుతం ఈ స్టేషన్‌లో 17 ప్లాట్ ఫారాలున్నాయి. వచ్చే ఏప్రిల్ నాటికి మరో నాలుగు ప్లాట్ ఫారాలను ప్రారంభిస్తారు. ఈ ప్లాట్ ఫారాలు ఒక్కొక్కటి 25 బోగీలు నిలిచేందుకు వీలుగా వున్నాయట. ఇన్ని సౌకర్యాలతో వున్న ఈ స్టేషన్ మరి మన దేశానికే గర్వకారణం కదూ!

విష్ చేశాడు అగ్ని.

బ్రిగేడియర్ మల్హోత్రా అతణ్ణి నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశాడు.

తనవెవరు పంపిందీ చెప్పాడు అగ్ని. అది వినగానే ఆయన వెంటనే లేచినిలబడి అగ్నితో కరచాలనం చేసి సీటు ఆఫర్ చేసి "చెప్పండి మీకేం సహాయం చెయ్యాలి నేను? నా సర్వీసెస్ ఉపయోగించుకుంటే సంతోషిస్తాను" ఎంతో మర్యాదగా అడిగాడాయన.

అగ్ని సంచీలో నుంచి స్టెన్‌గన్ బైటకి తీసి డ్రాయర్ మీదుంచుతూ-

"ఈ గన్స్ భారత దేశంలో తయారవుతున్నాయా? ఈ గుర్తుగల కంపెనీ అనేది ఒకటి మనదేశంలో వుందా? ఉంటే వారి యాన్యువల్ సప్లై ఎంత? భారత్‌లో ఎంత ఉపయోగిస్తున్నారు? విదేశాలకు ఎంత ఎగుమతి చేస్తున్నారు? వివరాలు కావాలి. కాస్త త్వరగా ఇవ్వగలిగితే మరీ మంచిది" అన్నాడు.

బ్రిగేడియర్ మల్హోత్రా ఆ గన్‌ని తీసుకొని పరీక్షగా చూసి "ఇదసలు మన దేశంలో తయారు కాబడింది కాదు. అయినా నేనిది ఎనలైజేషన్‌కి పంపి రిపోర్టు తెప్పిస్తాను" అంటూ ఇంటర్ కమ్‌లో ఎవరినో పిలిచాడు. రెండు నిముషాల్లో అతనొచ్చాడు. ఆగన్ అతనికిచ్చి 'దీనికి సంబంధించిన ఎనలైజేషన్ రిపోర్టు మధ్యాహ్నానికల్లా కావాలి. "వెరీ అర్జంట్" అన్నాడు మల్హోత్రా.

'ఎస్-సర్' అంటూ గన్ తీసుకొని వెళ్లి పోయాడతడు.

"ఎక్స్‌పర్ట్స్ ఎనలైజ్ చేసి రిపోర్టు

పంపుతారు ఈవెనింగ్‌కి మీకది అందచేస్తాను" అన్నాడు మల్హోత్రా.

"అందాకా నేనిక్కడే ఉంటాను. మీకేమీ అభ్యంతరం ఉండదుగా" అడిగాడు అగ్ని.

"దీన్ని బట్టి ఆ రిపోర్టు అతనికెంత తొందరగా అవసరమో అర్థమైంది మల్హోత్రాకి.

"విత్ ప్లెజర్. మోస్ట్ వెల్‌కం టు యూ సర్" అన్నాడు మల్హోత్రా. ఆ తర్వాత-

దేశ విదేశాల్లో సాగుతున్న అక్రమ ఆయుధాల తయారీ గురించి, సరఫరా గురించీ చర్చ సాగింది ఇద్దరి మధ్యా.

"పంజాబ్ టెర్రరిస్టులకి, కాశ్మీర్ టెర్రరిస్టులకి. అందుతున్నవి పాకిస్తాన్‌లో తయారయ్యే తుపాకులు గ్రెనేడ్స్" అన్నాడు మల్హోత్రా-

ఔనన్నట్లు తలూపాడు అగ్ని.

తర్వాత దేశంలోని రాజకీయాలు. వివిధ పార్టీల పన్నుగడలు, వాగ్దానాలు, వైఫల్యాలు, ఎలక్షన్లు, స్వార్థం, అవినీతి, లంచగొండితనం అనేక విషయాల మీద సంభాషణ సాగి ంది ఇద్దరిమధ్యా.

'నలభై సంవత్సరాల క్రిందటి ప్రపంచంలోని పరిస్థితులకి, నేటి పరిస్థితులకి చాలా తేడా వుంది. అయితే మనిషి జీవితం మీద, ప్రవర్తనా సరళి మీద ప్రభావితమై అనేక మార్పులు తెచ్చింది. శాంతి, అహింసలతోనే మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందనుకోవటం పొరబాటు. ఎందరో త్యాగమూర్తుల ఆత్మబలిదానాలు రక్తపు ఏరులూ దేశాన్నంతా తడిపి ఉత్తేజాన్ని కల్గించిన విప్లవం వాటి




ఒక సినిమా తారని ఒక కోటీశ్వరుడు పెళ్లిచేసుకోగోరి, ఆమె ప్రవర్తన ఎలాంటిదో కనిపెట్టడానికి డిటెక్టివ్‌ని నియమించాడు. కొద్ది రోజుల తర్వాత డిటెక్టివ్ యిలా వుత్తరం వ్రాశాడు:

"ఆవిడ ప్రవర్తనని అంతా మెచ్చుకుంటున్నారు. ఆవిడ గత చరిత్ర నిష్కళంకమైనదట. ఈమధ్యమాత్రం దుశ్శీలుడైన ఒక కోటీశ్వరుడితో ఆమె తరచు కనిపిస్తున్నదని గుసగుసలు వినిపిస్తున్నాయి".

వెనక అగ్నిగుండంలా ఉందన్న సంగతి మరువకూడదు. ఆ విప్లవ జ్వాలలు ఇంగ్లండ్ దాకా పాకి సూర్యుడస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యపు ఉన్నత సౌధాలపైకి సాగి కార్చిచ్చులా వ్యాపించాయని మరిచిపోతే ఎలా? గాంధీజీ కూడా ఒకానొక స్టేజిలో తుపాకీకి తుపాకీతోనే జవాబివ్వాలనే స్థితి కొచ్చారంటే..... ఆలోచించండి. మన మంచితనం, అహింసా సిద్ధాంతాలు అవతలివాళ్లు చేతకానితనంగా భావిస్తున్నప్పుడు ఊరుకోవటం-నిజంగా వారి ఊహలకి ప్రాణం పోయటమే. అందుకే తుపాకీని తుపాకీతోనే ఎదుర్కోవాలి. హింసని హింసతోనే ఎదుర్కోవాలి. ఇది నా వ్యక్తిగత అభిప్రాయం అనుకోండి, మన వృత్తిలో మనం యథాతథంగా మన అభిప్రాయాల్ని ఆచరణలో పెట్టడానికి అవకాశం లేదనుకోండి' ఆపాడు అగ్ని.

'నిజం బాగా చెప్పారు.' అన్నాడు మల్హోత్రా. ఇంతలో 'లంచ్' "రెడీ సర్" అని సెక్రటరీ అనగానే 'లంచ్‌కి వెళ్లారిద్దరూ'.

లంచ్ అయ్యాక మూడుగంటల దాకా అక్కడే వున్నాడు అగ్ని.

అప్పుడొచ్చింది రిపోర్టు.

"ఈ ఆయుధాలలో ఉపయోగించినవేవీ మనదేశానికి సంబంధించినవి కావు. ఇవి పాకిస్తాన్‌లో తయారైనవే. పాకిస్తాన్ సరిహద్దుల్లో వున్న ఓ గ్రామంలో ఈ ఆయుధాలు తయారౌతాయి. అక్కడి వారి బ్రతుకుతెరువు ఆయుధ తయారీయే. ప్రతి ఇంట్లోనూ చిన్న పిల్లల దగ్గర నుండి వృద్ధులదాకా ఈ పనుల్లోనే నిమగ్నులౌతారు, ఇతర దేశాలలోని ఉగ్రవాదులు, అతివాదులు, జాతి వ్యతిరేక శక్తులు-ఎవరికైనాసరే, ఏదేశస్థులైనా వారికనవసరం. వారిక్కావాల్సింది డబ్బు. అది పుచ్చుకొని కావలసిన ఆయుధాలందిస్తారు. మనదేశంలో గ్రామాల్లో కుటీర పరిశ్రమలాగా ఆ గ్రామంలో ఈ ఆయుధాల తయారీ కుటీర పరిశ్రమ లాంటిది. ఈ గన్ ఆ గ్రామంలో తయారయ్యిందే", అన్నాడు మల్హోత్రా.

అగ్ని లేచి గన్ బ్యాగ్‌లో ఉంచు




కోసం షేక్‌హేండ్ ఇచ్చి 'థాంక్యూ ఔంటి ట్సెస్. థాంక్స్ ఫర్‌యువర్ కైండ్ హాస్పిటాలిటీ అండ్ ఇన్ఫర్‌మేషన్' అని బైటకొచ్చాడు.

కారెక్కి నేరుగా హోటల్ హిల్టన్‌లో కొచ్చి ఆపాడు.

భట్టాచార్య ఛాంబర్ కొచ్చాడు.

'రా!రా! పనిపూర్తయిందా?' అడిగారాయన. ఇంటర్‌కమ్‌లో 'టూ కాఫీ' అన్నారు.

అగ్ని ఆయన ముందు కూర్చుంటూ "మన అనుమానం నిజమే" అంటూ గన్ టేబుల్ మీదుంచుతూ "ఇది పాకిస్తాన్‌లోని సురిజిత్‌పురాలో తయారయ్యింది. అయితే ఇక్కడికివి స్మగుల్డ్ గూడ్స్‌గా వస్తున్నాయి. 'సిక్ ఇండియా' ముద్రవేయబడి శ్రీలంకకి ఎగుమతి చేయబడుతున్నాయి. అలాంటప్పుడు ఇవి ఇండియాలో తయారయ్యాయనుకోవటంలో ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు. వారు మనల్ని అనుమానించటంలో ఏ మాత్రం అసంగతం కాదు" అన్నాడు.

'మరి ఆ కంపెనీ....'

# సాగర మథనం

'అది లైసెన్స్‌డ్ కంపెనీ కాదు' అన్నాడు అగ్ని.

'దేశంలో లైసెన్స్ లేని ఆయుధాల తయారుచేస్తున్న ఫ్యాక్టరీలన్నీ తనిఖీ చేయాల్సిందే, తప్పదు' అన్నాడతనే తిరిగి.

అగ్ని భట్టాచార్యతో మాట్లాడుతున్న ఆ సమయంలో గేటు దగ్గరున్న గూర్ఖా దగ్గరకొచ్చాడొక మధ్య లాంటి వ్యక్తి.

అతను చాలా హడావిడిగా ఉన్నాడు.

ఖంగారుగా కూడా ఉన్నాడు.

భయం భయంగా చూస్తున్నాడు.

గూర్ఖా అతణ్ణే ఆపాడు.

'ఏమిటి?' అడిగాడు గూర్ఖా.

"ఎ.ఇ.యు.7111 కారులో వచ్చినాయన మా షాపులో ఇది మరిచిపోయారు."

అంటూ చిన్న అట్టపెట్టె చూపాడు.

గూర్ఖా ఆ అట్టపెట్టె అతని చేతి నుండి తీసికొని తెరిచి చూశాడు. చక్కని 'డైమండ్ రింగ్'. కళ్ళు మిరుమిట్లు గొల్పాయి.

అతను చెబుతున్నాడు "సేట్ రతన్ లాల్ దగ్గర పనిచేస్తున్నాన్నేను. సార్ చేతిలో అప్పటికే కొన్ని ప్యాకెట్లున్నాయి. నేను అవి కారులో పెట్టేందుకు సాయం చేశాను. ఇది వాటిలో ఎలాగో మిస్సయింది. సేట్‌జీకి తెలిస్తే నేనే కావాలని ఇలా చేశానని, వచ్చిన కస్టమర్స్‌ని మోసం చేస్తున్నానని నా ఉద్యోగం పీకేస్తాడు. పిల్లా పాపా కలవాణ్ణి భాయీ, ఈ చిన్న అట్టపెట్టె ఆ కార్లో పెట్టేశావంటే నీకు పుణ్యం వుంటుంది. ఇది ఆ సార్‌కు అందుతుంది. నాక్కావల్సిందంతే" అన్నాడు.

గూర్ఖా చూపు రింగ్ మీది నుండి అతని ముఖం మీదికొచ్చింది.

మనిషి అమాయకంగా ఉన్నాడు.

అందుకే నిజాయితీగా ఇంత విలువైన రింగ్‌ని తీసుకొచ్చాడు.

నిజాయితీకి రోజులా ఇవి!

ముందువెళ్తున్నవాడి పర్స్ జారిపడితే వెనకొస్తున్న వాడు తీసి దాచుకుంటున్నాడేగాని ఇదిగో నీపర్స్ అని ఇవ్వగలిగే మంచి మనుష్యులేరీ? అలాంటి ఈ రోజుల్లో వీడింత నమ్మకంగా ఎలా ఇవ్వగలిగాడూ...?

గూర్ఖా ఒక క్షణం ఆలోచించి- "జానూ! నెంబరేం చెప్పావ్? అయినా ఆ కారు ఇక్కడికే వస్తుందని నీకెలా తెలుసు?" అడిగాడు.

"సేట్‌తో మాట్లాడుతుంటే విన్నాను ఆరున్నర దాకా ఈ హోటల్‌లోనే ఉంటారన్నారు. అందుకే వెంటనే ఇక్కడి కొచ్చేశాను" అన్నాడు.

"నెంబరెంత?"

"ఎ.ఇ.యు. 7111" అన్నాడా వ్యక్తి. అని మెల్లిగా గూర్ఖావైపు తిరిగి 'చూడు సాయంకాలం మా ఇంటికిరా. అర్థమైందా?' గుంభనంగా న వ్వాడతను. 'నీ సాయం ఉంచుకోనులే....' అన్నాడు అతనే.

గూర్ఖా కళ్ళు చిట్లించి చూసి తర్వాత తనూ చిర్నవ్వు నవ్వి 'వస్తా- ఎక్కడా ఇల్లు?' అడిగాడు. అడ్రస్ చెప్పాడతను.

నోట్ చేసుకున్నాడు గూర్ఖా.

"ఉండు ప్యాకెట్ కారులోపెట్టొస్తా" అంటూ కార్లు పార్క్ చేసి వున్న వైపు వెళ్ళాడు. ఆ నెంబర్ గల కారుని చూసి విండో గుండా పెట్టె లోపల పెట్టాల నుకున్నాడు. బ్యాక్ సీటు మీద పెడ్తే సరిపోతుంది అనుకుంటూ మెల్లిగా అటు ఇటు చూసి పెట్టెని బ్యాక్ సీటువైపు వేశాడు. అది జారి సీటు కిందపడింది. తీసి సరిగ్గా పెడదామంటే లాక్ అయి వుంది కారు. 'సరె. వస్తువు ఆయన కారులోకి చేరిందికదా' అనుకుంటూ వెనక్కి తిరిగి వచ్చాడు.

అక్కడ అతనులేడు. 'అరె. ఎక్కడికి పోయాడు వీడు! ఇంతలోనే?' అనుకుంటూ చుట్టూరా చూశాడు. కనుచూపు మేరలో అతను కనబడలేదు.

"చిత్రమైన మనిషి! అంత విలువైన రింగుని ఎంతో నిజాయితీతో తెచ్చిచ్చాడంటే వాడెంతో గొప్ప మనసుకలవాడై ఉండాలి. లేకపోతే ఈ రోజుల్లో దొరికిన వస్తువును తిరిగి ఇచ్చేవారెవరూ?" అనుకుంటున్నాడేగాని-

తానొక మారణాయుధాన్ని ఆ కారులో వేశానని అతనికి తెలియదు.

ఆ మారణాయుధం ఆ పెట్టెలోని రింగు క్రింద గల ఖాళీ జాగాలో చిన్న రేగి కాయంత పరిమాణంలో భయంకరంగా పొంచి వుందని ఏ మాత్రం తెలీదతనికి.

ఆ మినీ టైంబాంబు పేలటానికి కేవలం అరగంట మాత్రమే వ్యవధి ఉందన్న విషయం అస్సలతను ఊహించనూ లేదు.

ఇవేవీ తెలీని అతను ఉంగరం ఇచ్చిన వ్యక్తిని మనసులో అభినందించసాగాడు.

ఇంతలో అగ్ని భట్టాచార్య దగ్గర నుండి బైటికొచ్చాడు.

అతను గబగబ ఎ.ఇ.యు.7111 కారెక్కి రోడ్డుమీది కొచ్చాడు.

సిలోన్ వెళ్ళటానికి తనకింకా నాలైదు రోజులు పట్టేట్టుంది. ఈ లోపు ఈ గన్ వ్యవహారం తేల్చాలి? ఎక్కడి నుండి మొదలెట్టాలి?

ఆలోచిస్తూ అప్రయత్నంగా గడియారంవైపు చూశాడో అరసెకన్.

టైమ్, డేట్ కన్పించగానే.

అతనికి వెంటనే పదిహేనో తారీకు గుర్తొచ్చింది. పదిహేనో తారీకింకా నాల్గు రోజులుంది. ఆ రోజామె పుట్టినరోజు. ఆ డేట్‌తోపాటు ఆమె... పిల్ల తెమ్మెరగా అతని మనసులో * కొచ్చేసింది. ఆమె గురించిన ఆలోచన రాగానే అప్పటి దాకా మనసులో ఉన్న చికాకులు, ఆలోచనలు, పక్కకి వెళ్ళిపోయాయి.

గంభీరంగా వున్న అతని ముఖం పెదవులపైకొచ్చిన చిన్న హాసరేఖతో వింత అందాన్ని సంతరించుకొంది.

ఆమె తలపు మాత్రాన్నే తనలో ఏదో కొత్త శక్తి, చైతన్యం వచ్చినట్లుగా ఫీల్ కాసాగాడతడు. టైంబాంబు పేలటానికి కరెక్టుగా వ్యవధి మూడునిముషాలు మాత్రమే వుంది.

మృత్యువు తన సీటు కింద తనకై పొంచి వుందని ఏ మాత్రం ఊహించని అగ్ని - భావనా లోకంలో విహరిస్తూ కారు స్పీడుగా పోనిస్తున్నాడు.

(ఇంకా వుంది)



# ఆంధ్రసచిత్రవారపత్రిక

## పాఠకుల కోసం

**ఓ మహానటుడు - ఓ మహోన్నతవ్యక్తి ప్రత్యేకంగా**

**ఇచ్చిన సంచలన ఇంటర్వ్యూ!**

* ఆరేళ్లపాటు తల్లిపాలు తాగి - 67 ఏళ్ల వరకు 'మహానటుని'గా వుంటూ - తలనొప్పి జ్వరం అన్నది - ఏలాంటిదో తెలీని కథానాయకుడు - ఎవరు?
* కోటీశ్వరుడైన ఆ హీరో రోజుకు ఒక "పెగ్" బ్రాందీ మాత్రమే తాగుతాడు? రెండో 'పెగ్' వేపు చూడడు! ఎవరా హీరో?
* ఉదయంపూట - ఒకే ఒక ఇడ్లీ - ఒకే ఒక గ్లాసు మజ్జిగ మాత్రమే తాగే ఆ నిత్య యవ్వనుడు ఎవరు?
* ఎవరికే సమాధానం దొరకని చోట దేవుడుంటే - నాకు దేవుడు నా "మెడిటేషన్" - అంటూ ఆత్మ విశ్వాసాన్ని నమ్మే అందాల కథానాయకుడెవరు?
* "భిన్న భావాలు గల ఏకత్వం వున్న కుటుంబం మాది! భిన్న భావాలు లేకపోతే - అభివృద్ధి పూజ్యం" అని చెప్పే - జీవిత పరిపూర్ణత నందిన - ఆ "మహామేధావి" ఎవరు?
* తను దేవుడ్ని నమ్మడు - నమ్మేవాళ్లను కాదనడు - కాని ఆయన నటించిన సినిమాల్లో భక్తిరసాన్ని గుప్పించి - ఒప్పించి - మెప్పించే కళాప్రపూర్ణుడాయన!

ఇంతకీ ఎవరా నాటి - నేటి - మేటి - మహానటుడు???

**పై వారమే ప్రారంభం**

ఇంతవరకూ ఏ పత్రికకూ ఇవ్వని ప్రత్యేక ఇంటర్వ్యూ!

"ఆంధ్రసచిత్రవారపత్రిక" - పాఠకులకు ప్రత్యేకం!

***

'ఆంధ్రపత్రిక సినీ స్పెషల్ రిపోర్టర్' ధారావాహిక శీర్షిక!





# "పరుగులరాణి" గుడ్‌బై!

పరుగుల రాణి పి టి ఉష అథ్లెటిక్స్ నుంచి తప్పుకుంటోంది ఈ విషయాన్ని స్వయంగా ఆమె ఇటీవల బీజింగ్‌లో ప్రకటించింది

ఎనిమిది సంవత్సరాల పాటు మన దేశ పరుగుల రాణిగా ఖ్యాతి వహించిన కేరళకు చెందిన 26 సంవత్సరాల ఉష 1982లో అథ్లెటిక్స్ పోటీల్లోకి ప్రవేశించారు

1986లో జరిగిన ఆసియా క్రీడల్లో నాలుగు స్వర్ణపతకాలు, ఒక రజత పతకం సంపాదించి భారత కీర్తి పతాకాన్ని ఎగుర వేశారు గత నవంబరులో ఢిల్లీలో జరిగిన ట్రాంక్ అండ్ ఫీల్డ్ పోటీల అనంతరమే తాను నిష్క్రమించాలని అనుకున్నది కాని బీజింగ్ క్రీడల్లో పాల్గొనాలని ఆ తర్వాత నిర్ణయించు కున్నారు

శిక్షణా లోపం కారణంగా ఆమె తాననుకున్న లక్ష్యాన్ని బీజింగ్ పోటీల్లో సాధించలేక పోయారు సరికదా బంగారు పతకాలు బదులుగా రజత పతకాలను పొందటం ఆమెను అసంతృప్తికి గురి చేశాయి దానితో ఆమె అథ్లెటిక్స్‌కు గుడ్‌బై కొట్టాలన్న నిర్ణయాన్ని తీసుకున్నారు

బీజింగ్‌లో నా కృషి నేను చేశాను, ఇప్పటివరకు నా విజయాలతో నేను సంతృప్తిచెందాను అని ఢిల్లీలో జరిగిన వీడ్కోలు పత్రికాగోష్ఠిలో ఆమె అన్నారు. విదేశీకోచ్ శిక్షణలో వుంటే మంచి రాణింపు వుండేదన్న విషయాన్ని ఆమె ఒప్పుకోలేదు సరికదా తన కోచ్ నంబియార్‌ను విదేశీయులకు సిఫార్సు చేస్తున్నానని చెప్పారు. ముందు ముందు యువతీ యువకులకు అథ్లెటిక్స్‌లో సహకరిస్తాను గాని పూర్తికోచ్‌గా వుండనని ఉష పేర్కొన్నది

రైల్వేలో పర్సనల్ ఆఫీసర్‌గా తాత్కాలిక ప్రాతిపదికపైన ఉద్యోగం చేస్తున్న ఉష అంతర్జాతీయంగా ఎన్నో విజయాలు సాధించినప్పటికీ బీజింగ్‌లో బంగారుపతకాన్ని పొందలేకపోయానని వాపోవటంలో అతిశయోక్తి లేదేమో!

100 మీ., 200 మీ., 400 మీ. హార్డిల్స్‌లలో జాతీయ రికార్డులను, 400 మీ. హార్డిల్స్, 400 మీ.లలో ఆసియా రికార్డులను పరుగులరాణి సాధించింది

1982 నుంచి ఎనిమిది సంవత్సరాల పాటు దేశానికి నేను చేయగలిగినంత సేవ చేశాను అందుకు నేనెంతో ఆనందిస్తున్నాను" అని ఆమె ఎంతో సంతోషంగా తెలియ జేశారు.

బహుశా త్వరలో ఆమె వైవాహిక జీవితానికి దగ్గరవ్వాలనుకున్నారేమో! అందుకే ఈ నిర్ణయం తీసుకొని వుంటారు పెండ్లి ప్రస్తావన తీసుకు వచ్చినప్పుడు ఆమె అటువంటిదేమీ లేదని అనలేదంటే పెండ్లి ఖాయమైపోయిందని అనేక మంది భావిస్తున్నారు. ఏది ఏమైనా ఇన్నేళ్ళు అథ్లెటిక్స్‌లో ఎదురు లేకుండా నిలిచిన పరుగుల రాణి నిష్క్రమణ ఎంతైనా దేశానికి నష్టమనే భావించాలి

– తిలక్

# కరతలామలకం

**ఆర్. సుధేష్ణ**

ఎరైవింగ్ నేషనల్ ఎయిర్‌పోర్టు బైపానామ్, ఫ్లైట్ నంబరు 552-సాటర్‌డే 6-30 రిసీవ్.-
రిగార్డ్స్-రఘువీర్ (పి.జె.)

కేబుల్‌ని చదివాక ఏమీ అర్థం కాలేదు శిరీషకి. తనకు తెలిసిన రఘువీర్ ఎవ్వరూ లేరే! అనిల్‌కి తెలిసిన వాళ్లేమో-సాయంత్రము ఆఫీసు నుండి అనిల్ రాగానే కేబుల్ అందించింది. అది చదువుకున్న అనిల్ ముఖంలో సంతోషం వెలుగుతోంది.

"ఓర్నీ! రఘు వస్తున్నాడు" గావుకేక వేసిన ధోరణిలో గట్టిగా అన్నాడు.

"నీల్! ఎవరే? రఘువీర్? ఎవ్వడు ఆ పేరు మెన్షను చేసినట్లు గుర్తులేదే!"

"రఘు నా క్లాసుమేట్, ఇంజనీరింగు కాలేజీలో కొంత మందిమి గ్రూపులా తిరిగే వాళ్లమని చెప్పేవాణ్ణి కదా! వీడు కొన్ని యాక్టివిటీస్‌లో మా గ్రూపుతో కలిసి పోయేవాడు. ఇక్కడి కొచ్చాక టచ్ పోయింది. అప్పుడో ఇప్పుడో వీడి న్యూస్ చెవిన పడ్తుంది. అంతే. లండన్‌లో ఏదో కంపెనీలో పని చేస్తున్నాడని ఆ మధ్య విన్నాను. కరెస్పాండెన్సు బొత్తిగా తగ్గిపోయి కనెక్షన్సు తెగిపోయినయ్. హి ఈజ్ ఎ నైస్ గై."

ఆనందముగా గబగబా చెప్తూనే డ్రెస్ చేసుకుని కాఫీ కోసం వంటింట్లోకి నడిచాడు.

"పి.జె. అంటేమి ఇనీషల్సా?"

శిరీష ప్రశ్నకు అనిల్ మొహంలో ఎక్స్‌ప్రెషన్ మారింది.

"పి.జె. అంటే ప్రాక్టికల్ జోకర్ అని, నీకోసారి చెప్పానుకుంటాను. మా క్లాసులో ఒక ప్రాక్టికల్ జోక్స్ చేసే వాడొకడుండేవాడని-వాడే వీడు."

టక్కున టాపిక్ మార్చేసి-

"ఈరోజు అఖిల్‌దేశ్‌పాండే వాళ్లింట్లో డిన్నరుంది కదూ! ఫ్రైడే పార్టీలకి వెళ్ళాలంటే టయర్డ్‌గా ఉంటుంది. నువ్వెళ్లి రడీ అవ్వు-నీకు చాలా టైం పడ్తుంది."

"నేను పది నిముషాల్లో రడీ అవుతాను. కాఫీకానిచ్చి మీరు కూడా లేవండి."

శిరీష అన్నట్లుగానే పది నిమిషాల్లో రడీ అయివచ్చింది.

*** *** *** ***

అఖిల్‌దేశ్‌పాండే ఇంటి ముందు కార్లు చూసి చాలా పెద్ద పార్టీ అని తెలుసుకున్నారు. ఆయన భార్య అనిత సాదరంగా లోనికి తీసుకెళ్లింది. ఆవిడ ఓపికకే మెచ్చుకోవాలి. ఎప్పుడు పార్టీ ఇచ్చినా నాలుగు పదులకు తక్కువ పిలవదు. ప్రతి సారి స్పెషల్‌గానే అనిపిస్తుంది. డ్రింకు ఇచ్చి ఆ ప్రక్కనే ఉన్న ఆర్డర్వ్సును అందిచ్చింది. వంటకాలు చేయడమే కాదు - వాటిని అందంగా ప్లేట్లల్లో అమర్చడం - టేబుల్‌ని కూరగాయలు, పళ్లతో అలంకరించడంలో ఆమెకి ఆమె సాటి. వాషింగ్టన్‌లో ఎవరింట్లోను అంత ఆహ్లాదకరంగా ఉండదు.

'మీరు ఎంజాయ్ చేయండి - నేను పది నిమిషాల్లో వచ్చి జాయినవుతాను' అంటూ అనితగారు మరో వైపు వెళ్లారు. అందరూ గుంపులు గుంపులుగా కూర్చుని కబుర్లు చెప్పకుంటున్నారు. అనిల్, శిరీష అందరినీ ఒకసారి పలకరించారు. లేడీసు అందరూ ఒకవైపు కూర్చున్నారు. శిరీష అనిల్ వైపు చూసి అటు వెళ్తానన్నట్లు కళ్లతో చెప్పేసింది. ఓ.కె. అన్నట్లుగా చూసి మెయిన్ గ్రూపు వైపు నడిచాడు. ఆ ప్రక్కనే ఉన్న రూములో పేకాట జోరులో సిగరెట్లు ఊదేస్తూ, విస్కీ గ్లాసులు లేపేస్తున్నారు కొంత మంది. బారు ప్రక్కనే కూర్చుని పొలిటిక్స్‌కి పాలిష్ పెట్టాలని ట్రై చేస్తున్న పదవుల్లేని నాయకులతో కలిసిపోయి పొలిటిక్కింగుకి, హార్స్ ట్రేడింగ్‌కి కో-ఆర్డినేట్ చేయాలని చూస్తున్నాడు అనిల్.

శిరీష స్త్రీల దగ్గరకు నడిచింది. జనానా టాకుల తళుకులతో మెరిసిపోతూ కలిసిపోయింది.

*** *** *** ***

మధ్యరాత్రి 12.30 గంటలకు పార్టీ లోంచి కారులో కొచ్చారు అనిల్, శిరీష. విందు భోజనంతో కడుపు నింకిపోయింది. రకరకాల మాటలతో మనసు నిండిపోయింది. క్వయిట్‌గా కారు నడుపుతున్న అనిల్‌తో-

"నీల్! రేపు మీ ఫ్రెండ్‌ని పికప్ చేయడానికి ఎయిర్‌పోర్టు కెళ్లాలి కదూ!"

ఏదో మాట్లాడాలనిపించింది శిరీషకి.

"యస్" అన్నాడు ముక్తసరిగా.

ఇంజనీరింగ్ కాలేజీ రోజులంటే అనిల్‌కి చాలా ఇష్టమైన రోజులని శిరీషకి తెలుసు. కాలేజి కబుర్లు ఎంతో ఉత్సాహంగా చెబుతాడు. రఘువీర్ వస్తున్నాడంటే కాలేజీ కబుర్లకి అంతుండదు అనుకున్న శిరీషకి నిరాశే కల్గింది.

*** *** *** ***

శనివారం ఉదయం బ్రేక్‌ఫాస్టు చేస్తూ అనిల్ రఘువీర్ హాబీస్, హాబిట్స్ గురించి చెప్పడం మొదలుపెట్టాడు. అప్పుడు అనిల్‌లోని మార్పుకు అర్థం అయ్యింది.

రీజన్ చాలా సింపుల్. కాలేజీ రోజుల్లో, రఘు ప్రాక్టికల్ జోక్స్‌కి టార్గెట్ అయిన వాళ్లలో అనిల్ ఒకడు. హి హేట్స్ దట్.

"రఘువీర్ చాలా మంచి మనిషి లాగున్నాడు" శిరీష అనిల్‌ని ఉడికించాలని చూసింది.

"వెల్-" నసిగాడు.



"మంచివాడేననుకో కాని...ఎదుటివాళ్ల ఫీలింగ్సుని ఏమీ పట్టించుకోకుండా జోక్సు చేయడం వాడిలోని బ్యాడ్ హేబిట్. అందుకు నేనెప్పుడూ క్షమించలేదు వాణ్ణి." తనని ఫూల్ చేశాడన్న ఉక్రోషం ఫ్రెష్‌గా మొహంలో కనిపిస్తోంది.

"అలాంటి వాళ్లుంటే డల్ మూమెంటు అంటూ ఉండదు. మనకి బావుంటుంది."

"యస్" ఆలోచిస్తూ అన్నాడు.

కాలేజీ కబుర్లన్నీ మాట్లాడుకోవచ్చు. శిరీష ముందు కూడ తనని ఫూల్ చేస్తే-అయినా ఇంకా అదే పాటర్న్ ఉండదులే. మనసులోని సీక్రెట్ చేంబర్ ఒక విధమైన ఆరాటం విస్పర్ చేస్తోంది.

*** *** *** ***

వంటగదిలో కెళ్లాడు అనిల్. రుబ్బిన ఇడ్లీ పిండిని బ్లెండర్‌లోంచి తీస్తూ ఏమిటన్నట్లు చూసింది.

"ఒకసారి కాలేజీలో ఏమయిందో చెప్పనా!"

"చెప్పండి" పని చేస్తూనే అడిగింది.

"మా క్లాసులో అందరికంటె చాలా అందంగా ఉండే ఒక అమ్మాయి-ఒకనాడు సడన్‌గా నాతో మాట్లాడింది."

"అలాగా"

"విను. . అన్ బిలీవబుల్ స్టోరీ-నెమ్మదిగా మాట్లాడుతూ నన్ను కిస్ చేయమని అడిగింది" శిరీష వైపు వీడునిలా చూస్తూ చెప్పాడు.

చేసే పని ఆపకుండానే "చేసావా?" అంది.

"లేదు."

"ఎందుకు?"

"అదంతే. .అందరిని చేయాలనుండదు"

"ఆ వయస్సులో ఉంటుందేమో"

"ఆ క్షణంలో నాకు లేకుండింది"

విపరీతమైన తెలివితేటలు ఇలాంటివి



చెప్పే సందర్భాలలో ఉంటుంది అనుకున్న శిరీష.

-"ఏసీ" అని మాత్రమే పైకి అంది.

"ఆ తర్వాత ఆ అమ్మాయి నాక్కనిపించకుండా జాగ్రత్తపడేది."

"ఎందుకని ఆ క్షణంలో చేయనిది ఆ తర్వాత చేసారా?"

"ఉ...ఊ.. అడిగినట్లు చేయలేదనికోపం" రీషది మొద్దు బుర్ర అనుకున్నాడు

"స్వంత డబ్బాగారు-వంట గదిలోంచి బయటకెళ్లండి-మీ గొప్పలు నాకు ఊపిరాడనివ్వడం లేదు."

"వెళ్తాలే, ఎయిర్‌పోర్ట్‌కి టైమయింది. ఒక మాట విను-రఘు కాలేజీలో చేసిన ట్రిక్కులు, టెక్కులు చెబితే అన్నీ నమ్మేవు-వాడి మాటల్లో డెబ్బె శాతం దులిపెయ్యాలి-ముఖ్యం ఇది- రఘుకి నాన్ వెజ్ చాలా ఇష్టం-అదేదో చూడు."

"నాన్ వెజ్ జోక్సా లేక నాన్ వెజ్ ఫుడా ఏది ఇష్టం?"

"జోక్స్ వ్యవహారం నీకు బాగా వంటపట్టిందే! నా ఉద్దేశ్యం నాన్ వెజ్ ఫుడ్ -కోడి చెయ్యి" అంటూనే క్లాజెట్‌లోంచి జాకెట్ తీసుకొని వెళ్లిపోయాడు.

వంట చేస్తూ రకరకాల ఆలోచనలతో క్లీనింగ్, గెస్టురూము రడీ చేయడంలాంటివి చేసేసింది.

*** *** *** ***

"రీషా! ఈ శాల్తీయే రఘువీర్-

## కరతలామలకం

రఘూ-మీట్ మై లైఫ్ పార్ట్‌నర్"- అంటూ అనిల్ రఘు లగేజ్‌ని గెస్టు రూములోకి చేరేశాడు.

"ఎలా ఉంది లైఫ్ ఇక్కడ?"

పలకరింపులయ్యాక సోఫాలో రిలాక్స్‌డ్‌గా కూర్చున్న రఘువీర్ అడిగాడు అనిల్‌ని.

"లైఫ్‌కేం-బ్రహ్మాండం-నేను హాపీగా ఉన్నాను. జాబ్ కూడా బాగుంది."

"ఎక్కడ జాబ్ చేస్తున్నావు?"

"నాసాలో"

ఇంతలో "మీరు కాఫీ, టీ ఏది తీసుకుంటారు?"

వేడి వేడి ఉల్లిపాయ పకోడీలు టేబులుపై పెడ్తూ అడిగింది రీషా.

"టీ తీసుకుంటాను"

"నో...నో. .టీ వద్దు-మాంచి డ్రింకు కలుపుతానుండు"

"ఇప్పుడు వద్దులేరా"

"దిసీజ్ హాపీ అకేషన్-కమాన్ - ఇన్నేళ్ల తర్వాత కలుసుకున్నాం"

ఆ ప్రక్కనే ఉన్న కిచెన్‌లో కెళ్లి స్ట్రాబెర్రిడాకరీ కలిపి తెచ్చి ఒకటి రఘుకిచ్చి మరోటి టేబులు మీద పెట్టి...

"రీషా-నీకేమి కావాలి? వైట్ వైన్ ఇవ్వనా?"

"నో-కోక్ ఇవ్వండి"

"చీర్స్" అంటూ ముగ్గురూ సిప్ తీసుకున్నారు. "బార్ టెండరుని కూడా అయ్యావన్న మాట, వెరీగుడ్ బావుంది రా డ్రింకు" అంటూ రఘు మరో సిప్ తీసుకున్నాడు.

అలా కబుర్లతో కాలం కదులుతోంది. భోజనాలు చేసారు. ఇంకా కబుర్లు సాగుతూనే ఉన్నాయి. కాలేజీ ఫ్రెండ్స్ అనగానే మనసు ఉరకలు వేస్తుంది.

ఎందు కనుకున్నారూ....ఆనాటి మూవీలు....టాకీలు, షోకీలు, నారీలు, సీక్రెట్ కిస్ బెట్స్ ఎట్‌సెట్‌రా ఎట్‌సెట్రా గురించి, ఆ రోజుల్లో ఉండే ఫీలింగ్సు మాట్లాడుకుని మనసుకు పట్టిన వయస్సులోంచి ఓ పదేళ్ళు ఈజీగా దులిపెయ్యవచ్చని ఆశ. వాళ్ళ కబుర్లు వింటున్న రీషకి అంతా తెలుస్తోంది.

రఘువీర్‌కి ఇంకా పెళ్లి కాలేదు (క్లాసులో అందరికంటే అందమయిన అమ్మాయి వచ్చి 'నన్ను కిస్ చేయవా?' అని అనిల్‌ని అడిగినట్లే ఈయన్ని ఎవరూ అడగలేదా!) మనసులో నవ్వుకుంది.

బొంబాయిలో ఉద్యోగం చేస్తున్నపుడు "లోరి"తో ఫ్రెండ్ షిప్ ప్రేమగా మారిందట. ఆ అందమైన లోరి వచ్చి "నన్ను కిస్ చేయవా!" అని రఘుని అడగ్గానే వెంటనే కిస్ చేసాడు గాబోలు. ఆ తర్వాత అది ఘాటైన ప్రేమగా మారి రేర్‌కేసు లాగ పెళ్లిలోకి త్వరలో దింపేస్తోంది. హౌ రొమాంటిక్! అనుకుంది శిరీష.

వాళ్ల మాటలు ఆగేట్టు లేవు. వాళ్లిద్దరికి గుడ్‌నైట్ చెప్పి వెళ్లిపడుకుంది. తను, నీల్ కలిసి రఘు మీద జోక్ చేస్తేనో-శిరీష ఆలోచన.

"నేనిక్కడ ఒక 6 డేస్ ఉందామనుకుంటున్నాను. అదీ నీకభ్యంతరం లేకపోతేనే- ఆ తర్వాత లోరీ వస్తుంది. తనకు మేరీలాండు యూనివర్శిటీలో లెక్చరు ఉంది. ఆ తర్వాత ఫ్లోరిడా వెళ్లి నా మీటింగ్స్ ఎటెండు చేస్తాము."

"డోంట్ బి సిల్లీ - నా కభ్యంతరమేమిటి! యూ ఆర్ మోస్ట్ వెల్‌కమ్- లోరీ కూడా ఇక్కడే ఉంటుంది. చాలా రోజుల తర్వాత కలిసామని సంతోషంగా ఉంది నాకు" అంటూ అనిల్ లేచి నిల్చున్నాడు.

"జర్నీతో అలసిపోయుంటావు-రెస్టు

తీసుకో. ఏదైనా కావాలంటే అడుగు ఫీల్ ఫ్రీ"

*** *** *** ***

ఉదయం శిరీష కిచెన్‌లో బ్రేక్‌ఫాస్టు ప్రిపేరు చేసే హడావుడిలో ఉంది.

"గుడ్‌మార్నింగ్" అంటూ న్యూస్ పేపరు తీసుకున్నాడు రఘువీర్.

"గుడ్‌మార్నింగ్...కాఫీతీసుకుంటారా? టీ తీసుకుంటారా? లేక బ్రేక్‌ఫాస్టు తిని కాఫీ తీసుకుంటారా?"

"ఇంత పొద్దున్నే మీరేమీ చేయకండి. కాఫీ చేయడమంటే నాకు చాలా ఇష్టం. సరంజామ ఎక్కడుందో చెప్పండి."

"ఓ.కె. ఇదిగో చాలా కాఫీ, షుగర్, క్రీమ్ ఇక్కడున్నాయి. సరదాగా కబుర్లు చెబుతూ కాఫీ చేసాడు, అంతలో అనిల్ వచ్చి జాయినయ్యాడు."

ఆరోజు ముగ్గురూ వాషింగ్టన్ సిటీ చూసారు. రఘువీర్ నవ్వుతూ నవ్విస్తూ ఉంటాడు.

"అమెరికాలో గాలి కూడా చాలా రిచ్‌గా ఉందేమోయ్" అంటాడు చల్లగాలికి కాస్త షివరవుతూ.

రెండో రోజూ "బ్యాక్ టు ద ఫ్యూచర్" సినిమాకి వెళ్లారు. అనిల్‌కి ఎక్కువ సెలవులు లేనందున ఎటైనా వెళ్లాలనుకుంటే రిష తీసికెళ్తుందని తను ఆఫీసు కెళ్లాడు. రఘువీర్ తనకు తెలిసిన ఫ్రెండ్స్‌ను కలవాలని మెట్రోలో వెళ్లాడు. చాలా లేటుగా వచ్చిన రఘువీర్ క్వయిట్‌గా రూములో కెళ్లి పడుకున్నాడు. అనిల్ ఆఫీసు నుండి రాగానే వెళ్ళి పలకరించాడు. ఉదాసీనంగా ఉన్నా ఏదో మాట్లాడ ప్రయత్నం చేస్తున్నాడు రఘు అని తెలుస్తోంది. భోజనం కూడా చాలా కొంచెం తిన్నాడు. రఘువీర్ కాస్త ముభావంగానే ఉన్నారు. మాట్లాడుతున్నాడు కాని పరధ్యానం కనిపిస్తోంది. ఏమయ్యింటుందా! అని అనిల్, శిరీష ఆలోచనల్లో పడ్డారు.

"డైరెక్టుగా 'ఏం సంగతి' అని అడగండి" అని మరీ చెప్పింది శిరీష

"ఏం జోకు చేయాలా-అని ఆలోచిస్తున్నాడేమో!"

"సీల్! నీ భయం నీది. అయినా కాలేజి డేస్ వేరు-ఇప్పుడు పెద్ద తరహాగా ఉన్నాడు"

"పాస్ట్ ఎక్స్‌పీరియన్స్‌తో అలా ధింకు చేసాను గాని-రఘులో చాలా మార్పు వచ్చింది"

అనిల్ ఆఫీసు కెళ్లి వస్తున్నాడు. రఘువీర్ ఫ్రెండ్స్ దగ్గరకెళ్లి వస్తున్నాడు. రెండు రోజులు గడిచాయి. ఆ రోజు అనిల్ ఆఫీసు నుండి వచ్చాడు. రఘువీర్ ఇంకా రాలేదు. కాస్త లేటవుతుంది. ఎదురు చూడ వద్దని చెప్పాడు. భోజనాలు ముగించి టి.వి ముందు కూర్చున్నారు దంపతులు. అంతలో ఫోను మ్రోగింది అనిల్ ప్రక్కనే ఉన్న కార్డ్‌లెస్ ఫోను అందుకుని-

"హల్లో" అన్నాడు.

"హల్లో! నేను డాక్టరు మల్హోత్రాని. రఘువీర్ ఉన్నారా?"

"రఘువీర్ లేరండి. నేను అనిల్‌ని. రఘువీర్‌కు ఏమైనా చెప్పమంటారా?"

"నా ఫ్రెండ్ రెఫర్ చేస్తే రఘువీర్ నా దగ్గరకు వచ్చాడు. అన్‌కాలజి నా స్పెషాలిటీ. రఘువీర్ టెస్ట్ రిజల్ట్సు వచ్చాయి. వాటి గురించే మాట్లాడాలని చేసాను."

అన్‌కాలజీయా! రఘు వెళ్తున్నట్లు కూడా చెప్పలేదే. లోలోనే ఆశ్చర్యపోయాడు. అడగకుండా ఉండలేకపోయాడు.

"డాక్టర్ మల్హోత్రా-ఎవరి టెస్టు రిజల్ట్సు గురించి అంటున్నారు?"

"రఘువీరివి"

"నేను రఘువీర్‌కి క్లాసుమేట్‌ని, ఫ్రెండ్‌ని, వెల్‌విషర్‌ని-రఘుకి ఏమైంది - రిజల్ట్సేమిటి డీటెయిల్డ్‌గా చెప్పండి?" ఆవేదనగా అడిగాడు.

"ఇది మీతో చెప్పాలో-వద్దో...."

"ఫర్వాలేదు చెప్పండి. రఘు నా దగ్గరే ఉంటున్నాడు. రాగానే చెప్తాను. చెప్పండి" ఆత్రుత.

"ఓ.కె. సాడ్ న్యూస్ ఈజ్ - రఘుకి లివర్ కాన్సరుంది. లేటర్ స్టేజ్‌లో ఉంది"

"వ్వాట్! నేను నమ్మను" అనిల్ గట్టిగా ఫోనులో అరిచాడు

"నాకు నమ్మాలని ఉంటుందా! ముందుగా బై ఆప్సీ చేసారు. ఆ తర్వాతే నా దగ్గరకు పంపారు. నేను కాట్ స్కాన్ కూడా చేసాను. ట్రాన్స్‌ప్లాంట్ చేసే టైము కూడా లేదు. ఆరు నెలలకంటే ఎక్కువ టైము ఉందని నేననుకోను. మిమ్మల్ని మీరు సమాధానవర్చుకొని మీ ఫ్రెండ్‌కు హెల్ప్ చేయండి. రఘువీర్ రాగానే ఫోను చేయమనండి. ఉంటా మరి"

చేతిలో ఫోనుతో స్థాణువైన అనిల్‌ను చూసి "ఏమైంది? ఏమిటలా వున్నావు?" భుజం తట్టింది శిరీష

"రిషా! ఇది విన్నావా! ఎంత అన్యాయం-వెరీ అన్‌ఫెయిర్"

"ఏమయింది?" ప్రశ్నలోనే భయాందోళనలు ఇమిడి ఉన్నాయి.

## యాంగ్రీ 'ఓల్డ్‌మాన్'



**17** సంవత్సరాలుగా హిందీ చిత్రరంగంలో హీరోగా వుంటున్న అమితాబ్ బచ్చన్ ముందు ముందు అంత హుషారుగా కుర్రాడిలాగా నటించలేనని అంటున్నాడు. ఈ వయసులో యింకా హీరోలాగా నటించలేనని రొమాన్సు, పాటలు లేని పాత్రలే యిక ముందు పోషిస్తానని చెప్తున్నాడు. అందుకు నిర్మాతలు కూడా గ్రీన్ సిగ్నల్ యిచ్చారు. 'అగ్నిపథ్'లో నటించిన మాదిరి యాంగ్రీ ఓల్డ్‌మాన్ పాత్రలే తనకు నప్పుతాయని, యికనుంచి యాంగ్రీ యంగ్ మాన్ పాత్రలు పోషించాలని లేదని బచ్చన్ అభిప్రాయపడుతున్నాడు.

"రఘు.....రఘుకి లివర్ కాన్సరట... ఆరు నెలల కంటె ఎక్కువ బ్రతకడట" గాద్గదికంగా అన్నాడు.

"అన్ బిలీవబుల్"

"నేను అదే అన్నాను మొదట. డాక్టర్ మల్హోత్రాట. ఈ వార్తను రఘుతో చెప్పడానికి చేసాడు చెప్పమని పదే పదే అడిగితే చెప్పాడు. అందరికి చెప్పడం రఘుకి ఇష్టం లేదు కాబోలు."

"మొన్న కాస్త కడుపులో నొప్పిగా ఉందన్నాడు. ఆరోజే వామిట్ కూడా చేసుకున్నాడు. తన స్టమక్ కొంచెం బాగాలేదు-ఫర్వాలేదు-ఒక పూటలా ఉంటే వెయిట్ తగ్గుతాను-కడుపూ బాగువడ్తుంది అని అంటే నేను పెద్దగా పట్టించుకోలేదు" ఆశ్చర్యంగా పజిల్ పీసెస్ అన్నీ ఒక చోట చేర్చే ధోరణిలో అంది శిరీష

"రీషా! ఇప్పుడేం చేద్దాం! మనకి తెలిసినట్లు చెప్పకుండ-ఇక్కడున్నన్ని రోజులు హాయిగా ఉండేట్లు చేద్దాం."

"తప్పకుండా-బాధగా ఉంది అంత మంచి మనిషికి జీవితం ఇంత చిన్నదా?"

మరునాడు అనిల్ సెలవు పెట్టాడు. ముగ్గురూ జాలీగా గడిపారు.

*** *** *** ***

ఆరోజు లోరి వస్తున్నట్లు కేబుల్ వచ్చింది. రఘు, అనిల్ వెళ్లి నేషనల్ ఎయిర్‌పోర్ట్ నుండి లోరిని పికప్ చేసుకొచ్చారు.

"లోరీ అలాగే అందంగా ఉంది" అనుకున్నాడు అనిల్.

'అందంగా బావుంది' అనుకుంది శిరీష. అందరూ సరదాగా కబుర్లు చెప్పకున్నారు. లేడీస్, మెన్‌ని టీజ్ చేయడం, మెన్ లేడీస్‌ను టీజ్ చేయడం కాలం చక చకా గడిచిపోయింది. ఆ తర్వాత లోరి హాలిడే ఇన్‌లో రూము బుక్ చేసుకున్నానని వెళతానంది. మరుసటి రోజుకు ప్రిపేర్ అవ్వాలని అనడం మూలాన అనిల్, రఘు వెళ్లి దింపి వచ్చారు. యూనివర్శిటీకి ప్రక్కనే హోటలు ఉంది గాబట్టి ఇబ్బంది ఉండదు.

మరునాడు రఘు, అనిల్ టి.వి. చూస్తున్నారు. అనిల్ మనసును తొలిచేస్తున్న సంగతిని ఇక మనసులో ఉంచుకోలేకపోయాడు.

"రఘు, నీతో ఒక విషయం మాట్లాడాలి."

"ష్యూర్"

"డాక్టర్ మల్హోత్రాట ఫోన్ చేసాడు నీకోసం-ఎందుకె, నీ హెల్త్ గురించి తెలిసింది ఐయామ్ వెరిసారీ-నేనేం చెయ్యాలో చెప్పు చేస్తాను"

"ఓకె-ఓకె. ఏమి ప్రోబ్లం" జాలీగా అని వెంటనే సీరియస్‌గా

"థాంక్స్.. నువ్వు నాకు చాలా మంచి ఫ్రెండ్‌వి. అందుకే ఇంత ఫ్రీగా, ఇన్ని రోజులు ఉండి ఎంజాయ్ చేస్తున్నాను. ఒక్కటే నన్ను బాధించేది. లోరికి ఈ విషయం తెలీదు. ఎలా చెప్పాలో - చెప్తే ఎలా రియాక్టవుతుందో అని భయంగా ఉంది. కాని చెప్పాలి" సాడ్‌గా అన్నాడు

నెక్స్‌ట్ డే రఘు కూడా హాలిడే ఇన్‌కి వెళ్లి ఉన్నాడు. అనిల్‌కి ఆఫీసులో ఉన్నా మనసు నిలకడగా లేదు. ఈ విషాద వార్తను రఘు లోరికి చెప్పాడా? ఇన్నాళ్లు వెయిట్ చేసి ఇప్పుడు పెళ్లి చేసుకోవాలనుకున్న వాళ్లకి తెలియాల్సిన వార్త ఇదా!

## కరతలామలకం



### లిజీ పెండ్లి

నటీనటులు చిత్రరంగంలోకి ప్రవేశించిన వెంటనే గృహస్థులవ్వటం చాలా అరుదుగా జరిగే విషయం. ఇటీవలే చిత్ర రంగంలోకి ప్రవేశించిన సినీనటి లిజి త్వరలో ఒక యింటిదవుతోంది. మళయాళ చిత్రరంగంలో దర్శకుడిగా పేరు పొందిన ప్రియదర్శన్‌ను పెండ్లాడబోతోంది లిజి. దోషి- నిర్దోషి చిత్రంలో లిజి- సుమన్‌సరసన నటిస్తోంది. లిజి-ప్రియదర్శన్‌ల వివాహం డిసెంబర్ 13న బెంగుళూరులో జరుగుతోంది.

అప్పుడే రఘు అనిల్‌కి ఫోన్ చేసాడు.

"అనిల్ - నీ హెల్ప్ కావాలిరా"

"ష్యూర్-ఏమిటి"

"లోరి చాలా అప్‌సెట్‌గా ఉంది. నాకేం చెయ్యాలో తోచడం లేదు నువ్వు ఆఫీసు నుండి కాస్త త్వరగా రాగలిగితే సరే, లేదా-వీలుచూసుకుని రూముకు రా-నువ్వు కాస్త మాట్లాడు.. నాకు మనస్సు బాగా లేక ఓదార్చలేను.. ఏమీ చెప్పలేను"

"ఒక గంట తర్వాత రాగలను"

"సరే-నేనలా కాసేపు బయట కెళతాను-రూము అన్‌లాక్ చేసి పెడ్తాలే-నువ్వురా-లోరీ కాస్త సమాధానపడితేగాని నేనేమీ చెప్పలేను. నాకు డిప్రెస్‌గా ఉంది" చాలా విచారంగా వినిపించాడు

గబ గబా పనులు ముగించుకొని, పర్మిషన్ తీసుకొని శిరీషకు ఫోన్ చేసాడు ఇంట్లో లేనట్లుంది అనిల్ ఆఫీస్ నుండి హాలిడే ఇన్ కెళ్లాడు రూమ్ 412 డోరు అన్‌లాక్ ఉంది అయినా నాక్ చేసాడు-రెండు నిమిషాలాగి లోనికి వెళ్లాడు. లోరీ బెడ్ మీద అటువైపు తిరిగి పడుకుంది. ఏడుస్తున్నట్లు తెలుస్తోంది. జాలేసింది అనిల్‌కి.

"లోరి" నెమ్మదిగా పిలిచాడు.

ఇటు తిరిగి వెంటనే లేచి కూర్చుని కళ్లు తుడుచుకుంటూ-

"రండి-కూర్చోండి" మాటలకంటే ఏడుపు ఎక్కువ వినిపించింది

ప్రక్కనే ఉన్న కుర్చీలో కూర్చున్నాడు

"లోరి...ఐయామ్ సారీ...వెరీసారీ. ఇలా నువ్వు బాధపడ్తూ ఉంటే ఉన్న కొంచెం టైము కూడా వేస్టవుతుంది నువ్వు కాస్త ధైర్యం తెచ్చుకోవాలి. రఘుని హాప్పీగా ఉండేట్లు చేయాలి. ఫోన్ చేసినపుడు రఘు చాలా సాడ్‌గా వినిపించాడు. నీ గురించి వర్రీ అవుతున్నాడు..."

ఉప్పెనలా వచ్చిన దుఃఖాన్ని అపుకోలేక దిండుపై వాలి వెక్కి వెక్కి ఏడ్చేస్తోంది. ఏం చేయాలో తెలియక బాధను మింగుతూ కాసేపలాగే కూర్చున్నాడు.

"లోరి - ప్లీజ్ ట్రై టు బి బ్రేవ్"

లోరి ఏడుపు ఇంకా ఎక్కువయింది. ఆ ప్రక్కనే డ్రెస్సింగు టేబుల్‌పై నున్న టిష్యూ బాక్స్ అందుకుని లోరికిచ్చాడు.

లోరి కళ్లు తుడుచుకుంటూ గాద్గదికంగా

"అనిల్...ఇది అన్యాయం" అంటూనే మళ్లీ ఏడుస్తోంది. అనిల్ ఆ బాధను చూడలేకపోతున్నాడు లేచి వెళ్లి ఆమె ప్రక్కగా కూర్చుని భుజం తట్టి.

"లోరీ-నువ్వు రఘుని గాఢంగా ప్రేమిస్తున్నావు. కాస్త ఆలోచించు అతన్ని సంతోషపెట్టడానికి ట్రై చేయాలి. " గాద్గదమైన గొంతును కుదుటపర్చుకుని మళ్లీ చెప్పాడు అనిల్.

"నువ్విలా దిగులుపడ్తూంటే - రఘు మరీ దిగులుపడతాడు. నిన్నిలా చూడలేక తన బాధను దాచుకోవడానికి బయటకెళ్లాడు చూడు ధైర్యం తెచ్చుకో " అనిల్ కళ్లకు నీళ్లొచ్చాయి.

లోరీ ఒక్కసారి బావురుమంది అనిల్ ఆమె భుజాలపై చేతులు వేసి ఓదార్చాలని ప్రయత్నిస్తున్నాడు ఆమె దుఃఖం ఆగడం లేదు అనిల్‌కి ఎలా చెప్పాలో తెలీడం లేదు అంతలో గభాలున తలుపు తెరుచుకోవడమే కాదు శిరీష గదిలోకొచ్చి ఆశ్చర్యంగా అనిల్‌ని, లోరిని చూస్తూ క్షణం రెప్పవేయకుండా నిలబడింది ఆ తర్వాత గిరుక్కున తిరిగి వచ్చినంత వేగంగా వెళ్లిపోయింది. ఏమయింది-అనే ఆలోచనా శక్తి కల్గడానికి అనిల్‌కి కొన్ని నిమిషాలు పట్టింది. వెంటనే లేచి నిలబడ్డాడు-

"ఓ మై గాడ్-రీషా" నీరసంగా అనుకున్నాడు. లోరీ కాస్త నెమ్మదయింది జరిగిన సంఘటన రక్తాన్ని పీల్చేసి అనిల్ మొహాన్ని పారిపోయేట్టు చేసింది. అప్పుడే రఘు గదిలో కొచ్చాడు.

"ఏమయింది అనిల్-శిరీష చాలా అప్‌సెట్‌గా వెళ్తోంది. పలకరించబోతే విసురుగా వెళ్లిపోయింది. నువ్వెళ్లి చూసుకో నా మూలంగా ఇబ్బంది కల్గిందా? నువ్వు ముందు ఇంటికెళ్లు."

ఏమీ మాట్లాడకుండా ఇద్దరి వైపు ఒకసారి చూసి.

"టేక్ కేర్" అంటూ వచ్చేసాడు.

*** *** *** ***

తలుపు తీసుకుని నెమ్మదిగా లోనికెళ్లాడు. నిశ్శబ్దంగా ఉంది కిచెన్‌లో లైటు తప్ప ఎక్కడా లైటు వేసి లేదు. మంచి మసాల వాసన వస్తోంది. డైనింగ్ టేబుల్ మీద వేజ్‌లో పువ్వులున్నాయి. ఇదంతా లోరి దగ్గరకు వచ్చే ముందుగానే చేసినట్లుంది. బెడ్‌రూములో కెళ్లాడు చీకటి-నైట్ లైట్ మాత్రమే మసక వెలుతురునిస్తోంది. రీష పడుకుని ఉంది. అనిల్ దగ్గరగా వెళ్లి కూర్చున్నాడు కాస్త శక్తిని పుంజుకుని-

"నా మాట కొంచెం విను-అప్‌సెట్ అవకు లోరీ చాలా దిగులుగా ఉంది - నువ్వు కాస్త చెప్పు! తనని చూస్తే నాకేం చేయాలో తోచడం లేదు!" అని రఘు అంటే వెళ్లాను అంత విషాద వార్త కదా! పెళ్లి చేసుకోబోతున్న వాళ్లకి ఇలాంటి వార్త గుండె పోటులాంటిది లోరీ అంతలా ఏడుస్తుంటే నాకెలా ఓదార్చాలో తేలీలేదు. లోరిని చూస్తే జాలేసింది "

శిరీషలో కదలిక లేదు నిస్సహాయంగా అనిల్-

"నన్నర్థం చేసుకో-నేనక్కడికి వెళ్లే ముందు నీకు ఫోను చేసాను కాని నువ్వింట్లో లేవు..రీషా! లే.. ఇటు తిరుగు ."

నెమ్మదిగా లేచి శిరీష మంచం మీద నుండి దిగి ఫామిలీ రూమ్‌లోకెళ్లింది. అర్థం అయీ-కాక ఆమె వెనకె వెళ్లాడు

"రీషా!" ఎంతో ప్రేమగా పిలిచాడు. గిరుక్కున వెనక్కి తిరిగింది. తిరగడం -వెంటనే-నవ్వు ఉప్పెనలా రావడం - అది చూసి అనిల్-భావాలు లేని బొమ్మలా నించున్నాడు. ఊపిరాడుతోంది - కళ్లు శిరీషను చూస్తున్నాయి. శిరీష నవ్వుతోంది పగలబడి నవ్వుతోంది - పిచ్చిదానిలా నవ్వుతోంది సోఫాలోంచి లేచి అనిల్ వైపు వచ్చి హిస్టరికల్‌గా నవ్వుతూ వెనక్కి వెళ్లింది.

రీషా షాక్ తిన్నట్లుగా ఉంది.



"ఓ మైగాడ్-ఇంత షాకా!"

అనిల్ శిరీష భుజాలు పట్టి కదుపుతూ సోఫాలో కూర్చోబెట్టాడు.

"రీషీ! నవ్వావు" ఇంకా నవ్వుతోంది. హాయిగా నవ్వుతోంది.

"రీషా షాక్‌లో నవ్వుతోంది. ఓ గాడ్-ఫ్రెండ్‌కి హెల్ప్ చేయబోయి నా జీవితాన్ని పాడుచేసుకున్నానా!" అనిల్‌లో నిస్సత్తువ ఎక్కువయింది.

"రీషా! అలా నవ్వకు - నాకేదో భయంగా ఉంది. మాట్లాడు - నీ కెలా కావాలంటే అలాగే చేద్దాం." తల వెనక్కి వాల్చి నవ్వుతోంది. పిచ్చిగా నవ్వుతోంది. చెయ్యి ఊపుతూ నవ్వుతోంది. అనిల్ కళ్లల్లోకి నీళ్లు ఉబికి వచ్చాయి రెండు చేతులలో తలపట్టుకుని కూర్చున్నాడు.

రీషా షాక్‌లో ఉంది - ఏం చేయాలిప్పుడు? ఎలా? శిరీష సోఫాలోంచి లేచింది. - నవ్వుతూనే డైనింగు టేబులుపై నున్న ఎన్వలప్ తీసి అనిల్‌కి ఇచ్చింది. ఆ కవరులో సాటర్‌డే డిన్నరు థియేటర్‌లో కపుల్‌కి స్పెషల్ రిజర్వేషన్ టికెట్లు ఉన్నాయి అందులోనే ఒక నోటు కూడా ఉంది. అనిల్ నోటు తీసాడు-

డియర్ అనిల్,

నన్ను క్షమించు, నీకేమైనా మనసు నొప్పిస్తే - స్నేహితుణ్ణి మన్నించడం ఉత్తమ మానవ లక్షణం నిన్ను చాన్నాళ్లు తర్వాత చూసి చాలా హేప్పీగా ఫీల్ అయ్యాను. ఇక నాటకం - మల్హోత్రా డాక్టరు కాదు సైంటిస్టు. నాసాలో పని చేస్తాడు. బాంబె వచ్చినపుడల్లా మీటవుతూండటం మూలాన మంచి స్నేహితుడయ్యాడు

శిరీష చాలా తెలివైనది. నువ్వు హాయిగా జీవించాలని ఆశిస్తున్నాను. కీప్ ఇన్ టచ్, ఇంకెప్పుడూ జోక్స్ చేయను.

లవ్-రఘు (పి.జె.)

సారీ, అనిల్ నా రఘు కోరిక మీద ఆ యాక్ట్ చేసాను. మరోసారి కాలేజి నాటి అనార్కలీ, సలీము అయే అవకాశం ఇచ్చినందుకు థాంక్స్.

మీ స్నేహితురాలు లోరి - ఏనాడు లేనంత నీరసం వచ్చింది అనిల్‌కి, ఆ నీరసంలో నవ్వలేక హాయిగా ఉన్న మనసు లోలోన నవ్వుకుంటూండగా ముసిముసి నవ్వుల్లోకి దిగిన శిరీషను దగ్గరకు తీసుకున్నాడు. ○

సీరియల్

# మోహినీ తాండవం

డా. కొత్త రవీంద్రబాబు

**ఇంతవరకూ సాగినకథ- 9:** ప్రణవనాథ్‌ను మోహిని హత్య చేస్తుంది. ఆమెనుగురించి వివరాలు ఆరా తీయాలనుకున్న నందికేశ్వరకు చావుదెబ్బ తగుల్తుంది పుప్లాటోగా పిలువబడే రవితేజను కలుసుకొనేందుకు రేఖ వెళ్తుంది. అల్యూమినాఫ్యాక్టరీ మూలంగా ఏర్పడిన కాలుష్యంవల్ల నానాసాహెబ్ కూతురు మీరా, లారీ ప్రమాదంలో అల్లుడు కిషన్ మరణిస్తారు. రేఖతండ్రికి సహాయపడేందుకు రవితేజ తన గురూజీ అయిన నానాసాహెబ్ అనుమతి తీసుకొని పయనమవుతాడు.

(గత సంచిక తరువాయి)

రవితేజ సురేష్ బాబును సరిగ్గా ఉదయం ఆరున్నరకు కలుసుకో గలిగాడు.

బొంబాయికి ఆరు మైళ్ళ దూరంలోని ఎలిఫెంటా కేవ్స్ గుహ వున్న దీవి సమీపంలో 'సమీర' అనే చిన్న వోడ ఉపరితలభాగాన నిలబడి "సురేష్ బాబు గారిని కలుసుకోవాలి' అని అడిగా డతను వోడ క్యాప్టెన్‌ను

అంతకు ముందు బొంబాయి నుండి రవితేజను అక్కడకు తీసుకు వచ్చిన మోటార్ బోట్ సమీర పక్కన తల్లి బాతు పక్కన పిల్ల బాతులా సముద్రపు అలల్లో తూగుతూ వున్నది

"మిమ్ము రాగానే వచ్చి కలుసుకో మన్నారు' అన్నాడు క్యాప్టెన్ సమాధానంగా

"ఎక్కడ వున్నారు?" డెక్ నుండి కిందకు వెళ్ళే మెట్ల వంక చూస్తూ అడిగాడు రవితేజ.

"అదిగో" బైనాక్యులర్స్ యిస్తూ అన్నాడు కెప్టెన్. బైనాక్యులర్స్ తీసుకుని చూశాడు రవితేజ

సమీరకు అర మైలు దూరంలో సముద్రంలో యీదుతున్నాడొక వ్యక్తి!

"లైఫ్ బోట్‌లో వెళతారా?" కెప్టెన్ మాటకు సమాధానంగా పాంట్ షర్ట్ విప్పి డెక్ మీద పడవేసి సముద్రంలోకి దూకాడు రవితేజ.

మైలతుత్తం కరిగించు కున్నట్టు ఆకుపచ్చ నీలి రంగుల మధ్య షేడ్‌లో చల్లగా వున్న సముద్రపు నీటిలో యీదటానికి ఉత్సాహపడే రవితేజకు సమీర నుండి సురేష్ బాబు యీదుతున్న ప్రదేశానికి జేరటానికి అట్టే సమయం పట్టలేదు

"గుడ్‌మార్నింగ్ సార్"

"గుడ్ మార్నింగ్ రవితేజా! యు ఆర్ యాజ్ గుడ్ యాజ్ ఐ హియర్"

సురేష్ బాబు రవితేజ పరస్పరం విష్ చేసుకున్నాక పక్క పక్కనే యీదుతూ సముద్రపు వొడ్డు వైపుగా పయనించ సాగారు

"నా కంటే త్వరగా యీదే మనిషిని యీ రోజే చూసాను రవితేజా"

"సార్ మీరు నాకంటే పెద్దవారు."

"నీ కంటే చిన్న వాళ్ళెంతో మంది నాతో పాటు యీదలేక వెనకబడి పోయారు"

వొడ్డుకు చేరుకున్నారు రవితేజ, సురేష్ బాబు క్రచెస్ తీసుకు ఎదురైన వ్యక్తితో "మాధవ మీట్ మిస్టర్ రవితేజా!"

"గుడ్‌మార్నింగ్ రవితేజా"

"గుడ్‌మార్నింగ్."

మాధవ అందించిన క్రచెస్‌తో ఇసుక నేలమీద నెమ్మదిగా నడువసాగాడు సురేష్ బాబు

నీళ్ళలో సహజంగా యీదే చేప వొడ్డున గిలగిల లాడినట్టున్నది అతని నడక.

"సంవత్సరం నాడు కారు ఏక్సిడెంట్‌లో స్పైనల్‌కార్డ్ దెబ్బ తిన్నది కాళ్ళు రెండూ బాగా బలహీన పడ్డాయి.

"సురేష్ బాబు మంచాన బడ్డాడు' అనుకున్నారంతా. ప్రాక్టీస్ వలన



కొంతవరకు కండరాలకు శక్తి వస్తుందన్నారు డాక్టర్లు.

నాకు యీత అంటే చిన్నప్పట్నుంచీ సరదా అందుకే జనవాసానికి దూరంగా వచ్చి ఉదయాన్నే యీత కొడుతున్నాను డాక్టర్లు చెప్పినట్లే పరిస్థితి మెరుగవు తున్నది కాని యీ జన్మలో క్రచెస్ లేకుండా నడవలేను!"

సురేష్‌బాబు వంక పరీక్షగా చూసాడు రవితేజ. బొడ్డు పైభాగంలో ఛాతీ దండ ముంజేతి కండరాలు వస్తాదు కండరాలలా మెలి తిరిగి వున్నాయి. కాని బొడ్డు కింద భాగంలోని పిరుదుల కండరాలు, తొడ, కాళ్ళు బలహీనమై పోయి పుల్లల కాళ్ల మీద నిలబెట్టిన మనిషి బొమ్మలా వున్నాడు.

చప్పున తల తిప్పుకున్నాడు రవితేజ

"రవీ- నేనేదైనా సహిస్తాను గాని సాటి మానవుల జాలిని సహించ లేను. అందుకే ఎవరూ కనపడని నిర్జన ప్రదేశంలో యీత కొడుతుంటాను.

స్టెవార్డ్ అందించిన టవల్స్‌తో వళ్ళు తుడుచు కున్నారు రవితేజ, సురేష్ బాబు.

"బ్రేక్‌ఫాస్ట్ చేస్తూ మాట్లాడుకుందాం రవీ" లైఫ్ బోట్‌లో కూర్చుంటూ అన్నాడు సురేష్ బాబు.

పది నిముషాలలో సమీర క్యాబిన్‌లో పూర్తిగా డ్రెసప్పయి డైనింగ్ టేబిల్ కిరువైపులా కూర్చుని మాట్లాడుకో సాగారు యిద్దరూ

"రవీ- గూఢచారి విభాగం ఫైల్‌లో నీ గురించి రాసివున్న దానికంటే మిన్నగా ప్రవర్తించావు! హైజాక్ కాబోతున్న విమానాన్ని రక్షించటమే కాకుండా ప్రఖ్యాత పాకీస్తానీ స్పై రెహమాన్‌ను ప్రాణాలతో పట్టి బంధించ గలిగావు"

"రెహమాన్‌ను బంధించింది మీ అమ్మాయి రేఖ" నవ్వుతూ అన్నాడు రవితేజ.

"సో యు వాంట్ టు గివ్ ద క్రెడిట్ టు హర్. కాని హైజాకయి తిరిగి వచ్చిన విమానం నుండి ఎవరూ చూడకుండా ఎలా తప్పించుకో గలిగావు?"

"విమానం తిరిగి రాగానే గగ్గోలు మొదలైంది సీట్లకు కట్టివేసిన వాళ్లలో కొంత మంది స్త్రీలు ఫెయింటయ్యారు.



కొంత మంది హిస్టీరికల్‌గా ఏడ్వసాగారు విమానంలోకి వచ్చిన కొద్ది మంది సిబ్బంది హడావిడి పడిపోసాగారు ఆ సమయంలో వేషం మార్చి బయటకు వెళ్ళిపో గలిగాను రెహమాన్ తప్పించుకు పోకుండా రేఖ కాపలాగా వుండి పోయింది "

"నిజానికి రేఖ చేసిందేమీ లేదు రెహమాన్‌కు ఆరు గంటల తర్వాత గాని స్పృహ రాలేదు '

"అదే దెబ్బ వేరెవరికైనా తగిలితే రెండు రోజుల తర్వాత కన్ను తెరిచే వాళ్ళు రెహమాన్ కోట్ కాలర్ కొన కొంత దెబ్బను అద్దుకుంది అదీగాక అతని మెడ టెలిఫోన్ స్తంభంలా బహు బలిష్టంగా వుంది."

"గుడ్- రెహమాన్‌ను పట్టి యిచ్చిన వ్యక్తి ఎవరో తెలియక పోవడం నీకూ నాకూ క్షేమకరమే! ఇక అసలు విషయానికి వద్దాం- నిన్నెందుకు పిలిపించానంటే '

"చెప్పండి సార్"

"వ్యాపార సంస్థలు, పరిశ్రమలు స్థాపించాక అనేక చిక్కులు వస్తుంటాయి కొన్ని వాటంతట వచ్చేవి కొన్ని ప్రత్యర్థులు కల్పించేవి సరిగ్గా నాకు ఏక్సిడెంటయిన దగ్గర్నుండీ చికాకు లెక్కువయ్యాయి "

'సర్- మీకు ఏక్సిడెంట్ ఎలా అయిందో చెబుతారా?"

సాలోచనగా రవితేజ వంక చూస్తూ "నీ అనుమానం నాకర్థం అయింది!నాకూ ఆ ఆలోచన రాకపోలేదు " అన్నాడు సురేష్‌బాబు

'చెప్పండి' అన్నట్టు చూశాడు రవితేజ

"భారత దేశాన్ని పట్టి పీడిస్తున్న సమస్యలలో పెట్రోల్ కొరత వొకటి

ఇతర దేశస్థుల సహకారంతో లక్షదీవుల సమీపంలో సముద్రగర్భంలో ఆయిల్ వుందేమోనని పరిశోధనలు మొదలెడదామను కుంటున్న సమయంలో ప్రఖ్యాత పారిశ్రామిక వేత్త కపర్ది నరసింహ అనే అతన్ని పంపించాడు

నరసింహ కపర్దికి నమ్మిన బంటు



కుడిభుజం

"సురేష్‌బాబుగారూ- చమురు బావులు తవ్వాలని ప్రయత్నం మొదలెట్టారట?" అన్నాడు నరసింహ సంభాషణ మొదలెడుతూ

"అవును రాను రాను పెట్రోల్ కొరత ఎన్నో సమస్యలను సృష్టించబోతుంది "

"మా బాస్ కూడా అదే ఆలోచనలో వున్నాడు ఇప్పటికే మేం కొంత పురోగతి సాధించాం "

"అలాగా చాలా సంతోషం- ఎంతమంది యీ కృషిలో పాల్గొంటే దేశానికంత మంచిది!"

"మంచిదే కాని సురేష్ సాబ్ యిద్దరం విడివిడిగా కృషి చేసేకంటే కలసి కృషి చేస్తే ఎక్కువ ఉపయోగం వుంటుందేమో "

"ఊ! ఏమంటున్నావు? ఇది నీ ఆలోచనా- మీ బాస్ ఆలోచనా?"

"నా ఆలోచనే! మీరు సరేనంటే నేను బాస్‌తో చెప్పి వొప్పిస్తాను మా బాస్ ఆర్థిక పరిస్థితి గురించి నేను మీకు చెప్పనక్కర లేదనుకుంటా "

"మీ బాస్ ఆర్థిక పరిస్థితికేం?! కాని యీ విషయంలో యిప్పటికే 'మిల్క్‌వైట్' కంపెనీ వారి సహకారం తీసుకున్నాను "

"అమెరికన్ ఆయిల్ కంపెనీనా?"

"అవును "

"సురేష్ సాబ్- ఇతర దేశస్థులతో కలిస్తే వాళ్ళు మనకు టోకరా యిచ్చే అవకాశంవుంది "

"అలులేదు చూలు లేదు కొడుకు పేరు సోమలింగ మని- చమురు వున్నదో లేదో తెలియదు. వుంటే అది వెలికి తియగలమో లేదో, వెలికి తీసిన చమురు పనికి వస్తుందో లేదో, అప్పటికది. ఆర్థికంగా గిట్టుబాటవుతుందో లేదో- ఇలా ఎన్నో అవాంతరాలు దాటాక గదా మిల్క్‌వైట్ కంపెనీ వాళ్ళు మోసం చెయగలిగేది!

అయినా పరాయి దేశస్తులు యిక్కడకు వచ్చి మనను మోసం చెయ్యగలరా?"

"సురేష్ సాబ్! సముద్రంలో పెద్ద చేప చిన్న చేపను మింగినట్టు అమెరికన్ కంపెనీలు ప్రపంచంలో ఎన్నో దేశాలలో మర్రివూడల్లా శాఖోప శాఖలుగా విస్తరించుకుని చిన్న చిన్న కంపెనీలను కబళించి వేశాయి

మిల్క్‌వైట్ కంపెనీ మిమ్మల్ని ఉపయోగించుకుని తీరా ఆయిల్ కనుగొన్న తర్వాత మోసంచేసి మీ కంపెనిని దివాళా తీయిస్తుంది "

నాక్కొంచెం కోపం వచ్చింది "ఏమిటి నువ్వనేది? ' అన్నాను

"పరాయి దేశస్తులను నమ్మి బాగుపడ్డ వారులేరు ఆలోచించండి సార్ " అంటూ లేచి వెళ్ళాడు నరసింహ

"ఏమిటి తనుయిలా మాట్లాడ వెళ్ళాడు?" అని ఆలోచిస్తూ వుండిపోయానా రోజు

ఆ సాయంత్రం కపర్ది ఫోన్ చేసాడు కుశలప్రశ్న లయ్యాక "ఏం బాయ్ చాలా రోజులయింది మనిద్దరం కలసి మాట్లాడుకుని సాయంత్రం దిల్‌కుష్ హోటల్‌లో రూం నంబరు 303లో

## రోబోట్ తయారీలో మనవాడు

లక్నోలోని ఒక విద్యార్థి తయారు చేసిన రోబోట్ (మర మనిషి)కు బహుమతి లభించింది స్కాట్‌లాండ్‌లో జరుగుతున్న అంతర్జాతీయ రోబోటిక్స్ పోటీలో 16 ఏళ్ల విద్యార్థి అపాష్ పన్వార్ తయారు చేసిన "ఎయాన్' అనే రోబోట్ బహుమతితో పాటు ప్రశంసలను కూడా పొందింది మామూలు మనిషికంటే కూడా ఈ మర మనిషి సహకరిస్తాడట ఆవరణలోకి ఎవరైనా అక్రమంగా ప్రవేశిస్తే అలారం మ్రోగించడం, భవనంలోకి ఎంత మంది వచ్చింది లెక్కించటం, వర్షం పడ్డప్పుడు అలారం మ్రోగించడం, భవనంలో లైట్లు వెలిగించటం, ఆర్పటం వంటి పనులు చేస్తుందట 70 కిలోల బరువు, అయిదడుగుల ఎత్తు వున్న ఈ రోబోట్

రైతు బిడ్డ అయిన ఈ విద్యార్థి తను చదివే కళాశాల సైన్సు లేబొరేటరీలో ఈ రోబోట్‌కు రూప కల్పన చేశాడు

మాట్లాడుకుందాం రండి, అన్నాడు

'ఏ విషయం సార్? ఆయిల్ విషయం అయితే

'ఆగు బాయ్- తినబోతూ రుచి ఎందుకని- కాసేపు ప్రశాంతంగా మాట్లాడుకుందాం- రా-" అంటూ ఫోన్ పెట్టేసాడు

ఆలోచనలో పడ్డాను నేను కపర్ది స్వయంగా మాట్లాడుదాం రమ్మన్నప్పుడు వెళ్లక పోవటం అమర్యాదకరంగా వుంటుంది

కాని వెళ్ళాక ఆయన బాయ్- మనిద్దరం కలసి ఆయిల్ ఎక్స్‌ప్లోర్ చేద్దాం" అంటే ఏం చెప్పాలి?'

మిల్క్‌వైట్ కంపెనీతో యిదివరకే ఒప్పందం జరిగి పోయింది' ఆ ఒప్పందం రద్దు చేసుకోమంటే ఏం చెప్పాలి?'

ఆయిల్ త్రవ్వకాల విషయంలో మిల్క్‌వైట్ కంపెనీకి ఎక్కువ అనుభవం వుంది వారి సహకారం యీ విషయంలో ఎంతైనా అవసరం

తీరా దగ్గరకు వెళ్లి నో అనేకంటే అసలు వెళ్లక పోతేనే మంచిదేమో? అంత్య నిష్ఠూరం కంటే ఆది నిష్ఠూరం మేలేమో

కాని కపర్ది అంతటి ప్రముఖ వ్యక్తి మాట్లాడుదాం రమ్మంటే వెళ్లకపోతే బాగుంటుందా?

వెళ్దామా? వద్దా? తేల్చుకో లేక మనసులో గుంజాటన పడ సాగాను

చివరకు వెళ్లి మర్యాదగానే ఆయన ప్రపోజల్ తిరస్కరిద్దామన్న నిర్ణయానికి వచ్చాను'

దిల్‌కుష్ హోటల్ రూం నంబరు 303లో కపర్దిని కలుసుకున్నాను ఎంతో మర్యాద చేసాడు

"సురేష్ భయ్యా- అమెరికన్ ఆయిల్ కంపెనీ సహకారం తీసుకుంటున్నావట " అని అడిగాడు.

" అవున్సార్. నాకు ఆయిల్ ఎక్స్‌ప్లోరేషన్‌లో బొత్తిగా అనుభవం లేదు. మిల్క్‌వైట్ కంపెనీ వారికి ప్రపంచ వ్యాప్తంగా అనేక చమురు బావులున్నాయి కాల్టెక్స్, బర్మాషెల్ కంపెనీల కంటే ముందు నుండి ఆయిల్



## అమీర్‌ఖాన్ పూనా భార్య

**అ**మీర్‌ఖాన్‌కు యిటీవల కొన్ని సమస్య లెదురయ్యాయట ఈమధ్య అతను షూటింగ్‌కు వెళ్లిన సమయంలో "నేను అమీర్ భార్యని, పూనా నుంచి వస్తున్నా నని" చెప్పి ఒక యువతి యింట్లో జొరబడి నానా హడావుడి చేసిందట ఇంట్లో వాళ్లందరితో రసాభాసఅయి అందరూ రోడ్డెక్కారట ఈ డ్రామా చూసేందుకు జనం తండోపతండాలుగా వచ్చేశారు పోలీసులు జోక్యం చేసుకోవ టంతో ఈ డ్రామాకు తెర పడింది ఆ అమ్మాయి ఎవరో తెలియక అమీర్ బుర్ర బద్దలు కొట్టుకుంటున్నాడు, మళ్లీ వచ్చి హడావుడి చేస్తుందేమోనని

యిండస్ట్రీలో వున్నారు "

"అలాగా- బాగా అనుభవం వుందన్నమాట సురేష్ భయ్యా- మేమూ యీ మధ్య ఆయిల్ ఎక్స్‌ప్లోరేషన్ మొదలెట్టాం వుయ్-ఆర్ అన్ లక్కీ సో ఫార్!"

' కృషి మొదలెడితే ఫలితం ఎప్పటికైనా దక్కుతుంది "

"అవును!" మిల్క్‌వైట్ కంపెనీ వాళ్లకు ఎన్ని షేర్లు యిచ్చే ఒప్పందం చేసుకున్నావు?!"

"మిల్క్‌వైట్ కంపెనీకి నలభై తొమ్మిది' శాతం షేర్లు, నాకు యాభై వొక్క శాతం షేర్లు వుండేట్లు అగ్రిమెంట్ రాసుకున్నాం "

"గుడ్! ఏ పరిస్థితులలోనూ మెజారిటీ షేర్లు మిల్క్‌వైట్ కంపెనీకి జేరకుండా చూడు జుట్టు వాళ్ల చేతిలో చిక్కాక యిష్టం వచ్చినట్టు ఆడిస్తారు "

తలూపాను నేను.

"మరో మాట ఈ విషయంలో నువ్వూ నేనూ కృషి చేస్తున్నాం నీకే విధమైన సహాయం కావాలన్నా నిస్సంకోచంగా నన్నడుగు. సాంకేతిక పరంగా వివరాలు తెలుసు కోవాలంటే మా యింజనీర్లు నీకు కావలసిన సహకారం తందిస్తారు "

ఆశ్చర్యంగా తలూపాను.

"సురేష్- భారతదేశ పురోభివృద్ధికి సౌభాగ్యానికి దోహదం చెయ్యాలనే కోర్కెతో నేను పారిశ్రామిక వేత్తనయ్యాను దేశ సౌభాగ్యానికి నువ్వూ నేనూ దేశ ప్రజ యావన్మందీ చేయి చేయి కలిపి కృషి చేస్తే గాని భారత మాత సగర్వంగా సభ్య దేశాల మధ్య తల ఎత్తుకుని తిరగలేదు.

అందుకే యీ విషయంలో నువ్వూ నేను ప్రత్యర్థుల మని అనుకో నవసరం లేదు

మనం చేయి చేయి కలిపి ముందుకు నడువ వలసిన సహచరులం!"

అప్రయత్నంగా రెండు చేతులు జోడించి నమస్కరించాను స్వాతంత్ర్య సమరంలో కపర్ది పాత్ర తక్కువది కాదు. అదృష్టం వక్రించ బట్టి గాని లేకపోతే ఆయన ప్రధాన మంత్రి అయివుండేవాడని విన్నాను

కేవలం దేశభక్తితో ఆయన సూచించిన సలహాను నరసింహ కేవలం వ్యాపార దృష్టితో ఆలోచించి వుంటాడు

"వస్తాను సార్" అన్నాను లేచి నిలబడుతూ లేచి వాకిలి దగ్గర దాకా వచ్చి "విష్ యు ఆల్ ది బెస్ట్" అన్నాడు కరచాలనం చేస్తూ

"థాంక్యూ సార్ విష్ యు ద సేం" అంటూ వచ్చేసాను ఇంటికి తిరిగివస్తూ" అనవసరంగా కపర్దిని అనుమానించాను! ఇంకా నయం నేను ఆయన మీద అనుమానంతో ఆయన పిలవంగానే హోటల్‌కు వెళ్లకుండా వుండిపోయాను గాదు!

అందుకే తొందరపడి నిర్ణయాలు తీసుకో గూడ దంటారు!"

"బాప్‌రే" డ్రైవర్ అరుపులకు ఆలోచనల నుండి బయటపడి చూచాను

## ఆంధ్రసచిత్రవారపత్రిక

# పాఠకులకు ఒక విజ్ఞప్తి

**'వీక్లీ' మీది; మీకేం కావాలో మీరే చెప్పండి!**

★ మీ కెటువంటి సీరియల్సు కావాలి? ఏ రచయిత సీరియల్స్ కావాలి?–

(రెండు కారణాలు చెపుతూ– క్లుప్తంగా రాయండి.)పత్రిక కొని చదువుతారా? లైబ్రరీలో నా?'

★ కథలు– ప్రేమ కథలా? ట్రాజడీ కథలా? కామెడీ కథలా? సెక్సు కథలా?

(మీ యింట్లో అందరూ వీక్లీ చదువుతారా?– ఎంత మంది చదువుతారో, వారి వయస్సులు కూడా రాయండి.)

★ పత్రిక వీక్లీ కాకుండా మీరు చదివే మరో పత్రిక ఏది? ఎందుకని?

★ మీ స్నేహితులకు కూడా యీ ప్రశ్నావళి యిచ్చి వారి అభిరుచులు కూడా రాయమనండి.

★ పత్రికలో వస్తున్న శీర్షికలలో ఏది మీకు యిష్టం వరుసలో 1, 2, 3 అని రాసి కారణం గూడా చిన్న వాక్యంలో రాయండి!

★ ముఖ చిత్రాలు:– మీ మిత్రుల్ని,యింట్లో సభ్యుల్ని అడిగి– ఎటువంటి ముఖచిత్రాలు, ఏయే సినిమా తారల ముఖచిత్రాలు కావాలో తెలియ జేయండి!

★ ఇప్పుడున్న శీర్షికలలో దేన్ని మీరు మొదట చదువుతారు? మీ యింట్లో వారు దేన్ని యిష్టపడతారు? సస్పెన్సు– ప్రేమ– సైన్సు– సాంసారికం ఏది మీకు యిష్టం? బొమ్మలు– గేయాలు– **టిట్ బిట్స్** వగైరాలో మీ అభిరుచులు కూడా తెలియ జేయండి!

ఈ ప్రశ్నావళికి మీ జవాబులు కార్డు మీద గాని,యిన్‌లాండ్ కవర్ మీద గాని రాసి, ఎడిటర్, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ– 3 అన్న చిరునామాకి పంపండి.

పత్రికను సర్వాంగ సుందరంగా నిత్య నూతనంగా తీర్చి దిద్దడం కోసం మాతో సహకరించండి.

– ఎడిటర్

పెద్ద డెలివరి ట్రక్ ఎదురుగా వస్తున్నది మా డ్రైవర్ హెడ్‌లైట్లు డిమ్ చేసినా ట్రక్ లైట్లు రాక్షసికళ్లలా వెలుగుతూనే వున్నాయి

డ్రైవర్ చప్పున పక్కకు తిప్పాడు కారును ట్రక్ పక్కకు తిరిగింది మళ్లీ ఇవతలకు తిప్పబోయాడు అంతే!

పెద్ద శబ్దం– గాజు పెంకులు! పిండి, పిండిగా ముక్కలుగా మారి దూసుకు వెళ్లడం, డ్రైవర్ ఆర్తనాదం, చీకటి ముసురుకున్నట్లు అనిపించి కళ్ళు మూతలుపడ్డాయి

హాస్పటల్ మంచం మీద కళ్ళు తెరిచాను రేఖ నిశ్చింతగా వున్నట్లు కనపడటానికి విశ్వప్రయత్నం చేయటం చూచాను

చేతికి డ్రిప్‌గుండా రక్తం ఎక్కుతున్నది బొడ్డుకింద శరీరంలో ఏదో మార్పువచ్చిందనిపించింది కాళ్ళు కదిలించబోయాను ఐస్‌లో వుంచితే పట్టుబడ్డట్లు చల్లగా కదలిక లేకుండా వుండిపోయాయి వివరాలు తెలిసాయి

వెన్నెముకలో దిగబడ్డ యినుపముక్కను ఆపరేషన్ చేసి తొలగించారు కాళ్ళు రెండూ పట్టుబడే అవకాశాలెక్కువ ఫిజియోథెరపి, విపరీతమైన శ్రమ చేస్తే కొంత శక్తి కాళ్ల కండరాలకు రావచ్చు

అప్పట్నుంచీ విపరీత శ్రమచేసి కొంత వరకు కాళ్లలో శక్తి పుంజుకో గలిగాను

హాస్పటల్‌లో వున్నన్నాళ్ళు కపర్ది పూలగుత్తులు పంపేవాడు త్వరగా కోలుకొమని సందేశాలు పంపాడు స్వయంగా వచ్చి చూచి వెళ్లాడు కూడా!

నా కారును పనికిరాకుండా ముక్కలు చేసి డ్రైవర్ ప్రాణాలు తీసి నన్ను శాశ్వత వికలాంగునిగా చేసిన ట్రక్ ఆచూకీ తెలియ రాలేదు!

ట్రక్ నంబరు ఏమిటో పోలీసులు తెలుసుకోలేకపోయారు చూచినవాళ్ళు చెప్పిన నంబరు గల ట్రక్ ఏదీ భారతదేశంలో నే లేదు!

స్మగుల్డ్ గూడ్స్ తసుకు వెళ్లే ట్రక్‌లకు దొంగలైసెన్స్‌లు వేసుకుంటారు

బహుశ ఆ ట్రక్ కూడా స్మగుల్డ్ సరకు

తీసుకు వెళ్తుందేమో? అందుకే ఆ డ్రైవర్ కంగారుగా నడుపుతూ ఏక్సిడెంట్ చేసాడని నిర్ధారించారు పోలీసాఫీసర్లు!

రవితేజ నాలుక చివరదాకా వచ్చిన మాట ఆగిపోయింది.

"ఏమిటో చెప్పబోయావు రవీ"

"ఏం లేదు సార్!"

"నువ్విది వరకు గూఢచారి ఏభాగంలో పని చేసావు. నీకెంతో మంది ఎక్స్ ఏజెంట్లు మన దేశస్తులు విదేశస్తులతో పరిచయం వుండి వుంటుంది."

తలూపాడు రవి.

"డబ్బు విషయం గురించి ఆలోచించవద్దు. మనకు చిక్కులు వచ్చినప్పుడు కావలసినంత మంది సమర్థులను పిలిపించి కావలసినంత డబ్బు యిచ్చి సమస్య పరిష్కారం చేయించాలి!"

"అలాగేసార్! ఇప్పుడేదైనా ప్రాబ్లం వుందా?"

"ఉంది రవీ. మిల్క్ వైట్ కంపెనీ నుండి ప్రఖ్యాత సైంటిస్ట్ హూవర్ వచ్చాడు. ఆయన కంటితో చూచి ముక్కుతో వాసనపీల్చి నాలుక కొనతో రుచిచూచి మనం యిచ్చిన మట్టి రేణువులు ప్రపంచంలో ఏ భాగంలో నుంచి తెచ్చిందీ అక్కడ భూగర్భ నిక్షిప్తమై చమురువున్నదీ లేనిదీ, వుంటే ఎంత లోతున ఎంత పరిమాణంలో లభ్యమవుతుందీ చెబుతాడు

అరేబియా మహాసముద్రంలో, బంగాళాఖాతంలో, థార్ ఎడారిలో కొన్ని శాంపిల్స్ తెచ్చి ఆయనకు చూపుదామని అనుకున్నాము. కాని ఆయన"

"ఎవరో కిడ్నాప్ చేసారు గదూ!"

"అవును రవీ– ఇదిగో ఇందాకే యీచీటీ సమీర్స్టెవర్డ్‌కు ఎవరో దెస్తవాడు అందించి వెళ్లాడట.

చీటీ పరిశీలనగా చూడసాగాడు. ఎవరో చదువు సరిగా రానివాళ్లు రాసినట్లు గజిబిజిగా వుంది వ్రాత.

"హూవర్ దక్కాలంటె పాతిక లక్షలు తీసుకుని రేపు రాత్రి ఎనిమిదింటికి ఎలిఫెంటా కేవ్స్ వద్దకు రావాలి పొరపాటు చేసారో హూవర్ శవం కూడా



మీకు దక్కదు".

"ముప్పై ఏడు గంటల సమయం యిచ్చారు పర్వాలేదు" అన్నాడు రవి

సమీర డెక్ మీద పచార్లు చేస్తూ మనసులో పథకం సిద్ధం చేసుకున్నాడు రవితేజ

మనీ, మెన్, మేటర్- ఏ విషయంలోను లోటు లేదు. సమయం తగినంత వుంది పకడ్బందీగా ప్లాన్ వేసుకోవాలి

పదునైన చాకు హల్వా ముక్కను చీల్చినట్లు సముద్రపు నీటిని చీల్చుకుంటూ ముందుకు సాగింది. సమీర.




రవి ఆలోచనలు ఒక కొలిక్కి వచ్చాయి అబెవార్ (జర్మన్ యింటిలిజెన్స్) మాజీ సభ్యుడు రోజర్; ఎస్ డి యి సి యి (ఫ్రెంచ్ సీక్రెట్ యింటిలిజెన్స్ సర్వీస్) మాజీ సభ్యుడు, లపిరిలను వెంటనే బొంబాయి రప్పించాలని అనుకున్నాడు.

ఈ లోపల చేయాల్సిన పని గురించి ఆలోచన సారించాడు.

* * * * *

ఆరడుగుల అరబ్ షేక్ గడ్డం మీసం పాంట్ షర్ట్ మీద వదులైన తెల్లని అంగరఖాలు తల మీద ఆచ్ఛాదన పూడకుండా నుదిటిపైన రింగ్- ఎలిఫెంటా

కేవ్స్ బీచ్ దగ్గర నిలబడి సముద్రంలోకి చూస్తున్నాడు

నిముషాలలో అతని చుట్టు చిన్న పెద్ద పాతిక మంది జేరారు మొలకు చిన్న లుంగీలాంటి ఆచ్ఛాదన లేకపోతే, చిన్న నిక్కర్ వున్న మొగపిల్లలు, యువకులు- షేక్ వంకే కన్నార్పకుండా చూడసాగారు

షేక్ వెనుకకు తిరిగి గుంపు వంక పరీక్షగా చూస్తూ అందర్లోకీ చురుగ్గా కనపడ్డ యువకుని దగ్గరకు రమ్మని సైగ చేసాడు ఆ యువకుడు ప్యాంటు,స్పోర్ట్స్ బనియన్ వేసుకుని వున్నాడు.

"సరుకు వోడ నుంచి తీసుకుని రావాలి-నీ వలన ఆ పని అవుతుందా?" యువకుడిని అడిగాడు షేక్

యువకుడు క్షణం సేపు తటపటాయించి తల అడ్డంగా తిప్పాడు.

నీ పేరు?"

"డిసోజా".

వంద రూపాయల నోటు నాలుగు మడతలు పెట్టినది యువకుని చేతిలో వుంచాడు షేక్

"డిసోజా- మంచి బేరం- జాగ్రత్తగా పని చేస్తే పదివేలు దొరుకుతుంది".

డిసోజా కళ్లలో ఆశ పెరిగింది. "ఉండండి. మా గురూగార్ని పిలుచుకు వస్తా"

"ఈ జనం?!"

"వీళ్లు అంతా మావాళ్లే- చస్తే విషయం పోలీసులకు చెప్పరు. అయినా

పంపించి వేస్తాలెండి".

డిసోజా పెడబొబ్బలు విని చుట్టూ జేరిన గుంపు చెల్లాచెదరయ్యారు గాని వాళ్లంవరూ కొంత దూరాన వున్న చెట్ల వెనుక నాటు పడవల వెనుక గుడిశెల వెనుక నక్కి షేక్ వంకే చూస్తున్నారు.

"డిసోజా నక్కను తొక్కాడు" అనుకోసాగారు వాళ్లు. పది నిమిషాలలో తిరిగి వచ్చాడు డిసోజా. అతని వెనకాల ముప్ఫై సంవత్సరాలతను అడ్డదిడ్డంగా లుంగీ కట్టుకుని కళ్లు నులుముకుంటూ వచ్చాడు గుల్‌మొహర్ పూవుల్లా అతని కళ్లు ఎర్రగా వున్నాయి.

బ్రాందీ కైపు మగత నిద్రను బలవంతాన వదలించుకుంటూ "సలామాలేకుం షేక్ సాబ్"! అన్నాడతను

'ఈయన పింటో- మీకేం పని కావాల్సినా చేసి పెడతాడు" పరిచయం చేసాడు డిసోజా

"పింటో"

షేక్కు మళ్లీ వంగి సలాం చేసాడు పింటో

"చెప్పినట్లు చేసిన వాళ్లకు కావలసినంత డబ్బు యిస్తాడు మా బాస్ ద్రోహం చేసిన వాళ్లను గొంతు కోసి సముద్రంలోని చేపలకు ఆహారంగా వేస్తాడు"

షేక్ అంటే గౌరవం. భక్తి పెరిగిన పింటో వంగి సలాం చేసి "సాబ్ ఇలా రండి" అంటూ బీచ్ వొడ్డున నడిచాడు

బీచ్‌లో ఒక వార చిన్న పాక కింద చెక్క బల్లలున్నాయి

"బైఠియే సాబ్"

## గొప్ప క్యాలెండర్

ఇటీవల అనేకమంది అనేక విధాలుగా రికార్డులు సాధిస్తున్నారు. బియ్యపుగింజమీద, వెంట్రుకలమీద అక్షరాలు వ్రాసి పేరు ప్రఖ్యాతులు గడిస్తుండగా ఒక ఇంజనీరు తాళంగుత్తి రింగుమీద 5 వేల సంవత్సరాలవరకు సరిపడా తేదీలు, వారాలు తెలియజేసే క్యాలెండర్ వేశాడట. అజయ్‌కుమార్ ఖేతాన్ అనే ఈ ఇంజనీరు ఈ క్యాలెండర్‌ను ఎన్నేళ్లవరకు కావాలంటే అప్పటివరకు పొడిగించుకోవచ్చునంటున్నాడు. 5 వేల సంవత్సరం వరకు బ్రతికున్నప్పటి సంగతికదా!

# మోహినీ తాండవం

షేక్ బల్ల మీద కూర్చోగానే పరుగెత్తుకు వచ్చిన డిసోజా గ్లాసులో స్కాచ్ విస్కీ సోడా కలిపి యిచ్చాడు.

మటన్ బిర్యానీ తినేవాడికి మామూలు అన్నం పెట్టినట్లు రాయల్ సెల్యూట్ చివాస్‌రీగల్ తాగేవాడికి యీ పాడు సరుకిస్తావా" తల అడ్డంగా తిప్పాడు షేక్

తల మీద కొట్టుకుంటూ "మాఫ్‌కీజీయే మహరాజ్" అన్నాడు పింటో షేక్‌తో.

"పింటో కర్చులకుంచు" అయిదు వందల రూపాయల నోట్లు రెండు యిస్తూ అన్నాడు షేక్

వంగి సలాం చేసాడు పింటో

పింటో - మా బాస్ కొత్తగా వ్యాపారం మొదలెట్టాడు బహు సరసుడు. చెప్పిన పని చేస్తే మంచి నజరానా యిస్తాడు".

శ్రద్ధగా వినసాగాడు పింటో

షేక్ డిసోజా వంక చూచాడు అతని చూపు అర్థం చేసుకున్న పింటో "అరే డిసోజా- కొబ్బరి బోండాం తీసుకురా, షేక్ సాబ్‌కు దప్పికగా వుంది" అన్నాడు

డిసోజా పరుగెత్తుకు వెళ్లాడు.

"పింటో- పోటీ లేని చోట వ్యాపారం బాగా సాగుతుంది ఇక్కడ స్మగ్లింగ్ చేసే గాంగులు వేరే ఏమీ లేవు గదా?".

"ఇప్పుడేం లేవు సాబ్. సంవత్సరంనాడు స్మగ్లర్ సులేమాన్ ముఠాని ఎర్ర తలలోళ్లు పట్టుకెళ్లాక మా దీవికి బయట నుంచి మనిషి రావడం లేదు. పని లేక ఆకలితో అలమటించి పోతున్నాం! మొన్న మాత్రం ."

"ఏమయింది? చెప్పు?!"

క్షణం తట పటాయించి "సమీర పడవలో వున్న వారికి చీటీ యిస్తే వెయ్యి రూపాయలు యిస్తానన్నాడు వొకతను. అతను చెప్పినట్లే చేసాను".

పగలబడి నవ్వి • "వాడు మావాడే-మొన్నటి నుంచీ కనపడకుండా పోయాడు! సూరజ్ చీటీ నీ ద్వారా పంపాడన్న మాట!

ఊ! గుడ్! వెదుకబోయిన తీగె కాళ్లకు తగిలిందంటారు. సూరజ్ కనపడ్డం లేదు చూడు అని బాస్ అన్నాడు.

"నీకు చీటీ యిచ్చాక వాడెక్కడికి వెళ్లాడో నీకేమైనా తెలుసా?"

"మొన్న రాత్రి నాగూర్ పడవలో వచ్చాడు సూరజ్ ఎల్లుండి పొద్దున యీ చీటీ సమీర అనే చిన్న వోడలో యిస్తే వెయ్యి రూపాయలిస్తా అన్నాడు.

"చెప్పుకున్నాను. వెయ్యి రూపాయలూ, చీటీ యిచ్చి మళ్లీ నాగూర్





'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.

# వీక్లీపోస్ట్

## విద్యుత్ కోత

మహిషాసుర మర్దని ముఖచిత్రం సూపర్బ్! ఆంధ్ర
త్రవార పత్రికలో 'సహజవాయు విద్యుత్ శకం' అన్న
టోరియల్ అత్యంత విజ్ఞానదాయకం. గ్యాస్ ఆధారంగా
ద్యుత్ ఉత్పాదన చెయ్యడం నిజంగా నవశకానికి నాందే!
సులోను గత కొద్ది సంవత్సరాలుగా విద్యుత్ కోతని ఎదు
ంటున్న మన రాష్ట్రంలో విజ్జేశ్వరంలాంటి 'సహజవాయు
ద్యుత్ కేంద్రాలు' ఎంతో అవసరం. ఇది అక్షర సత్యం
మన గోదావరి బేసిన్‌లో అపారమైన సహజవాయువు
లు వున్నాయని తెలుస్తోంది కొన్నిచోట్ల సహజవాయు
భూమినుంచి వెలుపలికి తీస్తోన్న ప్రయత్నాలు జరుగుతు
యి. కొన్నిచోట్ల విజయవంతంగా బయటికి తీస్తున్నారు
నరసాపూర్, లింగంబోయినచర్ల వగైరా, ఇంకా మండ
జోలులో త్వరలో సహజవాయు ఉత్పత్తి జరగటానికి
మవుతోంది. అటువంటి సమయంలో ఎడిటర్‌గారు
ట్లు మన రాష్ట్ర ప్రభుత్వం మనకవసరమైన గ్యాస్‌ని
చేయటానికి కేంద్రాన్ని ఒప్పించి, గ్యాస్ అథారిటీ
ఇండియా వారి అనుమతితో విజ్జేశ్వరం ప్రాజెక్టుని
తగతిని పూర్తిస్థాయికి చేరుకొనేటట్లు చెయ్యాలి అప్పుడే
న రాష్ట్రం ఎదుర్కొంటున్న విద్యుత్ కోత కొంతవరకూ
ష్కారం కాగలదని నా నమ్మకం ! అభినందనలు !

సి రవితేజశ్వి,
చింతలూరు

## విలువలు

-9-90 సంచిక 'మహిషాసుర మర్దిని' ముఖచిత్రం
ఉంది ఈ సంచిక దసరా ప్రత్యేక సంచికగా
ద్దుకున్నట్లుగా తయారైంది నవరాత్రుల గురించి
బొమ్మలతో సహా వివరాలు తెలుసుకోదగ్గవిగా ఉన్నవి డా.
మిరియాల రామకృష్ణ గారి కవిత 'బదిలీ బదిలీ' వాస్తవా
నికి దగ్గరగా ఉండి బాగుంది. క్యారికేచర్స్ అంటే ఇలా
ఉంటాయి శీర్షిక బాగుంది అన్నింటికంటే ముఖ్యంగా వెండి
తెరమీద వెలుగుతున్న కుటుంబ సభ్యులు ఈ వారం పత్రికకే
హైలెట్. బొమ్మలతో పొందుపరిచిన తీరు అభినందనీయం
పత్రిక ఆలస్యమౌతుందన్న బాధ తప్ప మూడు తరాలుగా
చదువుతున్న అత్యధిక సర్క్యులేషన్, సాహితీ విలువలు గలిగిన
పత్రిక బహుశా దీని తర్వాతే మిగతావని నా అభిప్రాయం
కథల్లో 'దిష్టి' వాస్తవానికి దగ్గరగా ఉండి, మధ్యతరగతి
కుటుంబాల్లో ఇలాటి సన్నివేశాలు ఎన్నో జరుగుతుంటాయి
అయితే ఈ కథారచయిత, పత్రిక ఎడిటర్ ఒక్కరేమోనని
నా అనుమానం. యామై కరెక్ట్! ప్లీజ్ అన్సర్

* మీరు కరక్టే ! - ఎడి

పి వెంకటాచారి,
బోడుప్పల్

## హర్షించదగిన ప్రకటన

భలేమామ, టపాకాయ తుస్సుమంది- కథలు రెండిం
ట్లోనూ వెరైటీ కొరవడిందనే చెప్పాలి మిగిలినవి స్థాయిని
నిలబెట్టాయి. మీప్రచురణల గ్రూపుగురించి వ్యాపించేపుకా
ర్లను నమ్మవద్దంటూ మీరు వాస్తవాన్ని తెలుపుతూ ప్రకటన
ఇవ్వటం ఎంతయినా శ్లాఘనీయం పాఠకుల పట్ల మీకున్న
అపార విశ్వాసం ఎన్నదగినది

ఎస్. ఇందిరాదేవి,
తుని

## మరువలేనిది

పత్రిక మరువలేనిదిలా ఉంది. 'భలేమామ' కథ గ్రేట్!
దీపావళి కథ తుస్సుమంది చాలా బాగుంది.

- కె ఎస్ పి,
గన్నవరం

వెళ్ళిపోయాడతను "
గూర్‌ను పిలిపించు సూరజ్
కీ చెబుతాడు బహుశ అతను ఏ
ల్ రూంలో నో మత్తులో జోగుతూ
డు!"
షంలో పిలిపిస్తాను సాబ్"
ముషాల తర్వాత సలాం చేసి
మరుగా చేతులు కట్టుకు
కు నాగూర్
గూర్ సూరజ్ ఎక్కడున్నాడో
"షేక్ అడిగాడతను
గూర్ సమాధానం చెప్పకుండా
అటూ యిటూ చూసాడు

"చెప్పు నాగూర్‌మియా- మొన్న రాత్రి
నువ్వు పడవలో తీసుకుని వచ్చినాయన
షేక్ సాబ్ మనిషి మొన్నట్నుంచీ కనపడ్డం
లేదట అందుకని అడుగుతున్నాడు"

నాగూర్ తటపటాయించటం చూసి
రెండు వంద రూపాయల నోట్లు
అతనికివ్వమని ఎంటో చేతిలో వుంచాడు
షేక్

"అరే నాగూర్‌మియా! షేక్ సాబ్ అంటే
ఏమనుకున్నావు కోట్ల మీద వ్యాపారం!
ఆయన కన్ను మన మీద పడాలేగాని మన
పల్లె చరిత్రం కాస్తా తీరిపోతుంది
ఏమనుకున్నావో!

"ఆయన్ను జుహు బీచ్ దగ్గర
దింపేశాను బీచ్ పక్కన వున్న ఓ ముత
కారు డ్రైవ్ చేసుకు వెళ్ళిపోయాడు
వచ్చేప్పుడు ఆ కారులో నే వచ్చాడు

'ఆహా- అయితే సూరజ్ పూనా వెళ్ళి
వుంటాడు సరే వస్తా ఎంటో - నాగూర్ పడ
కి పడవలో నన్ను జుహు బీచ్‌
తీసుకువెళ్ళు"

(ఇంకావుంది)




ఆంధ్ర సచిత్ర వార పత్రికలో సచిత్రంగా

అతి త్వరలో ప్రారంభం

# ప్రయాగ రామకృష్ణ

ఎపిక్ ఫాంటసీ సోషియో థ్రిల్లర్

# "మణికంఠుడు"

బొమ్మలు : గంధం

ఈనాడు అయ్యప్పస్వామిగా యావద్భారతంలో ఖ్యాతి

అంతర్జాతీయ విఖ్యాతి పొందుతున్న 'స్వామి'

సంగ్రామ చరిత్ర కోసం

## మణికంఠుడు

ధారావాహిక చదవండి

అయ్యప్ప భక్తుల కో